















భావయామి వేంకటేశం

శ్రీరస్తు

శుభమస్తు                                                   అవిఘ్నమస్తు

# భావయామి వేంకటేశమ్

## సంపుటి-VI

## ఎన్నుకోబడిన
## అన్నమాచార్యుల సంకీర్తనలకు
## మున్నుడి

మరియు

## భావామృతం వివరణ

రచన
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.

# భావయామి వేంకటేశమ్

సంపుటి-VI

మొదటి ప్రచురణ
**జనవరి 2012**

రచన
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.
**Cell: 9393021360**

వెల : అమూల్యం

ప్రతులకు :
ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం.61, సిద్ధార్థ నగర్,
హైదరాబాద్ - 38. ఫోన్ : 093930 21360

డి.టి.పి. & ప్రింటింగ్ :
కె. మురళీ కృష్ణ
9848 51 51 09





## అన్నమాచార్యులవారి
## 602వ జయంతి సందర్భంగా భక్తితో

ఆ.వె॥ ఇష్టదేవతలను యెల్లర భావింతు
'వేంకటేశ్వరునిగ, వేడుకొనెద
అన్నమయ్య కృతికి అత్యంత సులువైన
వివరమీదలంతు విజ్ఞులార!

- రచయిత



## అంకితము

చం॥
హరివెలయింపగా నరిగి ఆయన నందక ఖడ్గ మీభువిన్
వరముగ రూపుదాల్చి నుతి బాడెను కమ్మని కీర్తనంబులన్
వరదుడు "అన్నమయ్య" హరి భక్తుడు యందరి మోక్షదాతయున్
గురువుగనెంచి అంకితము కోరిక తీరగ నిత్తు నీకృతిన్.

# భావయామి వేంకటేశమ్

## సంపుటి VI

### అన్నమయ్య కీర్తనల విషయ సూచిక

భావయామి వేంకటేశం

భావయామి వేంకటేశం

# ప్రార్థన

కం॥ శ్రీవల్లభ! మున్నుడితో
భావంబును గూర్చ ఐదువందలు దాటెన్
దేవా! అన్నయ కీర్తన
లేవేవోయెన్నితినిర హితవుగ నీకై.

ఆ.వె॥ అన్నమయ్య పాట ఆణిముత్తెపు మూట
అతని కీశ్వరుండు హరియునొకటె
ఉత్తమముగ బలికె నూయల కృష్ణుడు
ఎక్కినిలిచినాడు ఏడుగిరులు.

కం॥ శ్రీకర వేంకటనాథా!
చేకొని నాబోంట్లచేత చెప్పింతు వహో!!
తూకపు మున్నుడి, భావము
ఈ కడనా అన్నమయ్య ఇంపుకృతులకున్

ఆ.వె॥ శ్రీరఘువర! రామ! సీతామనోహర!
మున్నుడి వివరముల నెన్నుకొంటి
పరవశించి చెబుదు భావామృతము నేను
అన్నమయ్య కవిత అద్భుతముర.

ఆ.వె॥ విత్తునాటువాడు విష్ణుడే నాట్లకు
నీరమిచ్చునదియు నిజము వాడె
అన్నమయ్య కరుణనందిన వానికి
తిరుమలయ్య కృపయు దొరకునయ్య



## ముందు మాట (సంపుటి-VI)

"మాయా మేయ జగంబు నిత్యమని సంభావించి"....అని హరిశ్చంద్రుడు కాటికాపరియై వేదాంతం తెలుపుతాడు. మన మాతృభాష అయిన ఈ తెలుగు ఎంత అద్భుతమైన భాష అంటే, ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. పై వాక్యంతో నా ముందుమాట ఎందుకు మొదలు పెట్టానంటే....

భగవానుడు తిప్పుతున్న ఈవిశ్వాన్ని మాయ ఆవరించి, సత్యం అసత్యంగాను, అసత్యం సత్యంగాను గోచరిస్తుంది. మిధ్య అయిన వన్నీ నిజాలుగా భావించి మనకు మనమే 'ధనం' అన్నదాన్ని సృష్టించుకొని దానితో పొందగలిగే సుఖాలన్నీ నిజంగా సుఖాలు కాదని, నివురు కప్పిన నిప్పులా,దుఃఖమే సుఖమనే వేషంలో వచ్చినదని, దానిని నమ్మరాదని పెద్దలు ఏనాడో చెప్పారు. పంచమ వేదమయిన భారతంలో చెప్పినదే 15 వ శతాబ్దిలో తాళ్ళపాక అన్నమాచార్యులవారు అద్భుతమైన తెలుగు కీర్తనలలో చెప్పారు.

తెలుగులో ఆ మహానుభావుడెందుకు చెప్పారంటే...తెలుగులో ఒక చిన్నమాటలో ఎంతో గొప్పభావం తెలుపవచ్చును. ఒకే అక్షరాన్ని రకరకాలుగా పలికి రకరకాల అర్థాలు వచ్చేట్లు చేయువచ్చును. ఉదాహరణకి 'ఆ' అనే అక్షరం గమనించండి. 'ఆ' అంటే 'అది' అని అర్థం. ( 'ఆ' పుస్తకం ఇటివ్వు). 'ఆ' అంటే 'ఏమిటి'? అని అర్థం ('ఆ' ఏమన్నావు ఇంకోసారి చెప్పు).'ఆ' అంటే 'అవును' అని అర్థం. ('ఆ' నేనూ సభలో వున్నాను). ('ఆ') అంటే ప్రశ్నార్థకం ('ఆ' అలా అయిందా?)

మళ్ళీ ఇంకొక్కసారి ఈ ముందుమాటలోని మొదటి వాక్యం గమనించండి. 'వేదాంతం తెలుపుతాడు'-అన్న వాక్యంలో తెలుపుతాడు అంటే తెలియజేస్తాడు అనే కదా! అర్థం. తెలుపు ఒక రంగు. తాడు, కట్టటానికి ఉపయోగపడే ఒకనూలు. రెండూ కలిపితే తెలుపుతాడు (తెలియజేస్తాడు) అయింది.





ఇంత విశాల పరిధి వున్న భాష కాబట్టే తాళ్ళపాక అన్నమాచార్యుల వారు తన కీర్తనలకు ఈభాషనెన్నుకొన్నారు. అన్నమయ్య సంకీర్తనలలో దైవస్తుతి కీర్తనలు కొన్ని సంస్కృతంలో వున్నా అవి సంఖ్యలో చాల తక్కువ, జన ప్రియత్వంలో ఎక్కువ.

దేశభాషలందు తెలుగులెస్స- అని శ్రీ కృష్ణ దేవరాయలు ఊరకనే అనలేదు. సంస్కృతం నుంచి ఆవిర్భవించినా తనదైన శైలిలో జాను తెలుగుగా రూపు దిద్దుకొని పల్లెల్లో నాట్లు వేసుకొని నేటికీ అజరామరంగా ఉన్నది జానపదుల తెలుగు. కాకపోతే నేటి ఇంగ్లీషు వ్యామోహం వల్ల బలహీనమై నాబోటి వాడి పద్యానికే తాత్పర్యం వ్రాయాల్సిన అగత్యం ఏర్పడింది.

అన్నమయ్య కీర్తనలకు భావం వ్రాయాలని నేను నిశ్చయించుకొని ఒకరి సలహా అడిగితే. తెలుగు కీర్తనలకి వివరణ అవసరమా అన్నట్లు మాట్లాడారు. పరమాత్మ దశావతారములను అచ్చతెలుగులో పాడిన అన్నమయ్య కీర్తనలు చూడండి. దీనికి సరి అయిన అర్థం (భావం) 'నాకు తెలుసా' అని ఎవరికి వారు మనస్సులో ప్రశ్నించుకోండి. దీక్షితులు నిజమే చెబుతున్నాడని మీకు తప్పక అనిపిస్తుంది. అన్నమాచార్యులవారి కీర్తనలు అంతతేలికగా కొరుకుడు పడవు.

సంస్కృత, తెలుగు నిఘంటువుల సహాయంతో మాత్రమే నేను ఈ నా సంకల్పం నెరవేర్చానని చెప్పటానికి నేనేమాత్రం సిగ్గు పడటం లేదు.

"ఎందరో మహానుభావులు అందరికీ వందనములు" ...అని అన్నారు త్యాగరాజ స్వామి. అన్నమాచార్యుల వారి సంకీర్తనలను సంరక్షించి, పరిశోధించి, పరిశ్రమించి, తగిన రాగములను కట్టి, సంకీర్తనలుగా పాడి, తాము ధన్యులవుటే కాక కోట్లాది మంది నాబోటి సామాన్య సంగీత ప్రియులను నిత్యమూ ఆనందపరుస్తున్న పెద్దలైన వారందరికీ పాదాభివందనలు. పిన్నలైన వారికి ఆ పెద్దవారంతటి వారు కావాలని శుభాశీస్సులు.

ఒకమాట... నిష్ణాతులు, వాగ్గేయకారులు, సంగీత విద్వాంసులు, సాహితీవేత్తలు, ఎవరో ఒకరి వారు కారు. వారు అందరివారు. అట్లాగే వారి కీర్తిప్రతిష్ఠలు వారివే కాదు అందరివీ. మా అన్నమయ్య, మా ఘంటసాల, మా బాలమురళి, మా లతా మంగేష్కర్, మా మహమ్మద్ రఫీ,... వీరికి జాతి కుల మత వయో బేధాలతో పని లేదు. కీర్తిశేషులైనా వీరు మాహృదయాలలోనే వున్నారు. రేపు మేములేకపోయినా వారు మా హృదయాలలోనే వుంటారు.

అందుకని నేను ఈ నా ప్రయత్నంలో ఎవ్వరెవ్వరి శ్రమనో, కష్టార్జితాన్నో, ఈ రచనను మెరుగు పెట్టటానికి ఆ'శ్రమ' ఉపయోగించుకొని వుంటే, వారికివే నాకృతజ్ఞతలు. వారందరి సహకారంతోనే ఈకృతి సాధ్యమయిందని మనస్ఫూర్తిగా చెబుతున్నాను.

నా రచనలు పుస్తకంగా నా మిత్రుల కివ్వటంలో నాకు అది భగవత్సేవ అనే భావనే కాని వేరే చింతన లేదు. డబ్బుకి నేనెన్నడూ సరస్వతిని అమ్మలేదు, అమ్మనుగాక అమ్మను.

నాలాగే ఇతరులుకూడ ఆలోచించక పోవచ్చు. వారి కష్టాన్ని వారు ప్రతిఫలరూపంలో ఆశించవచ్చును. నేను ఉపయోగించుకొన్న అన్నమయ్య కీర్తనలు వారి శ్రమ ఫలంగా వెలుగులోకి వచ్చి ఉండవచ్చును. అప్పుడు వారికి ఇందులో నేను వారి కష్టాన్ని దోచుకున్న భావన కలుగవచ్చును. మనందరికి గురువైన తాళ్లపాక గురుపుంగవులను చూచి నన్ను మన్నిస్తారని నా ఆకాంక్ష, విన్నపము కూడా. ఈ రచన చేయాలనే ఆలోచన పుట్టించిన బ్రహ్మ, శ్రీ ఎమ్.వి.ఎల్.ఎన్. మూర్తి గారు. ప్రోత్సాహాన్నిచ్చింది డా॥ బి.వి.ఎస్.ఆర్. మూర్తిగారు. సహకరించింది ఎందరో మహానుభావులు. అందరికీ నా కృతజ్ఞతాభివందనలు.





ఇకపోతే మున్నుడి ప్రతికీర్తనకి కావాలా? దాంట్లో పద్యం ఎందుకు? అనే ప్రశ్నలుత్పన్నమయ్యాయి. మున్నుడి అంటే ఉపోద్ఘాతం లేక అవతారిక. మున్నుడి తెలుగు మాట కాబట్టి దాన్నే ఎన్నుకొన్నాను. కీర్తన వైశిష్ట్యం తెలిపే ఉద్దేశ్యంతోనే ప్రతికీర్తనకి మున్నుడి చెప్పాను. ఇక ప్రతి కీర్తనకి ఒక పద్యం చెప్పటానికి కారణం మాత్రం పద్యాలపై నా ప్రేమ స్ఫురింప చేయటమే కాక, అన్నమాచార్యుల వారిని నా ఇష్ట దైవమైన వేంకటేశ్వరుని కీర్తించటమే.

భావామృతంలో కీర్తనని ప్రతి చరణంలోని ప్రతిమాటను వివరించాలని నా ఆశయం. అందుకనే పేరా లుగా విడివిడిగా వ్రాశాను. ఏ చరణాన్నయినా తేలికగా అర్థం చేసికొనవచ్చును.

నాకు ఆత్మానందం కలిగించిన ఈ నా ప్రయత్నం అనంతంగా సాగుతూనే ఉంటుంది. నా తుదిశ్వాసదాకా. ఎందుకంటే రోజుకి ఒకకీర్తన చేసినా అన్నమయ్య కీర్తనల కన్నీ భావం వ్రాయాలంటే నా జీవితకాలం చాలదు. అలా చాలకూడదనీ, ఈ నా అన్నమాచార్యారాధనలోనే వేంకటేశ్వరుని కీర్తిస్తూనే నా కలంతో పాటు శ్వాస కూడా ఆగిపోవాలని నా నిరీక్షణ.. నా ఆకాంక్ష.

నా వెబ్‌సైట్ **www.geetadeeksha.com** లో నా ఇతర రచనలు చదివి ఆనందించి నన్ను ఆశీర్వదిస్తారని ఆశిస్తాను.

**Note :** ప్రతి సంపుటిలోను ముందుమాట అంకితం యథాతథంగానే ఉంటాయి.

## మున్నుడి

శ్రీహరి రథోత్సవాన్ని వీనుల విందుగా వర్ణిస్తున్నారు అన్నమాచార్యులవారు. 'పరుషలు' అంటే చిత్రమైన వర్ణములు గల వస్త్రములను ధరించిన వారు అని అర్థం. దేవుని వూరేగింపులో పాల్గొనే నాట్యమాడు వారు కోలాటములు వేయువారన్నమాట. మోహనమూర్తి అయిన శ్రీవేంకటేశ్వరునికి మొక్కరో అంటున్నారు. ఆయన వెక్కసమైనవాడట. అంటే దుర్లభమైనవాడట. పెండ్లిచేసికొని రథంలో వూరేగి వస్తున్నాడట ఆ ఏడుకొండలవాడు. నాలాగ చూచే భాగ్యంలేనివారు, చదివి తరించండి. నేడు వినాయకచవితి... సంపుటి VI కు శ్రీకారం చుట్టాను.

**ఆ.వె॥మొక్కరో పరుషలు మోహన మూర్తికిన్**
**వెక్కసమగు గిరుల వెలసినట్టి**
**వేంకటేశ్వరునికి వెలయించె నన్నయ్య**
**రథము తాకి కొలువరండు అనెను.**

**రాగం : శంకరాభరణం**

మొక్కరో పరుషలు మోహనమూర్తికి
వెక్కసమగు శ్రీవేంకటపతికి ॥మొక్కరో॥

హరిరథమదె ముందరి నొగలవిగో
గరుడ ధ్వజమదె ఘంటలవే
సరిదిరిగేటి కాంచన చక్రములవే
తిరువీధుల నేతెంచీ గనరో ॥మొక్కరో॥

తేరుపడగలనే తెల్లగొడుగులవే
తోరణంబులవే సారథి వాడే
ధీరతగట్టిన దివ్యహయములవె
మేరువు వలెనే మెరసీనదివో ॥మొక్కరో॥





పసిడికుండయదే పట్టుకుచ్చులవే
వెస నడుమవాడే శ్రీవేంకటేశుడు
యెసగి యురమునకు యిదే యలమేల్మంగ
వసుధ పెండ్లి తేరు వచ్చీ నిదివో ॥మొక్కరో॥

**భావామృతం :**

ఓ పరుషలారా! (చిత్రమైన వర్ణములు గల వస్త్రములను ధరించిన భక్తులారా! మోహనమూర్తి అయిన శ్రీ వేంకటేశ్వరునికి మొక్కండయ్యా! ఈయన వెక్కసమైనవాడు. (దుర్లభమైనవాడు). (పదే పదే ఈ అవకాశం రాదు, మరీ...)

అదిగో శ్రీహరి రథము. అదిగో ముందరగా కనిపిస్తున్న 'నొగలు' (రథానికి కూర్చొనుటకై అమర్చిన కర్రలు) అదిగో గరుడధ్వజము. మ్రోగుచున్న ఘంటలవిగో. సమానముగా తిరుగునట్టి బంగారు రథ చక్రములవిగో. పవిత్రమైన ఈ వీధులలో వూరేగి వస్తున్న దేవదేవుడు యేతెంచినాడు. స్వామికి మొక్కి తరించండి.

అవిగో తేరు పడగలు (రథానికి కట్టిన జెండాలు) అవిగో ధవళవర్ణముతో మెరయుచున్న గొడుగులు. రథానికి కట్టిన తోరణాలు అవిగో. రథసారథి ఎంత ఠీవిగా ఉన్నాడో చూడవలసినదే. ధీరత్వంతో గట్టిన, దివ్యమైన గుఱ్ఱములవిగో. ఆహా! ఆ శ్రీహరి రథం మేరు పర్వతంలాగా మెఱిసిపోతోంది. చూచి ధన్యులవండి.

స్వర్ణముతో చేసిన కుండ (బిందె) అదిగో. పట్టువస్త్రముతో కుచ్చెళ్లుపోసి కట్టిన తెరలవిగో చూడండి. నట్టనడిమినున్నవాడే శ్రీవేంకటేశ్వరుడు. స్వామి వురముననుండే అలమేలుమంగమ్మ నేడు ఈ పెండ్లితేరు (రథము) లో వసుధ (భూదేవి)తో సహా తిరుమలేశుని రథములో మనోజ్ఞముగా వూరేగి వచ్చుచున్నది. మొక్కి మీ జన్మపావనం చేసికొనుడయ్యా!

**6-2**

## మున్నుడి

భగవానుని గీతావాక్యాన్ని మధురకీర్తనలో వినిపిస్తున్న అన్నమాచార్యులవారిని ఆలకించండి. వేలాది నా భక్తులలో వొక్కడు మాత్రమే నన్నెరుగ గలడన్నాడు పరమాత్మ. అసలు, భక్తుడు కావాలంటేనే యెన్ని నీచ జన్మలెత్తాలో. అందుకే హరినెరుగుట అందరి 'వసమా?' (వశమా), ప్రయత్నించి, యే వొక్కడోగాని యెరగడు అంటున్నారు. ఇక్కడ 'కోటి' అంటే 'వంద లక్షల' నికాదు. అనేకమంది అని అర్థం. శ్రీహరి భక్తులలో 'నిత్యుడయ్యే జీవన్ముక్తుడు' యే వొక్కడో వుంటాడు. అట్లాంటి కోట్లమందిలో తిరుమలయ్యని వెదకి పట్టుకోగల వాడొక్కడేనట... మా గతేమిటి మహానుభావా!

**ఉ॥ అందరికెట్లు సాధ్యమగు ఆ హరిమాయ నెరుంగ ఈ భువిన్**
**కందువ యెవ్వడో యొకడుగాని యెరుంగడు అన్నమయ్యనెన్**
**వందల కోట్లు కోట్లయినవారల నొక్కడు నేర్చునేవెుకో!!!**
**ముందుగ శ్రీహరిన్ గనును మోహవిముక్తుడు ముక్తుదాతడే.**

**రాగం : రామక్రియ**

అందరి వసమా- హరి నెరుగ
కందువ నొకడు- గాని యెరుగడు ॥అందరి॥

లలితపు పదిగొ-ట్ల నొకడు గాని
కలుగడు శ్రీహరి-గని మనగ
ఒలిసి తెలియు పు-ణ్యుల కోట్లలో
ఇల నొకడు గాని- యెరగడు హరిని ॥అందరి॥

శ్రుతి చదివిన భూ- సురకోట్లలో
గతియను హరినె యొ- కానొకడు
అతిఘను లట్టి మ-హాత్మ కోటిలో
తతి నొకడు గాని- తలచడు హరిని ॥అందరి॥





తుదకెక్కిన ని-త్యుల కోట్లలో
పొదుగు నొకడు తల- పున హరిని
గుదిగొను హరి భ-క్తుల కోట్లలో
వెదకు నొకడు శ్రీ- వేంకటపతిని ॥అందరి॥

**భావామృతం :**

శ్రీ మన్నారాయణుడైన హరిని తెలుసుకొనుట అందరి వలనా అయ్యే పనియేనా? కందువగ (సామర్థ్యముతో) యే వొక్కడో గాని యెరగడు. పదికోట్లమంది 'లలితపు' (సరళస్వభావము) గలవారిలో శ్రీహరిని కనిమనుటకు (దర్శించు అభిలాషతో) ఏ ఒక్కడో వుంటాడు. ఒలిసి (విడమరిచి) తెలిసి కొనగలుగు పుణ్యాత్ములలో ఈ ప్రపంచంలో ఆ తెలివి శ్రీ హరిని కనుగొనడానికి వుపయోగించి కృతకృత్యుడయ్యే అదృష్టవంతుడు యే ఒక్కడో వుంటాడు. (చాలామంది ఆ తెలివితేటల్ని దేవుడి పేరుతో ధనార్జనకే వినియోగిస్తారు.... మరి శ్రీ హరి దయ వారి పై అంతవరకే వున్నది).

సద్బ్రాహ్మణ వంశంలో పుట్టిన అనేక మందిలో వేదాధ్యయనం చేయని 'నరులే' యెక్కువ, యే వొక్కడో వేదాధ్యయనం చేసినా అట్లాంటి కోట్లాది మందిలో వేదమూర్తియైన శ్రీ హరిని నీవే నాకు గతి ప్రభూ! అని ఆశ్రయించే వాడు ఏ వొక్కడో గాని వుండడు. అటువంటి అతిఘనులలో, మహాత్ములుంటారు. ఈ మహాత్ముల, తతిలో (గుంపులో) యే ఒక్కడో గాని శ్రీ హరిని మనసారా తలుచుకొనేవాడుండడు. (అట్లా తలుచుకోనివారికి శ్రీ హరి దయ ఎలా కలుగుతుంది, చెప్పండి)

సరే... ఇవన్నీ సాధించిన విరక్తుడు చివరికి 'నిత్యుడు' అవుతాడు. వాడే జీవన్ముక్తుడు. అట్లాంటి కోట్లాది మందిలో తన తలపులలో శ్రీ హరిని పొదుగుకొను (బిగించుకొనువాడు)యే ఒక్కడో గాని వుండడు. గుదిగొని (అతిశయించి), అట్లాంటి శ్రీహరి కోట్లాది భక్తులలో శ్రీ వేంకటేశ్వరుని నీవు నాకు కావాలయ్యా అని ఆశ్రయించి ఆయనను వెదకి పట్టుకోగలిగినవాడు...యేఒక్కడోవుంటాడు.(ఇక నా బోటివాడి గతేమిటి తండ్రీ!)

**6-3**

## మున్నుడి

సరస శృంగార కీర్తన చెబుతున్న అన్నమాచార్యులవారి నాకర్ణించండి. కడపలో వేలసిన దైవం శ్రీ వేంకటేశ్వరుని కడపరాయుడని పిలుస్తారు. ఆ వూరిని "దేవుని గడప" అంటారు. తిరుమల వెళ్ళాంటే ఇక్కడినుంచే మొక్కుబడితీసుకొని భక్తులు ఆ రోజుల్లో బయలుదేరేవారు. స్వామిని వలచిన యెవ్వతైనా తనకు తెలియకుండా ఆయనను వశపరచుకొంటున్నదాయేమిటి అని అలమేలమంగమ్మకి తెగ అనుమానం వచ్చి "ఏమిటి స్వామీ! నీవు అటువంటి వాడవా? నీవన్నీ నటనతో కూడిన మొహమాటాలేనా? అని అడుగుతున్నది.

**కం॥ "నటనలు మోమాటములే**
**కుటిలంబులు నడుపువాడ!" కుందె రమణియున్**
**అటువంటివాడవా!! నువు**
**ఇటుజెప్పెను అన్నమయ్య ఈ కీర్తనమున్.**

**రాగం : సామంతం**

అటువంటివాడవా అద్దో నీవు
నటన మొక మాటాలు నడపేవు గాకా ॥అటు॥

తలపులోపల నీకు తగులు గలిగితేను
అలరి రా కుందుదువా అక్కడ నీవు
చలముల నెవ్వతో జాగుల బెట్టుక నిన్ను
వెలిలోను మఱపించి వెట్టి జేసెగాకా ॥అటు॥

కడు దమకము నీకు గమ్మి పెరరేచితేను
అదరినాతో మాట లాడకుందువా
వడి నెవ్వతో నిన్ను వాకట్టు గట్టుక యింత
ముడి వెట్టి విడిచి తా మొప్పె జేసె గాకా ॥అటు॥





తటుకన నన్ను గూడే దయ నీకు లేకుండితే
ఘటన నెదురుకొని కాగిలింతువా
యిటువలె శ్రీ వెంకటేశ కడపలోన
సటల కెవ్వతో నిన్ను చండి సేసెగాకా ॥అటు॥

**భావామృతం :**

స్వామీ! నీవు అటువంటి వాడవా! అదిగో నీవన్నీ నటనతో కూడిన మొహమాటాలే....(సంకోచములే)

ప్రభూ! నీకు తలపు లోపల (మనస్సులో) తగులు (ఆసక్తి) కలిగితే, నా దగ్గరకు రాకుండా వుంటావా? మాత్సర్యం గల యెవతై అయినా నిన్ను జాగుల బెట్టినదా? (నిరీక్షించేటట్లు చేసిందా యేమయ్యా?) నిన్నామె బయటనేవుంచి నిన్ను మఱపించి వెట్టివాడిని చేసిందాయేమయ్యా!

స్వామీ! నీకు మిక్కుటమైన పరవశత్వం కమ్ముకొనుట్లు ఆమె పెరరేచితే (ప్రేరేపిస్తే), నీవు అదరి (అతిశయించి) నాతో మాట్లాడకుండావుంటావా? ఎవత్తో నిన్ను వడిన్ (త్వరగా) వాకట్టు కట్టిందా (నోరు కట్టేసి మాట్లాడకుండా చేసిందా యేమి? నాతో మాటలు మానివేశావు) పోనీ నిన్ను ముడివేసిపెట్లుకొని విడిచి పెట్టుట లేదా యేమి?

ప్రభూ! నన్ను శీఘ్రంగా కూడే దయ నీకు లేకపోతే దైవఘటన అన్నట్లు నా యెదురు పడి కౌగలించెదవా.... ఈ విధంగా ఓ కడపరాయా! శ్రీవేంకటేశ్వరా! సటలక (మోసముతో) యెవ్వతో నిన్ను " చండిసేసెగాక!" (మూర్ఖపు పట్టుదలతో నిర్బంధించిన దేమో స్వామీ!

## 6-4

## మున్నుడి

ఒకటికి పదిసార్లు చదివినా పూర్తిగా అర్థంకాని కీర్తన చెబుతున్నారు అన్నమాచార్యులవారు అద్భుతమైన ఉదాహరణలతో......"తృప్తి అనేది యెరుగకనే పూటపూటకీ కొంత చొప్పున కాలమంతా గడచిపోయింది, కొత్తకొత్త రుచులు కోరుకొంటూ యెన్నడు వాటిని అసహ్యపడలేదు. వాటి వశమైపోయాను ఇకదారేమిటి?" అంటున్నారు. భావామృతం జాగ్రత్తగా ఆనాటి రాగిరేకుల వ్రాతలలోని లోపాలను పెద్దలు సవరించారు. మన కష్టం తగ్గించారు.

**చం॥ తనియక కాలమెల్ల చనె, దారుల బట్టితి హేయమైనవౌ**
**గొని రుచులన్ని కోరితిని, కొంతయు రోయక బోతినెన్నడున్**
**పనివడి నాదు చిత్తమును వంచక బోతిని అన్నమయ్యనెన్**
**దునుముచు భీతినెమ్మదిని తోయజనాభుని నిల్పుచాలురా.**

* తనియక = తృప్తి జెందక

### రాగం : దేసాక్షి

పోయబోయ గాలమెల్ల పూటపూటకు
రోయని రోతలు చూచి రుచి చూర బోయ ॥పోయ॥

తాడిమానెక్కేటి వాని తడయక పట్టిపట్టి
తోడ దోడ నెందాకా దోయ వచ్చును
కాడువడ్డ చిత్త మిది కలకాలము నిట్టే
ఆడి కెలకులోనై తనియక పోయ ॥పోయ॥

మన్నుదినియేటి దూడ మానుమంటా మొత్తిమొత్తి
కన్నిగట్టి యెందాక గాయవచ్చును
సన్నపుటాసల మీది చరిబడ్డ దేహమిది
కన్నపు గత్తుల చూపు కట్టరాకపోయ ॥పోయ॥





హేయము దొక్కకుమన్నయేచి తినేననే వాడు
చాయకురాకున్న నేమి సేయవచ్చును
మాయల వేంకటపతి మచ్చు చల్లనా యాత్మ
పాయక యాతని జేరి భయమెల్లబోయ ॥పోయ॥

### భావామృతం

అయొ! జీవితంలో కాలమంతా వ్యర్థమైపోయిందే!! పూట పూటకి క్రొత్త క్రొత్త రుచులకోసం వెంపర్లాడి, రోత బుట్టవలసిన వాటిపై రోతపుట్టక చివరికి రుచులన్నీ చూరబోయినవి (కొల్లగొట్టబడినవి ప్రభూ!)

తాటిచెట్టు నెక్కేవాడు తగిన ఏర్పాట్లు చేసికొని ధైర్యంతో తనంతట తానే మెల్లమెల్లగా పైపైకి యెక్కాలి. అంతేకాని వాడిని పట్టుకొని ఎవరన్నా కొద్ది కొద్దిగా తడయక (ఆలస్యం చేయక) ఎక్కించ గలరా? కాడువడ్డ చిత్తమిది (మన మనస్సు వ్యసనమునకు లోనయ్యేది) ఇది ఎప్పుడూ ఆడికెలకులోనై (నిందలకు గురియై) తనియక పోవును (తృప్తిచెందకుండా వుంటుంది). దీనిని మెల్ల మెల్లగా తృప్తిపడేట్లు అలవాటు చేయాలి. ఒక్కసారికే కమ్మంటే.. కాదు.

ఏదన్నా దూడ 'మన్ను' తినటానికి అలవాటు పడితే, మనం నెత్తీ నోరూబాదుకొని మన్ను తినొద్దే అంటే మానుతుందా? దాని కళ్లకు "కన్నిగట్టి" ఎంతదాక దాన్ని కాయవచ్చు (రక్షించవచ్చు?) ఈ దేహము, సన్నపు ఆశలకు (అల్పమైన కోరికలకు) చరిబడ్డదై (లోనై) కన్నపుగత్తుల చూపులను (సమ్మోహనపరచు స్త్రీ చూపులను) కట్టరాకపోవు (నియంత్రించ లేకపోతాడు) కోర్కెలకు లొంగిపోతాడు, (జీవుడు)

హేయము దొక్కకుమన్న, (యేచి తినేవాడు) చాయలకు రాకున్న (ఒప్పు చేయుటకు అలవాటు పడకపోతే) యేమిసేయగవచ్చు? (ఏమి చేయగలం?) మాయలమారి శ్రీవేంకటేశ్వరుని మత్తుమందు చల్లి, నీ ఆత్మను ఆయనకు అంటగట్టు. అప్పుడది పాయక (విడువక) ఆతనిని జేరి, భయమెల్ల బోయ (భయమునంతా పోగొట్టుకొన్నది).

**6-5**

## మున్నుడి

గీర్వాణిలో నారసింహుని స్తుతిస్తున్నారు అన్నమాచార్యులవారు. స్వామిని సుముఖుడని (చక్కటి ముఖం కలవాడని) కరుణ నిండిన చూపులు కలవాడని, సులభంగా అనుగ్రహించే నారసింహుడని కీర్తిస్తున్నారు. అట్టి నరసింహదేవునికి నమిత (వినయముగా) భజే (సేవించెదనంటున్నారు). కీర్తన అంతా సన్నుతి కావటంచేత, దాదాపు తేలికగానే అర్థమవుతుంది. రమణీయ భూషాభిరాముడట స్వామి... అందమైన నగలతో అలంకరింపబడిన అభిరాముడట (మనోజ్ఞమూర్తియట).

**తే॥ నమిత దేవంభజే వీర నారసింహ!**
**సుముఖ! కరుణేక్షణా! దివ్య సులభచరిత!**
**అన్నమార్యుడు గీర్వాణ మెన్నుకొనుచు**
**నారసింహుని వినుతించె తిరుమలేశ!**

**రాగం : హంసధ్వని**

నమిత దేవంభజే నారసింహం
సుముఖ కరుణేక్షణం సులభ నరసింహం ॥నమిత॥

విజయనరసింహం వీరనరసింహం
భుజబలపరాక్రమ స్ఫుట నరసింహం
రజనీచర విదళన విరాజిత నృసింహం
సుజన రక్షక మహాశూర నరసింహం ॥నమిత॥

దారుణ నృసింహం ప్రతాపనరసింహం
చారుకళ్యాణ నిశ్చల నృసింహం
ధీరచిత్తావాస దివ్య నరసింహం
సారయోగానంద చతుర నరసింహం ॥నమిత॥





విమల నరసింహం విక్రమ నృసింహం
కమనీయ గుణగణాకర నృసింహం
అమిత సు శ్రీవేంకటాద్రి నరసింహం
రమణీయ భూషాభిరామ నరసింహం ॥నమిత॥

**భావామృతం :**

ఓ నృసింహ దేవా! నీకు నేను వినయముగా నమస్కరించి సేవించెదను. నీవు చక్కని వదనారవిందముతో ఒప్పుచున్న సుముఖుడవు. నీ చూపులు కరుణ తొణికిసలాడు తుంటాయి. ఆర్తులైన నీ భక్తులను సులభముగా అనుగ్రహించు స్వభావము కలవాడవు.

ఓ నారసింహా! నీవు విజయములను పొందెడి వీర నరసింహుడవు. హిరణ్యకశిపుని అమాంతం ఎత్తుకొనిన భుజబలము కలిగిన నరసింహా నీ పరాక్రమము ఒక్కసారిగా స్ఫుటమైనది (స్పష్టమైనది). రజనీచరులు (చీకటిలో సంచరించు రాక్షసులను) విదళన (తుత్తునియలు చేయుచూ) విరాజితుడై (దీప్తించుచూ విలసిల్లిన) నారసింహుడవు. సుజనులను రక్షించు మహాశూరుడవు.

ఓ దేవా! నువ్వు దారుణ పరాక్రమము గల (భయంకరమైన ప్రతాపముగల) నరసింహుడవు. అందమైన, మంగళకరమైన గుణములతో నొప్పు వాడవు. నిశ్చల స్వభావము కలవాడవు. ధీరత్వం కలిగిన చిత్తము వున్నవాడవు, దివ్యమైన నరసింహుడవు. సమయస్ఫూర్తిగల యోగా నరసింహుడవు.

ఓ దేవదేవా! నీవు విమల నరసింహుడవు (నిర్మల స్వభావము గలవాడవు). పరాక్రమము ప్రదర్శనచేయువాడవు. మనోహరమైన గుణగణములు సాకారంగా రూపుదిద్దుకొనిన వాడవు. అంతులేని మంగళకరమైన వేంకటాద్రి నిలయుడవైన నరసింహుడవు. అనగా వేంకట నరసింహుడవు. అందమైన ఆభరణములతో విలసిల్లుచున్న మనోజ్ఞ నరసింహుడవు. అట్టి నిన్ను వినయముతో సేవించెదను తండ్రీ!

**6-6**

## మున్నుడి

అత్యద్భుతమైన దశావతార వర్ణన నాలకించండి. అన్నమాచార్యులవారి కీర్తనలలో నారాయణుని అవతార ప్రస్తుతి ప్రహేళికలవలె ఒక పట్టాన కొరుకుడు పడకుండా వుంటాయి. ఈ కీర్తనలో సిద్ధుడా అంటే ఈడేరిన వాడు అని అర్థం. ఆయన కోరుకోవాల్సినవేవీ లేవు. ఆయనకు అన్నీ సిద్ధించాయి. బాబోయ్ నీవు అన్నీ సిద్ధింపజేసుకొనే బాలసిద్ధుడవు. నిన్ను మెచ్చుకొంటున్నామయ్యా! నీవు రావుల సింగారపు రసము (రాచఠీవి గలిగిన శృంగారమూర్తివైన) సిద్ధుడివి. కొచ్చన వేంకటాద్రి అంటే ఏమిటి? అచ్చపు లోకాలంటే... చదవండి భావామృతం.

**కం॥ మెచ్చితివి బాల సిద్ధుడ!**
**మచ్చుకు పదిరూపులాయె బాపురె బాపూ!**
**కొచ్చన వేంకటనాథా!**
**అచ్చపు లోకాలనేలు మన్నయ్యనెరా!**

**రాగం : రామక్రియ**

బాపు బాపు మెచ్చితిమి బాలసిద్ధుడా
రావుల సింగారపు రససిద్ధుడా ॥బాపు॥

నీరధిలో విహరించు నిజసిద్ధుడా
తారితారిమెలగే పాతాళ (పాదాల) సిద్ధుడా
భారపు భూమిమోచేటి బలు సిద్ధుడా
తోరపు కంబముమీది దొడ్డ సిద్ధుడా ॥బాపు॥

మింటి పొడవైనట్టి మేటి సిద్ధుడా
గెంటిన తల్లి బదికించు సిద్ధుడా
పెంటిరాకాసి జంపిన పెను సిద్ధుడా
దంట భూతముల నెత్తురు దాగితి సిద్ధుడా ॥బాపు॥





మచ్చివూళ్లు చెరచిన మాయ సిద్ధుడా
రచ్చలోని ఱాతి గుఱ్ఱపు సిద్ధుడా
కొచ్చిన శ్రీవేంకటాద్రి గుహ సిద్ధుడా
అచ్చపు లోకములేలే ఆది సిద్ధుడా ॥బాపు॥

**భావామృతం :**

బాబోయ్... బాబోయ్... సెబాసు... ఓ బాల సిద్ధుడా (ఈడేరిన సిద్ధపురుషా!) నీవు రావుల సింగారపు రస సిద్ధుడవు (రాచ ఠీవిగలిగిన శృంగార రస సిద్ధికలిగిన దేవదేవుడవు). అట్టి నీ విభవము వర్ణించెదను.

ప్రభూ! నీవు మహాసముద్రములో ఈదులాడి విహరించిన నిజమైన సిద్ధుడవు (మత్స్యావతారం). తారి తారి మెలిగేటి పాతాళ సిద్ధుడవు (పాదాల సిద్ధుడవు) మెల్లిమెల్లిగా చలించు పాదములుగల సిద్ధుడవు (కూర్మావతారము). చాలా బరువైన భూమిని మోసిన బలమైన సిద్ధుడవు. (వరాహావతారము). తోరపు కంభము మీది దొండ సిద్ధుడా (లావుపాటి స్తంభముననున్న పెద్ద సిద్ధుడా! అనగా నృసింహావతారము).

మింటి పొడవైనట్టి మేటి సిద్ధుడా! (ఆకాశమంత యెత్తు కెదిగిన వామనుడు). గెంటిన తల్లిని బదికించు సిద్ధుడా! (భర్తచే త్యజించబడిన తల్లిని ఖండించి తిరిగి వరంగా ఆమెను బ్రతికించిన పరశురాముడు). పెంటిరాకాసిని జంపినపెను సిద్ధుడా (ఆడ రాక్షసియైన తాటకిని సంహరించిన గొప్ప సిద్ధుడు...శ్రీరామచంద్రుడు) దంట భూతముల నెత్తురు దాగితి సిద్ధుడా (దుష్ట రాక్షసులను సంహరించిన సిద్ధుడా! కృష్ణుడు లేదా బలరాముడు)

మచ్చివూళ్ల చెరచిన మాయ సిద్ధుడా! (మచ్చరము కలిగిన త్రిపురాసురులను వారి భార్యలను చెరచి చంపించిన బుద్ధభగవానుడు). రచ్చలోని రాతి గుఱ్ఱపు సిద్ధుడు (యుద్ధములో కఠినమైన అశ్వముగల సిద్ధుడు కల్కి అవతారము). కొచ్చిన (కోసుగా నున్న లేక ఎత్తైన వేంకటాద్రిమీద గుహలో (మారుమూల వున్న సిద్ధుడు (శ్రీవేంకటేశ్వరుడు). లోకములన్నింటిని అచ్చము (స్వంతంగా) ఏలునట్టి ఆదిదేవుడైన సిద్ధుడు శ్రీమన్నారాయణుడు).

## మున్నుడి

'చలమరి' అంటే 'మత్సరము' లేక 'ఈర్ష్య' గలవాడు. మానవ జన్మనెత్తిన జీవికి జన్మతః వచ్చే దుర్గుణములలో అది ఒకటి. తనకంటే ఇంకొకరికి యెక్కువ వుంది అని తెలియగానే కలిగేది ఈర్ష్య. అది వినాశనకారి. ఇది తెలియక వూరక (వ్యర్థంగా) సంచరించితే శాశ్వత సుఖము కలుగుతుందా అంటున్నారు అన్నమాచార్యులవారు. చక్కటి తత్త్వ బోధచేస్తున్నారు. జీవికి (ఆత్మకి) కర్మానుసారం జనన మరణాలు తప్పవు. కర్మానుభవమూ తప్పదు. శ్రీవేంకటేశ్వరుని దయకలిగేదాకా మనకు ఇంకొక గతియేది? లేదు గాక... లేదు.

**కం॥ తెలియక తిరిగే మూరక**
**చలమరికిని సుఖము యెటుల సతతం బగురా?**
**పలికెను అన్నమ సత్కవి**
**విలువగు కీర్తనము తెలిపె వేంకటనాథా!**

**రాగం : సామంతం**

తెలియక వూరక తిరిగేము
చలమరి కగునా సంతత సుఖము ॥తెలియక॥

హేయము కడుపున నిడుకొని యింకా
'చీ' యనని మాకు సిగ్గేది
పాయము పిడికిట బట్టుచునుండేటి-
కాయధారులకు గలదా విరతి ॥తెలియక॥

అంగనల రతుల యాసల నీదేటి-
యెంగిలి మనుజుల కెగ్గేది
ముంగిట నార్గురు ముచ్చుల గూడిన-
దొంగ గురుని కిందుల నిజమేది ॥తెలియక॥





జనన మరణములు సరిగని కానని
మనుజాధమునకు మహిమేది
యెనగొని శ్రీవేంకటేశు శరణ మిటు
గని మనకుండిన గతి యిక నేది ॥తెలియక॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! నీ విచ్చిన ఈ జీవితంలో నీకు సంతోషం కలిగే ఒక్క పనికూడ చేయలేక పోయాను. మంచీ చెడు తెలియకుండా వూరకే (వ్యర్థంగా) తిరిగినాము. ఈర్ష్యతో సతమతమవుతూ బ్రతికాము. మావంటి చలమరికి (ఈర్ష్యగలవారికి) సంతత సుఖము (శాశ్వత సుఖము అనగా ముక్తి) దక్కుతుందా?

మా కడుపునిండా తుచ్ఛమైన ఆలోచనలను పెట్టుకొని, దానికి 'ఛీఛీ' అని సిగ్గుపడకనే పోతిమి. పిడికిలి పట్టుకొన్నదేదైనా యెంతసేపు వుంటుంది. నా యౌవనమూ అంతే... చూస్తుండగానే చేతిలోంచి జారిపోయినది. కాయధారులము (శరీరమును ధరించువారు) అయిన మాకు విరతి (విశ్రాంతి) అనేదుంటుందా? (చచ్చేదాక వెంపర్లాటే... కదా!)

ప్రభూ! మేము 'మనుష్యులము'. స్త్రీ సుఖం కోసం యెంగిలి బ్రతుకులు గడుపుతూ, ఆశా జలధులలో ఈదులాడుతున్నాం. అదే సుఖం అనుకొంటున్నాం. మాకు 'యెగ్గు' అనేదే లేదు. (మాకు అపరాధం అను పచ్ఛాత్తాపమే లేదు). ఎందుకంటే... మాముందు ఆరుగురు ముచ్చులు (దొంగలు) వున్నారు. వాళ్లకో దొంగ గురువు వున్నాడు. [కామ, క్రోధ, మోహ, లోభ, మద, మత్సరము (ఈర్ష్య) అనే ఆరుగురి గురువు మనస్సు]. వాళ్లుండగా నాకు నిజము తెలిసే అవకాశమే లేదు.

జనన మరణముల చక్రభ్రమణంలో నిరంతరం ఈ జీవుడు తిరుగులాడుతూనే వున్నాడు. మనుజాధములు సరియైనది కానలేక నీ మహిమనెరుంగకున్నారు. ఎనగొని (సమముగా తెలిసికొని) శ్రీవేంకటాధిపా! నీ శరణని నీ కరుణ పొంది "మనవలెను" (జీవించవలెను). ఇంతకన్న ఇక గతియేది తండ్రీ! మాకు.

## మున్నుడి 6-8

ఈ క్రింది సీసపద్యం చదివి ఏమాత్రం అర్థం కాకపోతే 'అబ్బో' ఈ రచయిత నారికేళపాకంలో పద్యాలు చెప్పగల ఉద్దండ పండితుడు అనుకొంటే పప్పులో కాలు వేసినట్లే. ఈ ఘనత అన్నమాచార్యులవారిది. ఏ పండితుడైన ఈ కీర్తన ప్రతిపదార్థం వివరిస్తే... మీరు నిస్సంకోచంగా ఆయనకు పాదాభివందనం చేయవచ్చును. నామాట... నిజం.

**సీ॥ పెట్టని కోట యీ పెండ్లి కుమారుడు**
**పుడమి నసురులను బొమ్మపెట్టు**
**పెల్లగించెను భూమి పిల్ల దీపులవాడు**
**పిల్లగోవిని వూదు పెండ్లికొడుకు**
**పెంచెపు తలపాగ పెండ్లికొడుకు వీడు**
**వలపించె సిరిని తాన్ నిలిపి యెదుట**
**పెంట, పెరుగు దొంగ పెంటిపోతుల గూర్చు**
**పెంట పెట్టుకొనిన పెండ్లికొడుకు**

**ఆ.వె॥ పెండ్లి పాట నెవడు వెనక యీ తీరున**
**ఆలపించె నిటుల అవనియందు**
**అన్నమయ్య పాటనెన్న నా తరమౌనె**
**దీని భావమేమి తిరుమలేశ!**

**రాగం : బౌళి**

పెట్టని కోటిందరికి పెండ్లికొడుకు బొమ్మ
బెట్టె నసురులకెల్ల పెండ్లికొడుకు ॥పెట్టని॥

పెల్లగించి భూమెత్తి(త్రి) బెండ్లికొడుకు వాడె
పిల్లగోవి రాగాల పెండ్లికొడుకు
పెల్లైన యీవుల పెండ్లికొడుకు వాడె
పిల్లదీపు పెన్నుద్ది పెండ్లికొడుకు ॥పెట్టని॥





పెంచెపు శిరసుపాగ పెండ్లికొడుకు గుం-
పించిన కోపగించీ బెండ్లి కొడుకు
పెంచకప్పుడే పెరిగె పెండ్లికొడుకు వల-
పించె జక్కని సిరి బెండ్లికొడుకు ॥పెట్టని॥

పెంట పెరుగుల దొంగ పెండ్లికొడుకు భూమి
బెంటి పోతులగూరిచె బెండ్లికొడుకు
గెంటులేని వేంకటగిరి మీదను వాడె
పెంట పెట్టుకున్నవాడు పెండ్లికొడుకు ॥పెట్టని॥

**భావామృతం :**

ఓ భక్తులారా! ఈ వివాహమహోత్సవమున మీరు చూచుచున్న ఈ పెండ్లి కొడుకున్నాడే... ఈయన మనకందరికీ 'పెట్టనికోట' (కోట ఎలా రక్షణ నిస్తుందో అలా రక్షణ నిచ్చేకోట... కాకపోతే మనమెవ్వరమూ శ్రమపడి ఆ కోటని కట్టుకోలేదు). ఈయన అసురులనెల్ల (దుర్మార్గులందరిని) బొమ్మ బెట్టెను (నిశ్శేషులయ్యేట్లు) చేసినాడు.

ఈ పెండ్లికొడుకు ఒకప్పుడు (వరాహావతారంలో) పెల్లగించి భూమిని తన ముట్టెపై యెత్తి రక్షించినాడు. ఈయన పిల్లగోవితో (వేణువుతో) రాగాలు తీసినాడు. (చక్కని పాటలు వినిపించినాడు). ఈయన "పెల్లై" (పెల్లు+అయిన=అసంఖ్యాకమైన) ఆవులను (గోవులను, లేక జీవులను పాలించే సర్వాత్మకుడు). ఈయన పిల్లదీపు పెన్నుద్ది (అందరికీ అంతులేని మాధుర్యం పంచిన జతకాడైన బాలుడు).

ఈ పెండ్లి కొడుకు "పంచెపు శిరసుపాగ" వున్నవాడు. (తలమీద పాగా బిగించి అందులో నెమలి పింఛమును అలంకరించుకొన్న అందగాడు... కృష్ణయ్య కదా!) ఈయన "గుంపించిన" కోపగించేవాడు (అతిక్రమించిన కోపము చూపినవాడు... వాళ్ల అమ్మ యశోదమీద అలిగి పాలకుండలు బద్దలు కొట్టేశాడు). ఈతడు "పెంచక అప్పుడే పెరిగినాడు" (తృణావర్తుడనే రాక్షసుడు సుడిగాలిలా వచ్చి చిన్నికృష్ణయ్యను ఎగరవేసికొని పోదామనుకొంటే అంతులేని బరువు, దేహాన్ని పెంచకనే, ఎక్కువ చేసి వాణ్ణి చిత్తుచేశాడు). చక్కని సిరిని (రుక్మిణీదేవిని) పెండ్లాడిన పెండ్లికొడుకే ఈ స్వామి.

ఈయన "పెంట పెరుగుల దొంగ" (పసుల కోష్టముల లోకి దొంగలా దూరి పెరుగులు తినేవాడు). భూలోకంలో "పెంటి, పోతులను" (స్త్రీ పురుషులను) జతకూర్చే కళ్యాణచక్రవర్తి ఈ దేవదేవుడే. గెంటులేని (సాటిలేని) వేంకటాద్రిమీదనున్న వాడే ఈ కృష్ణయ్య కూడ. ఈ పెండ్లికొడుకు కావాలని "పెంట పెట్టుకున్నవాడు", (అంటే జగద్రక్షణ కార్యక్రమము పెట్టుకొన్న జగన్నాథుడైన శ్రీవేంకటేశ్వరుడు)

## 6-9

## మున్నుడి

శ్రీరామచంద్రమూర్తి మీద చక్కటి కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. రాముడు లోకాభిరాముడుట. (లోకాలన్నింటిలో మనోజ్ఞమైనవాడు). ఆయన గోమున (శ్రమలేకుండా) పరశురాముని కోపమును ఆర్చెనట (అణచినాడట). ఈ కీర్తనలో "తునుమాడె నేడు దాళ్లుతోడనే వాలి నడచె" అనే చరణానికి అర్థం చెప్పమంటే" ఈరోజు ఏడు తాళ్లతో నడిచిపోయాడని చెప్పే ప్రమాదం ఉంది. 'తెలుగు' భాషను అంత 'తేలిక'గా తీసికొంటే 'తెలివి తక్కువ' గా 'తెలవెలబోయే' తిప్పలొస్తాయి... తెలుగు వెలుగండీ.

**కం॥ లోకాభిరాముడితడే**
**ఆ కోపిని పరశురాము నటుమార్చెను బో**
**చేకొను వేంకటరాముడు**
**ఈ కథలను అన్నమయ్య ఇంపుగ పాడెన్**

**రాగం : సాళంగనాట**

రాముడిదే లోకాభిరాము డితడు
గోమున పరశురాముకోప మార్చెనటరే ॥రాముడిదే॥

యీతడా తాటకి జించె యీ పిన్నవాడా
ఆతల సుబాహు గొట్టి యజ్ఞముగాచె
చేతనే యీ కొమారుడా శివుని విల్లు విఱిచె
సీతకమ్మ బెండ్లాడె చెప్పగొత్త గదవే ॥రాముడిదే॥

మనకౌసల్య కొడుకా మాయా మృగము నేసె
దనుజుల విరాధుని తానే చెఱిచె
తునుమాడె నేడు దాళ్లు తోడనే వాలి నడచె
యినకులు డితడా యెంత కొత్త చూడరే ॥రాముడిదే॥





యీ వయసు తానే యాలి యెక్కువ జలధి గట్టి
రావణు జంపి సీత మరల దెచ్చెను
శ్రీవేంకటేశు డితడా సిరుల నయోధ్య యేలె
కావున నాటికి నేడు కంటి మిట్టె కదరే ॥రాముడిదే॥

**భావామృతం :**

ఇదే రాముడు, లోకాభిరాముడు (లోకాలన్నింటిలోన మనోజ్ఞమూర్తి) ఆయన గోమున (ఏమాత్రం శ్రమలేకుండా) పరశురాముని కోపమును ఆర్చెను (అణచెను). ఆవిధంగా ఆయన మారిపోయి శాంతుడవునట్లు చేశాడు.

ఈ చిన్నపిల్లవాడా!! తాటకి వంటి రాక్షసిని చించివేశాడు (చీల్చి చెండాడినాడు). ఆ తరువాత సుబాహుని కొట్టి (వధించి) విశ్వామిత్రుని యజ్ఞమును కాపాడినాడు. ఆ చేతితోనే జనకుని ఇంట శివధనస్సును విఱిచి, సీతను 'కమ్మ'గా (మధురముగా) పెండ్లాడినాడు. ఈ సంగతులు చెప్పన్ కొత్త గదవే (చెప్పుకోవటానికి ఎప్పటికప్పుడు కొత్తగా వుంటాయి కదా!)

మన కౌసల్య ముద్దుల కొడుకు, మాయలేడిని "ఏసెన్" (వధించినాడు). విరాధుడు మొదలైన పదివేలమంది రాక్షసులను తానొక్కడే చెఱిచె (రూపుమాపినాడు). ఆయన "తునుమాడె నేడు దాళ్లుతోడనే వాలి నడచె... (అంటే, తునుమాడెన్ + ఏడు తాళ్లు, తోడనే వాలిన్ అణచెన్... అని విడదీసికొంటే.. ఏడు తాటిచెట్లను నరికివేసి దానితో బాటు వాలి, అనే వానరరాజును అణిచివేసినాడు) అని అర్థం. సూర్యవంశస్థుడైన ఈయన చేతలు యెంత కొత్తగా వుంటాయో, చూడండి.

తానే ఈ వయస్సులోనే యెక్కువైన (అనంతమైన) జలధిని (సముద్రాన్ని) కట్టి (బంధించి సేతువుని కట్టినాడు). రావణాసురుని సంహరించి సీతను తిరిగి అయోధ్యకు తీసికొనివచ్చాడు. ఆనాడు సిరుల (వైభవముతో) అయోధ్యను యేలినది ఇతడా... ఈ శ్రీవేంకటేశ్వరుడా? అవును... కాబట్టే ఆనాటి నుంచి నేటివరకు ఆయననే కంటిమి (చూస్తున్నాం). కదరే... (కదండీ...)

## 6-10

## మున్నుడి

అత్యద్భుతమైన భక్తి జాలువారే కీర్తన ఆలపిస్తున్నారు అన్నమాచార్యులవారు. చాల చిన్న కీర్తన అయినప్పటికీ విశేష జనాదరణ పొందిన కీర్తన ఇది. కొండలలో నెలకొన్న కోనేటి ఒడ్డున వెలసిన ఈ కోనేటి నిలయుని కొలవండి అని బోధిస్తున్నారు అన్నమయ్య. ఆయనే శ్రీనిధియైనవాడు. లక్ష్మీదేవియే ఆయన నిధి. ఆయన సామవేదం వినదించే చోటు ప్రీతితో వుంటాడట. ఆ శ్రీవేంకటేశ్వరుడే పరదేవత (పరబ్రహ్మ). భూదేవ తత్పరుడంటే... యేమిటి? చదవండి మరి.

**తరలము :**

**కొలువుడీ ఘనుడైన యీతని కోటి సూర్య ప్రకాశునిన్**
**కొలను ఒడ్డున వున్న దేవుని కొండలయ్యను భక్తితో**
**నిలుపుడీతని శ్రీనిధిన్ నవనీరజాక్షుని నెమ్మదిన్**
**కలలు పండగ అన్నమార్యుడు కాంతముక్తియు దక్కనెన్.**

**రాగం : కళ్యాణి**

కొలువుడీ భక్తి కొండల కోనేటి
నిలయుని శ్రీనిధియైన వాని ॥కొలువుడీ॥

ఆది దేవుని అభవుని సామ
వేదనాద వినోదుని నెర-
వాది జిత ప్రియుని నిర్మల తత్త్వ-
వాదుల జీవనమైన వాని ॥కొలువుడీ॥

దేవదేవుడైన దివ్యుని సర్వ-
భావాతీత స్వభావుని
శ్రీవేంకటగిరి దేవుడైన పర-
దేవుని భూదేవ తత్పరుని ॥కొలువుడీ॥





**భావామృతం :**

ఓ భక్తులారా! మరువకండి. అనన్యమైన భక్తితో ఈ ఏడుకొండలలోని వేంకటగిరిపై నెలకొనిన కోనేటి ఒడ్డున నిలయము గలిగిన ఈ కోనేటి రాయని కొలవండి. లక్ష్మీదేవియే నిధిగా గలిగిన ఈ మహానుభావుని శరణని ఆరాధించండి.

ఈ స్వామి ఆదిదేవుడు. అనాది అని ఆయనను అందరూ కీర్తిస్తుంటారు. ఈయనకు ముందు ఏమీ లేదన్నమాట. ఈయన అభవుడు అనగా పుట్టుకయే లేనివాడు. ఆయన సామవేదం ఎక్కడ గానం చేయబడుతుందో అక్కడ ఆనాదం అంటే ప్రీతితో వినోదిస్తుంటాడు. ఆయన "నెరవాది" (అంటే... బహునేర్పరి... దేంట్లో... దుష్టశిక్షణ శిష్టరక్షణలో బహునేర్పరి, అని అర్థం). ఆయన జితప్రియుడు. అంటే జయింపబడిన ప్రీతి గలవాడు. అంటే ఆయనకు దేనిమీదా ప్రీతివుండదు. ఆయన నిర్మలమైన తత్త్వము తరపున వాదించు వారికి జీవనమైన వాడు.

ఆయన దేవదేవుడు. (అనగా దేవతలకే దేవుడు. దివ్యమైన ప్రభావంగలవాడు. అన్ని భావములకు అతీతుడు అయినవాడు. అనగా ఆయనకు ఏ భావమూ వుండని స్వభావము కలవాడు. ఆయన శ్రీవేంకటగిరిపైన వుండే దేవుడు. ఆయనే పరబ్రహ్మ అని పిలువబడుతున్నాడు. ఆయన భూదేవ తత్పరుడు, అంటే భూదేవ (భూసురులు) అని పిలువబడే బ్రాహ్మణులయందు ఆసక్తికలవాడు. వారివేద పారాయణము అంటే ప్రీతికలవాడని భావము.

**6-11**

## మున్నుడి

పరమాత్ముని ఆరగింపుచేస్తున్నారు అర్చకులు. రకరకాల వంటకాలు, పిండివంటలు, పులుగములు, తీపి పదార్ధములు, మీగడ పెరుగులు, వూరగాయలు ఘుమఘుమలాడే నెయ్యి... మున్నగునవి స్వామి ఆరగింపునకు సిద్ధంగా వున్నాయి. తామరలవంటి నయనములున్న తరుణులు (భూదేవి శ్రీదేవి), సొలసి (పారవశ్యంతో) ఆయనతో యేవేవో ప్రియవచనాలు చెప్పి నవ్వుతూ తినిపిస్తున్నారట. ఆ వేంకటేశ్వరుడు గబగబ ఆరగిస్తున్నారట. అన్నమాచార్యులవారు తన దివ్యమనో నేత్రంతో చూచి చక్కటి కీర్తన చెబుతున్నారు... వినండి.

**ఆ.వె॥ వంటకములు, పిండివంటలు, తీపులు**
**మధుర మీగడలును మంచి నేయి**
**పంకజాక్షులెంచి వడ్డించ నవ్వుతో**
**ఆరగింపుమనెను అన్నమయ్య**

**రాగం : ధన్యాసి**

పంకజాక్షులు సొలసి పలికి నగగా-
నింకా నారగించు మిట్లనే అయ్యా ॥పంక॥

కలవంటకములు పులుగములు దుగ్ధాన్నములు
పలుదెరగులైన అప్పములు అగములు
నెలకొన్న నేతులును నిరతంపు చక్కెరలు
గిలుకొట్టుచును నారగించవయ్యా ॥పంక॥

పెక్కువగునై దంపు పిండివంటల మీద
పిక్కటిలు మెఱుగు బొడి బెల్లములును
వొక్కటిగ గలపు కాని వొలుపు బప్పులతోడ
కిక్కిరియ నిటు లారగించవయ్యా ॥పంక॥





కడు మధురమైన మీగడపెరుగులను మంచి-
అడియాల వూరుగాయల రుచులతో
బడిబడిగ నవకంపు బళ్లెరంబులతోడ
కడునారగించు వేంకటగిరీంద్రా ॥పంక॥

**భావామృతం :**

పంకజాక్షులైన (తామరలవంటి కళ్లున్న) తరుణులు (శ్రీదేవి, భూదేవి) సొలసి పలుకుచు (పరవశముతో ప్రియవచనాలు చెబుతూ, నగగా (నవ్వుతూ) తినిపిస్తుంటే... అయ్యా! ఇట్లనే ఇంకా యెక్కువగా ఆరగింపుము తండ్రీ!

స్వామీ! నీ ఆరగింపునకు పులు(ల)గములు, దుగ్ధాన్నములు (పాలతో చేసిన పాయసాన్నములు), రకరకాల అప్పచ్చులు, అగములనే వంటలు, నేయికారిపోతున్న నేతి వంటకములు, నిరతంపు (మిక్కిలి ఆసక్తికలిగించు) చక్కెర పదార్ధములు, ఇటువంటి వెన్నోవున్నాయి. గిలుకొట్టుకొని (వ్రేళ్లతో కలయబెట్టుకొంటూ) ఆరగింపుము తండ్రీ!

స్వామీ! బాగుగా దంచివేసిన పిండ్లతో (శనగపిండి, బియ్యపు పిండి, గోధుమ పిండి మొదలైన పిండ్లతో) రకరకాల పిండి వంటలున్నాయి. పొడిబెల్లము అధికముగా చల్లుటవలన కొన్ని తీపివంటకములు మెఱిసిపోతున్నాయి. వాటిని ఒక్కటిగా, కలపుకొని... ఒలుపు బప్పులలో (ఎక్కువ అయి ఒలికి పోతున్న పప్పులతో) కిక్కిరియునట్లు (కాస్తంత కూడా సందులేకుండా కడుపునిండునట్లు) ఆరగింపుము తండ్రీ!

స్వామీ! యెంతో మధురమైన మీగడ పెరుగున్నది. నీకు చిన్నప్పటినుంచీ (కృష్ణయ్యగావున్నప్పటినుంచీ) ఇష్టంకదా! అడియాల వూరగాయలు (బాగుగా వూరిన పచ్చళ్లు) మంచి రుచులతో వున్నాయి. వాటిని నవకంపు పళ్లెములలో (తొమ్మిది రకములైన పళ్లెములలో వడ్డించినారు). ఓ దేవదేవా! వాటన్నింటినీ బడిబడిగా (ఒకదాని తరువాత ఒకటిగా) కడు నారగించుము. (సమృద్ధిగా భుజించుము) ఓ వేంకటగిరీంద్రా! వాటినారగించి మమ్మల్ని తరింపజేయుము తండ్రీ!

## 6-12

## మున్నుడి

వెనకజన్మలలో మనం చేసికొనిన కర్మఫలం పొమ్మంటే పోదు. శరీరం పోయినా అది జీవిని అప్పులవాడి ఋణంలా వెంటపడి తరుముతూనే వుంటుంది. అందునా, అది మామూలు 'అప్పు' కాదు. వీడని బారువడ్డీ అప్పు. అంటే వడ్డీమీద కూడా వడ్డీ కట్టాల్సిందే. మనం యెందుచొచ్చినా (ఏ జన్మయెత్తినా) అది పోనీదు. ఈ ఋణం పట్టి పీడిస్తూనే వుంటుంది. మరి దారి యేమిటి? అన్నమాచార్యులవారు సులువైన దారి చూపిస్తున్నారు. శ్రీవేంకటేశ్వరుని ఆశ్రయించండి. తండ్రీ! నీవే మాకు దిక్కు అనండి. పూర్తిగా నమ్మండి అన్నీ ఆయనే చూసుకుంటాడు.

**ఉ॥ ముందటి జన్మ కర్మములు ముంచును తప్పక బారువడ్డియై**
**యెందును చొచ్చినన్ విడవు యీఋణమెప్పుడు పట్టి పీల్చురా**
**విందుగ అన్నమార్యుడనె పెట్టినవ్రాతగు నూరు యేండ్లకున్**
**పొందుగ వేంకటేశ్వరుని పూర్తిగ నమ్మిన వీడు జిక్కకన్.**

**రాగం: గుండక్రియ**

ముందటి జన్మములెల్లా ముంచె బారుబడి వడ్డి
యెందు చొచ్చినాను బోనియ్యదీ రుణము ॥ముందటి॥

నుదుట వ్రాసిన వ్రాలు నూరేండ్ల పత్రము
పొదలు నా కర్మయే పూటకాపు
వెదకి సంసారము వెంట బైతరవు
యిది యెందు చొచ్చినా బోనియ్యదీ రుణము ॥ముందటి॥

పుట్టినప్పుడే తనువు భోగ్యమై నిలిచెను
జట్టి గామినుల పొందు సరియాకలు
నెట్టనయాహారములు నిచ్చ నిచ్చ లంచాలు
దిట్టనై యెందు చొచ్చినా దీరదీ రుణము ॥ముందటి॥





యెక్కువైన శ్రీవేంకటేశు మఱగు చొచ్చి
తెక్కుతోడ సలిగెల దిరుగగను
అక్కరతో నప్పుడెల్లా నవి మాకు దామచ్చి
చిక్కి యెందు చొచ్చినా జేరు నీరుణము ॥ముందటి॥

**భావామృతం:**

ఓ నరులారా! మనం ముందుగా యెత్తిన జన్మలలో చేసికొనిన కర్మఫలము అంత తేలికగా పోదు. అప్పుల వాడి ఋణానికి బారువడ్డీలా పెరిగిపోతూనే వుంటుంది. అప్పుకు అయిన వడ్డీకి కూడా వడ్డీ వేస్తాడు ఆ వడ్డీకాసులవాడు. ఈ రుణము మనం యెందుకొచ్చినా (ఏ జన్మ యెత్తినా) పోనియ్యదు. (హరిశ్చంద్ర చక్రవర్తిని కూడా కాటికాపరిని చేసి కన్నీరు పెట్టించింది కదా!)

పూర్వ జన్మ కర్మఫలాన్ని మన నుదుటి మీద వ్రాసి అమ్మకడుపులో పడేస్తాడు ఆ పరమాత్మ. అది నూరేళ్ళు ఋణపత్రంలాగ "పూటకాపు" వలె వెంటపడి యేపూటకాపూట వడ్డీ కర్మఫలంలా వసూలు చేస్తూనే వుంటుంది. ఈ సంసారంలో (జగత్తులో) వెంటపడి తరుముతూనే వుంటుంది. ఇది మనం యెందుజొచ్చినా పోనియ్యదు. ఈ ఋణం వెంటాడుతూనే వుంటుంది.

ఈ తనువు (శరీరము) మనం పుట్టినప్పుడే భోగ్యమై (అనుభవించుటకు సిద్ధమైనదై) వస్తుంది. జట్టికామినుల పొందు (బోగందానితో ప్రణయం) లాగ, సరియాకలు (కూడుతుందీ, దగ్గరకు రానివ్వదు) యెంతిస్తే అంతే. తిండి దొరకాలన్నా దీనికి యే పూట లంచం ఆ పూట ఇవ్వాల్సిందే... (కోటీశ్వరుడైనా తిండిలేకుండా పడివుండాల్సిందే... అవునా? కాదా?) దిట్టంగా యెక్కడికి పోతానన్నా, ఇది పోనియ్యదు.

సర్వాధికుడైన శ్రీవేంకటేశ్వరుని, మఱుగుచొచ్చిన (ఆయనను శరణనిన) తెక్కువ సలిగెల దిరుగ అగును... (ధైర్యంతో ఆశ్రయం పొంది వ్యవహరిస్తే అన్నీ అవుతాయి అత్యవసరంగా మనం చేసిన అప్పులన్నీ మాకు "దామచ్చిచిక్కు" (తమంతట తామే సానుకూలమై తీరిపోతాయి. మనం యెందు చొచ్చినా ఈ రుణం తీరిపోవటం కూడా, దానంతటదే జరిగిపోతుంది. ఇది తథ్యం.

**6-13**

## మున్నుడి

కొన్ని కారణాంతరాల వల్ల మహాత్ములు మానవ జన్మ పొంది, భూమిపై జన్మించి వారి కర్మఫలం అనుభవించి తిరిగి వచ్చిన చోటికే వెళ్లిపోతారు. వారిలో కొంతమంది జ్ఞానబోధ చేశారు. కొంతమంది మౌనులై, నిస్సంగులై అవధూతలై కేవలం శేషజీవితం పరిసమాప్తి అవటం కోసమే జీవిస్తారు. వారు భగవంతునితోనే సంభాషిస్తూ వుంటారు. వారు ఒకప్పుడు నవ్వుతారు. ఒకప్పుడు ఏడుస్తారు. ఒకప్పుడు కోపిస్తుంటారు. అది మనకు వెఱ్ఱి చేష్టలాగ కనిపిస్తుంది. అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో వాళ్లు వెఱ్ఱి కాదని, అసలు వెఱ్ఱివాళ్ళెవరో చెబుతున్నారు.

**ఆ.వె॥ విష్ణుదాస్యమెపుడు వీడు నహంకారి**
**వెఱ్ఱివాడు యతడె వినుడు నిజము**
**వెఱ్ఱివాడు కాదు వెఱ్ఱివాడన్నాడు**
**అన్నమయ్య పలుకు మిన్న జుమ్మి!**

**రాగం : బౌళి**

వెఱ్ఱివాడు వెఱ్ఱిగాడు, విష్ణు దాస్యము లేక
విఱ్ఱవీగే యహంకారి వెఱ్ఱివాడు ॥వెఱ్ఱి॥

నాలుకపై శ్రీహరినామ మిట్టే వుండగాను
జోలితో మఱచిన నీచుడే వెఱ్ఱివాడు
ఆలరి యీజగమెల్లా హరిరూపై వుండగాను
వాలి తలపోయలేనివాడు వెఱ్ఱివాడు ॥వెఱ్ఱి॥

కూరిమి బ్రహ్మాండాలు కుక్షినున్న హరికంటే
కోరి వేరే కలడనే కుమతి వెఱ్ఱివాడు
చేరి తనయాత్మలోన శ్రీరమణుడుండగాను
దూరమై తిరిగే వాడే దొడ్డ వెఱ్ఱివాడు ॥వెఱ్ఱి॥





సారపు శ్రీవేంకటేశు శరణాగతి వుండగా
సారె గర్మములంటెడి జడుడు వెఱ్ఱివాడు
చేరువ నాతని ముద్ర చెల్లుబడి నుండగా
మోరతో పైవున్న వాడే ముందు వెఱ్ఱివాడు ॥వెఱ్ఱి॥

**భావామృతం :**

ఓ మానవులారా! మీరంతా వెఱ్ఱివాడు (పిచ్చివాడు) అనుకొనేవాడు వెఱ్ఱివాడు కాడు. నిజానికి శ్రీహరిని శరణని సేవించని అహంకారి వెఱ్ఱివాడు. విఱ్ఱవీగుతూ వాడుచేసే పనులే పిచ్చిపనులు.

'శ్రీహరి' అనుట యెంత సులభం!! సులభంగా ఆయన నామపారాయణ చేయక, జాలితో (మనోక్లేశముతో) ఆయనను మఱచిన నీచుడే వెఱ్ఱివాడు. ఈ జగమంతా శ్రీహరి రూపంతో అలరియుండగా, వాలి (అతిశయించి) ఆయనను ధ్యానించలేనివాడు అసలైన వెఱ్ఱివాడు. అంతేకాని మీరు వెఱ్ఱివాళ్లను కొనేవాళ్లు కాదు.

శ్రీహరి, కూరిమి (ఆప్యాయంగా) ఈ బ్రహ్మాండమునంతా తన కుక్షిలో (పొట్టలో) వుంచుకొని ప్రేమగా రక్షిస్తున్నాడు. ఆయన జగద్రక్షకుడు. ఆయన కాక వేరే ఇంకెవరో వున్నారు, వారివల్ల ఈ ప్రపంచం నడుస్తున్నదనే కుమతి (దుర్బుద్ధిగలవాడు) వెఱ్ఱివాడు. అంతర్యామిగా శ్రీకాంతుడు మనలోనే వున్నాడు. మనంలోపలికి గాలి పీలుస్తున్నది ఆయనవల్లనే. ఆయనే అంతరాత్మ. ఆయనవేఱే యెక్కడో వున్నాడని వెతికేవాడు అసలైన పెద్ద వెఱ్ఱివాడు. అవునా?

అన్నిటికీ సారము (మూలము) అయిన శ్రీవేంకటేశ్వరుని యొక్క శరణాగతి ఒక్కటిచాలు నిన్ను తరింపచేయటానికి. దాన్ని పట్టు కొనకుండా కర్మిష్ఠియై ఏవేవో కర్మలు (యజ్ఞ యాగాలు) చేసేవాడు అసలు జడుడు (వెఱ్ఱివాడు). ఆయన ముద్ర (నామము, శంఖ చక్రములు) విశ్వంలో యెక్కడైనను నీవు శ్రీహరి దాసుడవని నీకు విలువ నిస్తుంది. ఆ చెల్లుబడి నీ స్వంతమై వుండగా, మోరతో (పశువువలె) వ్యవహరించే వాడే ముందస్తు వెఱ్ఱివాడు.

**6-14**

## మున్నుడి

ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు చక్కని ఉపమానములతో తన మనస్సులోని మాటను చెబుతున్నారు. పోలి మేరలు లేకపోతే ఏ వూరుయేదో ఎలా తెలుస్తుంది? మంచిపేరు, అభివృద్ధియే బ్రతుకు వ్యర్థమే కదా! గౌరవం లేకపోయాక యెంత ప్రేమ వొలకపోసి వుపయోగమేమిటి అంటున్నారు. భయమూ శంకలేని భక్తితో శ్రీవేంకటేశ్వరుని వేడుకోవాలి. ఆయనలేని ఉత్సవాలెందుకు? దండుగ అంటున్నారు.

**మ॥ పొలిమేరొక్కటిలేక యుండ తగునా వూరన్న దింకేటికిన్**
**విలువౌ పెంపది లేనిచోట బ్రతుకన్, వేసార వ్యర్థంబగున్**
**చెలిమిన్ గారవమేమిలేక ప్రియమున్ సేసేము యింకేమిరా?**
**పలికెన్ సత్కవి అన్నమయ్య వినుమా పాలింపు మా శ్రీహరీ!**

**రాగం : రంజని**

ఊరులేని పొలిమేర పేరు పెంపులేని బ్రతుకు
గారవంబు లేని ప్రియము కదియ నేటికే ॥ఊరు॥

ఉండరాని విరహవేదన వుండని సురతసుఖమేల
యెండలేని నాటినీడ యేమి సేయనే
దండి గలుగు తమకమనెడి దండలేని తాలిమేల
రెండునొకటి గాని రచన ప్రియములేటికే ॥ఊరు॥

మెచ్చులేని చోట మంచిమేలు గలిగినేమి నెలవు
మచ్చికలేనిచోట మంచిమాటలేటికే
పెచ్చు పెరుగులేని చోట ప్రియము గలిగియేమి ఫలము
ఇచ్చలేని నాటి సొబగులేమి సేయనే ॥ఊరు॥





బొంకులోని చెలిమి గాని పొందులేల మనసులోన
శంకలేక కదియలేని చనవు లేటికే
కొంకుగొసరు లేని మంచికూటమలర నిట్లగూడి
వేంకటాద్రి విభుడు లేని వేడుకేటికే ॥ఊరు॥

## భావామృతం

ఓ జనులారా! ఊరు అనేదొకటుంటే... దానికి పొలిమేర (సరిహద్దులు) వుండాలిగాని, వూరే లేకపోతే సరిహద్దు దేనికి? పేరు మర్యాదలేని బ్రతుకు వ్యర్థం కదా! గౌరవము లేకపోయాక యెంత ప్రేమిస్తున్నా నిరుపయోగమే. (ఉప్పులేని పప్పులాగా ఎంతవున్నా వ్యర్థమే). ఇవన్నీ కదియనేటికి (కూడియేమి లాభము)

జవ్వని సమాగమము లేనప్పుడు అంతులేని విరహము దండుగ మారి వ్యవహరమే కదా! బాగా ఎండవుంటే నీడ వుపయోగం గాని యెండలేని రోజున నీడయెందుకు? దండి (శౌర్యము) ఉన్న వాడికి తమకము (మోహము) వున్నా చెల్లుతుంది. అట్లే అండ, దండలేనివాడికి యెంత ధైర్యమున్నా వ్యర్థమే కదా! ఇద్దరు ఒక్కటి కాకపోయాక, ఎంత ప్రేమ వొలకబోసినా అదంతా యెందుకు?

ఎవరికన్నా మంచిమేలు (వుపకారం) చేసినంత మాత్రాన, సరిపోదు, అప్పుడప్పుడూ వారిని మెచ్చుకోవాలి కూడా. ఎవ్వరిమీదనైనా మచ్చిక (ఆసక్తి) లేకపోతే వారితో యెన్ని మంచిమాటలు మాట్లాడినా లాభంలేదు. ఒక యజమాని దగ్గర పనికి జీతంలో పెరుగుదలవుండదు కాని ఎంతో ప్రేమ వొలకబోసి మాట్లాడుతాడు. ఆ ఊకదంపుడు వ్యర్థమే కదా! కోరికలేనివాడు సౌందర్యాన్ని యేమి చేసికొంటాడు?

అవసరమైతే స్నేహం కోసం, బొంకుటకైన సిద్ధపడే స్నేహితుడు కావాలి. అట్లు లేనివాడి పొందు యెందుకు? మనస్సులో యేమాత్రం శంకలేక కలిసిపోవలెను. కాని పైపై చనవులు (ఆప్యాయతలు) యెందుకు? కొంకుకొసరు లేని (భయము, సంకోచము లేనట్టి) మంచి భక్తితో శ్రీవేంకటేశ్వరుని వేడుకొనవలెను. అంతేకాని శ్రీహరియే లేని ఉత్సవము అదేమి ఉత్సవం చెప్పండి.

**6-15**

## మున్నుడి

అన్నమాచార్యులవారు చతుర్భుజుడైన శ్రీకృష్ణుని వర్ణిస్తున్నారీ కీర్తనలో. ఆయన సాక్షాత్తు శ్రీనాధుడు. ఆయనను కనులారా దర్శించి చేరవలదా? అంటున్నారు. ఆయన శంఖచక్రములతో వరదహస్తుడైన విష్ణువువలె దేవకీ వసుదేవులకు దర్శనమిచ్చాడు. ద్వాపరయుగంలో దేవతల భయం నివారించాడు. విశ్వరూపం చూపాడు, చాపల్యం మాని కౌరవులను ఆయనని శరణనవలదా? సరే, నేడు ఆయనే వేంకటేశ్వరుడు అని శరణు కోరవలదా?

**కం॥ కనరే నాలుగు చేతుల**
**వనమాలిని శంఖచక్ర వరదున్ శౌరిన్**
**వినుమని అన్నయ పాడెను**
**తన కృష్ణుడు తిరుమలగిరి దాతని తెలిపెన్**

**రాగం : హిందోళం**

కానరు నాలుగు కరముల వానిని
శ్రీనాథుండని చేరగ వలదా ॥కానరు॥

ఘన చక్రముతో గరుడని నెక్కుక
కినిసి మెరయు నలకృష్ణునిని
ఘనులై ఇప్పటి కాలపు మనుజులు
మునుప విష్ణుడని మొక్కగ వలదా ॥కానరు॥

పలుదేవతలకు భయములు మాన్పుచు
అల విశ్వరూపమైనపుడు
చలము మాని యచ్చటి కౌరవులును
తెలిసి దేవుడని కొలువగ వలదా ॥కానరు॥





చెప్పిన యితడే శ్రీవేంకటమున
యెప్పుడు వరములు ఇయ్యగను
తప్పక యీతని దాసులవలనే
యిప్పటివారలె యెరగగ వలదా ॥కానరు॥

## భావామృతం

ఓ ప్రజలారా! చతుర్భుజుడైన ఈ శ్రీహరిని, శ్రీనాథుని దర్శించరేల? ఆయనను దర్శించి ఆయనను చేరుకోవలదా?

గొప్ప చక్రాయుధముతో గరుత్మంతుని అధిరోహించి వెలుగులు జిమ్ముచున్న శ్రీకృష్ణుని పూర్వపు శ్రీమహావిష్ణువని మొక్కవలదా?

ఎంతోమంది దేవతల భయమును హరించిన ఈ కృష్ణుడు అసురాంతకుడు. ఆనాడు కౌరవ సభలో విశ్వరూపం చూపించినప్పుడైనా వారు ఆయనెవరో గ్రహించి శరణన వలదా?

ఆనాడు భగవద్గీతను ఆవిధముగా చెప్పిన శ్రీకృష్ణుడే నేడు శ్రీవేంకటశైలమున వెలసిన శ్రీవేంకటేశ్వరుడు. ఎప్పుడూ వరములనీయుటకే ఆయన అవతరించినాడు. తప్పకుండా ఈయన దాసుల వలెనే ఈ కలియుగంలో జీవులు వ్యవహరించవలదా? తప్పకుండా అలాగే వుండాలి.

## మున్నుడి 6-16

అన్నమాచార్యులవారి అద్భుతసృష్టిని ఆస్వాదించండి ఇక్కడ ఈ కీర్తన రూపంలో ఆయన కూడా ఒక గోపబాలుడై యశోదమ్మతో కృష్ణయ్య ముచ్చట్లను చెబుదున్నారు. ఈ కృష్ణయ్య మాయలు ఏమని చెప్పమంటావమ్మా! ఈ సంగతుల గురించి అనరాదు వినరాదు. రోజుకు ఒక కొత్తమాయ చూపిస్తాడు. ఇదంతా మాకు ద్రిష్టము (భాగ్యము).. అంటున్నారు. కీర్తనలో ఆ మాయలను వివరించారు. ఏడిపించబడిన గోపబాలుర కన్నీళ్ళను వేంకటేశ్వరుడు పట్టిజోకితే (తూచంగానే) అవి మంచి ముత్యాలయిపోయాయట. ఎందుకంటే ఆ గోపాలకృష్ణయ్యే తిరుమలవేంకన్న అంటున్నారు.

**కం॥ అనరాదిది వినరాదనె**
**ఘనుడగు కృష్ణయ్యమాయ "కత"లాయె జుమీ!**
**దినదినము కొత్తలాయెను**
**మన ద్రిష్టము అన్నమయ్య మాటను వినుడీ!**

**రాగం : దేశాక్షి**

అనరాదు వినరాదు ఆతని మాయలు
దినదిన క్రొత్తలాయ ద్రిష్టమిదేమాకు ॥అనరాదు॥

ఆడెడి బాలుల హరి అంగిలి చూపుమని
తోడనే వాండ్ల నోర దుమ్ములు చల్లి
యీడమాతె జెప్పగాను యిందరము గూడిపోయి
చూడబోతే పంచదారై చోద్యమాయనమ్మా ॥అనరాదు॥

తీటతీగోలు సొమ్మంటా దేహము నిండా గట్టె
తీటకుగాక బాలులు తెగవాపోగా
పాటించి యీ సుద్ది విని పారితెంచి చూచితేను
కోటికోటి సొమ్ములాయె కొత్తలోయమ్మా ॥అనరాదు॥





కాకిజున్ను జున్నులంటా గంపెడేసి తినిపించి
వాకొలిపి బాలులెల్ల వాపోవగ
ఆకడ శ్రీవెంకటేశుడా బాలుల కంటి నీరు
జోకగ ముత్యాలు పేవె జూడగానేనేము ॥అనరాదు॥

**భావామృతం :**

ఓ యశోదమ్మా! ఈ కృష్ణయ్య మాయల గురించి ఎక్కడా అనరాదు వినరాదు (అనలేము వినలేము). అంటే మనం చెప్పి యెవ్వరూ నమ్మలేరు . ఈ సంగతులు రోజురోజుకీ కొంగ్రొత్తగానే వుంటాయి. ఇదంతా మాకు భాగ్యమేనమ్మా!

మీ కృష్ణయ్య స్వయంగా శ్రీహరియే. ఎందుకంటే ఒక సారి తనతో ఆడుతున బాలురను ఏదీ మీనోరుచూపండి అని అడిగి, ఆ వెర్రి గోపాలురు నోళ్ళు తెరువంగానే చటుక్కున నోట్లోదుమ్ము పోసినాడు. ఇంతమందిమీ కూడబలుక్కుని మీక చెప్పికొట్టిద్దామనుకొంటే నోట్లోవున్న దుమ్ము కాస్తా పంచదారగా మారిపోయింది. ఏమి చోద్యం (వింత) తల్లీ!

ఒకనాడు, తీటతీగోలు (దురదగుంట ఆకు తీగెలు) తీసుకువచ్చి, ఇవిగో మీ సొమ్ములు (నగలు) అని మెడకు చుట్టుతాడు. తీటకుగాక (దురద ఆపుకో లేక) వాళ్ళు ఏడుస్తుంటే పకపకానవుతాడు. ఈ సుద్ది (కధ) విని నువ్వు పారితెంచి (గబగబ) వచ్చి చూస్తె ఈ తీగెలే నగలుగా మారిపోయి మా నోళ్ళు మ్రాన్పడిపోయాయి. అదీ పాతనగలు కాదు సరికొత్తనగలు. ఇకమమ్మల్నేం చెప్పమంటావమ్మా!

ఒకసారి కాకిజున్నును తీసికొని వచ్చి, ఇదిగో జున్ను తినండి బాగుంటుంది అని గంపెడు కాకి జున్ను వెర్రి గోపాలురతో తినిపించాడు వా కొలిపి (నోళ్ళు చెడి) వాళ్ళంతా, వాపోతుంటే (ఏడుస్తుంటే) తను దయగల శ్రీ వేంకటేశ్వరుడు కాబట్టి వాళ్లు ఎంత కంటినీరు కార్చారో, జేకగా (తూచినట్లు) అన్ని మంచి ముత్యాలు ఆ కన్నీటి బొట్లు అయ్యేట్లు చేశాడు. ఓ యశోదమా! నేము( మేము) ఇంకా ఏం చెప్పగలమమ్మా!

## 6-17

## మున్నుడి

హరిదాసులపై చక్కని కీర్తన నాలాపిస్తున్నారు మన అన్నమాచార్యులవారు. ఓ శ్రీహరీ! అన్ని చోట్లా నీవు లేవా! పూర్వం ప్రహ్లాదుడు వంటి నీ దాసులు నిన్ను సమస్తమునందును దర్శించిరి గదా! కాకపోతే అటువంటి నీ దాసులు ఈ అవనిలో అత్యల్పంగా వున్నారు. ఆ మాట నిజం. వాళ్ళ కోసం వెతకాల్సిందే..మరి సంకోచించకుండా నీ దాసులెంతో మంది నన్ను కరుణించారు. ఇక ఓ శ్రీవేంకటేశ్వరా! కడమలేమిటికి! (కొరతేమున్నది?) అంటున్నారు.

**చం॥ అరయగ నీదు దాసులిల అల్పము సంఖ్యల అంతియే ప్రభూ!**
**హరి! నిను జూడగాగలరు అద్భుత రీతిని అన్ని తావులన్**
**పరమ నిగూఢ సత్యమును బాగుగ జెప్పెను అన్నమార్యుడున్**
**మురియుచు వేంకటాధిపుడు ముందుగ కీర్తన నాలకించుటో.**

**రాగం : సావేరి**

హరి నీవు లేవా అన్ని చోట్లను తొల్లి
అరయ నీదాసులే యరుదింతే కాక ॥హరి॥

కంటిమి నీ దాసులను కన్నుల పండుగగాను
కొంటిమి పాదతీర్థము కొల్లలుగాను
వింటిమి నీ నామములను వీనుల పండుగగాను
అంటిన మోక్షము త్రోవ అడుగనేమిటికి ॥హరి॥

నుతించి మాటాడితిమి నోరార నీ దాసులను
మతి చొక్కితిమి దాస్యమహిమచేత
మతిగంటిమి వారి సంగతి కూటముల వల్ల
వెతకి విజ్ఞానము వేడనేమిటికి ॥హరి॥





మొక్కితి జాగిల నీ మోహపు దాసులకును
యెక్కితి పరమ పదమిహమందునే
తక్కక మన్నించిరి నీ దాసులెనన్నన్నిటాను
గక్కన శ్రీవేంకటేశ కడమలేమిటికి ॥హరి॥

**భావామృతం :**

ఓ శ్రీహరీ! యెల్లెడను (ప్రతిచోటా) నీవులేవా? ఉన్నావు. కానీ తొల్లి నీ దాసులే (పూర్వకాలం నాటి నీ దాసులే) అరుదుగావున్నారు. కాక (అంతేకాని మరొకటి కాదు).

ప్రభూ! మాకన్నుల పంటవలె నీ దాసులను గాంచితిమి. వారి పాదతీర్ధమును సమృద్ధిగా స్వీకరించితిమి. వారు సంకీర్తనముజేయగా నీ నామమును మా చెవ్వులకు విందు అన్నట్లు వింటిమి. ఇంక మాకు మోక్షమార్గం తెలిసిందా అని వేరే అడుగవలెనా? అనగా మేము ముక్తి పథంలోనే వున్నాము. అచిరకాలంలోనే మేము శ్రీహరిని చేరుట తధ్యము.

ఓ శ్రీహరీ! నీ దాసులను పొగడుచు మా నోరార మాటలాడితిమి. నీ దాస్యము వలన అనగా దాని మహిమచేత మనస్సుచొక్కుట (పరవశించుట) అనుభవించితిమి. వారి కలయికలవల్ల మతిగంటిమి (సద్బుద్ధిని పొందితిమి). ఇంకా విజ్ఞానమనగా నేమియో తెలియుటకు పరులను వేడుకొనవలెనా?

ఓ దేవదేవా! నీ మోహపు దాసులకు (నీపై అపరిమితమైన వ్యామోహంగల నీ దాసులకు) మేము జాగిల మొక్కితిమి (సాష్టాంగ నమస్కారములను ఆచరించితిమి). ఇహ మందునే పరమపదము (మోక్షమార్గమును) అంటితిమి (చేరితిమి), ఇక నీ దాసులు మమ్ము విడువక అన్నిటిలోను అన్నివిధములా మన్నించిరి. ఓ శ్రీవేంకటేవ్వరా! ఇంకా కడమలేమిటికి? (ఇంక కొరతయేమున్నది) తండ్రీ!

**6-18**

## మున్నుడి

సర్వేశ్వరుడైన శ్రీవేంకటేశ్వరునిపై భక్తివుంటే అది అన్ని విధములైన శాంతిని కలుగచేస్తుంది. మా అదృష్టం కొద్దీ అది ప్రకటింపబడి మాకు కూడా కలిగింది. అందువల్ల ఇదియే మమ్ముల్ని బ్రతికిస్తుందనే నమ్మకంతో వుండిపోయాం-అంటున్నారు అన్నమాచార్యులవారు. శ్రీహరి భక్తి వలన కలిగే ప్రయోజనాలుయేవేవో వివరిస్తున్నారు. ఈ శరీరంతో చేసే పాపకర్మలెల్లా నశిస్తాయి? కాయపు నీ ముద్రలచే గక్కున వీడు, అంటున్నారు. శంఖచక్రముల ముద్రలు ధరించిన వైష్ణవులకు యే పాపము అంట దంటున్నారు.

**ఆ.వె॥ సకల శాంతికరము సర్వేశ! నీపైన**
**భక్తి, మాకునబ్బె బ్రతికితిమిర**
**యెల్ల పాతకముల హే వేంకటేశ్వరా!**
**అణచు శరణమనెను అన్నమయ్య.**

**రాగం : బహుదారి**

సకల శాంతికరము సర్వేశ నీపై భక్తి
ప్రకటమై మాకు నబ్బె బతికించు నిదియె ॥సకల॥

మనుసులో పాపబుద్ధి మరియెంత దలచిన
నిను దలచినంతనే నీరౌను
కనుగొన్న పాపములు కడలేనివైనాను
ఘనుడ నిన్ను జూచితే కడకు తొలగును ॥సకల॥

చేతనంటి పాతకాలు సేనగానే చేసినాను
ఆతల నీకు మ్రొక్కితే నన్నియు బాయు
ఘాతల చెవుల వినగా నంటిన పాపము
నీతితో నీ కథవింటే నిమిషాన బాయును ॥సకల॥





కాయమున చేసేటి కర్మపు పాపము లెల్ల
కాయపు నీ ముద్రలచే గక్కన వీడు
యే యెడ వేంకటేశ యేయే పాతకమైనా
ఆయమైన నీ శరణాగతిచే నణగు ॥సకల॥

**భావామృతం :**

ఓ సర్వేశ్వరా! నీ పైన భక్తి మాకు అన్ని విధములైన శాంతిని కలుగచేస్తుంది. మా సౌభాగ్యం వలన మాకు నీ భక్తి అబ్బింది. మేము నిజంగా బ్రతికిపోయాం.

మేము మానవులం కాబట్టి పాపబుద్ధి కలుగుట సహజము. అయితే నిన్ను తలచినంత మాత్రముననే ఆ పాపబుద్ధి మా తలపులలోకే రాదు. మేము అంతులేని పాపాలు చేసినా, ఓ మహానుభావా! నీ దర్శనమాత్రమున అవి కడకు తొలగును (చివరికి వీడిపోతాయి).

దేవా! చేతనైనన్ని పాపాలు సేనగానే (మూకొమ్మడిగా) చేసినా.... ఆతల (అవతల) అవన్నీ నీకు మ్రొక్కితే నశిస్తాయి. చెవుల ద్వారా కూడా చెడు వినుటవలన ఘాతల (ఘోరమైన) పాపం మూటకట్టుకొంటూనేవున్నాం. అవన్నీ నీతితో కూడిన నీ కథలను వింటే నిమిషంలో విడిచిపోతాయి. చేటుతెచ్చే చెడు వినుట అంత ఘోరమైన పాపం.

ప్రభూ! కాయమున చేసేటి (శరీరంతో చేసే) కర్మలవలన యెన్నో పాపములు కలుగుతున్నాయి. అవన్నీ విశిష్టమైన నీ ముద్రలు (శంఖచక్ర చిహ్నములు) ధరించుట చేత నశిస్తాయి. అదీ గక్కున (సత్వరమే). ఓ వేంకటేశ్వరా! ఏయెడ (ఎక్కడైనా, సరే) యేయే పాపములైనా సర్వులకు ఆయమైన (ఆధారమైన) నీ శరణాగతి చేత నశించి తీరుతాయి తండ్రీ!

**6-19**

## మున్నుడి

ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు తనని తాను అలమేలుమంగ చెలికత్తెలా భావించుకొని దేవికి స్వామి చమత్కారం గురించి దెప్పిపొడుపుగా చెబుతున్నారు. (నీ) విభుని వినయములు వినవమ్మా! అయ్యో పాపం, నిన్ను అభయం (భయపడకు అని బుజ్జగించాలట) అడుగుతున్నాడట తనంతటతాను. (నీవంటే అంత భయభక్తులట తనకు). పైకి సీదాసాదాగా కనిపించిన ఈ కీర్తన అంతతేలికగా కొఱకుడుపడదు. కాస్త పరికించండి....మరి.

**తరలము:**

**విభుని ఈ వినయమ్ములన్ చెవి విందుగా వినవే చెలీ!**
**అభయమే అడిగేను నిన్నిక అందునేమిటి జెప్పవే?**
**అభవుడాతడు అన్నమయ్యనె ఆదిదేవుని మెచ్చుచున్**
**ఇభము గాచిన వేంకటేశుడు యెట్టిజాణడొ తెల్పనే.**

**రాగం : ధర్మవతి**

విభుని వినయములు వినవమ్మా నిను
అభయం బడిగీ నయ్యో తాను ॥విభుని॥

రహస్యమున శ్రీరమణుడు పంపిన
విహరణలేకలు వినవమ్మా
అహిపతి శయనంబతి తాపంబై
బహువేదన కగపడెనట తాను ॥విభుని॥

ఆదిమపతి నీ యడుగులు కెరగిన-
వేదాంత రచన వినవమ్మా
నీ దయగానక నిముషమె యుగమై
ఖేదంబున నలిగీనట తాను ॥విభుని॥





కింకరుడట నీ కినుక సేతలకు
వేంకటపతిగతి వినవమ్మా
సంకెలేక నీ చనవున జగములు
కొంకకిపుడె చేకొనెనట తాను ॥విభుని॥

**భావామృతం**

ఓ అలమేల్మంగమ్మా! నీ విభుని వినయములను గమనంచితివా? నేను ఆయన వినయము లెట్టివో చెబుతాను వినవమ్మా! పాపం, నిన్ను అభయం (భయపడకు అనే బుజ్జగింపును) అడుగుతున్నాడమ్మా! అయ్యో! ఎంత అమాయకుడు చూశావా?

శ్రీపతియైన స్వామి, రహస్యంగా నాచేత ఒక విహరణ లేఖను (నీతో విహరించాలని లేఖని) పంపించాడమ్మా! ఆయనకు అహిపతి శయనం (ఆదిశేషునిపై పవ్వళించటం) విపరీతమైన తాపమును కలుగజేసి బహువేదనకు గురిచేస్తున్నదట. తాను చాలా బాధపడుతున్నాడట. అయ్యో! పాపం! విన్నావటమ్మా! చోద్యం.

ఆదిమ పతి (అనాది నాథుడు) అయిన నీ స్వామి నీ యడుగులకున్ (నీ ప్రశ్నల పరంపరకు) యెరగిని (ఎరిగించిన) వేదాంత రచన (మెట్టువేదాంతం) వినవమ్మా! నీవు కరుణించనందు వలన ఆయనకు నిముషం ఒక యుగములాగావున్నదట. అంతే కాక పాపం దుఃఖంతో నలిగి పోతున్నాడుట. తాను ఎంతో అలమటిస్తున్నాడట. పాపం కదా!

తల్లీ! నీ నాథుడు, నీవు కోపంతో ఏమన్నా చేస్తావేమోనని వణికిపోయే కింకరుడట (బానిసయట...) పాపం... శ్రీవేంకటపతి గతి ఎటువంటిదో వినవమ్మా! సంకెలేక జగములు (అసంఖ్యాకమైన జగత్తులను) నీచనవున (నీవు పురమాయించినట్లే), తానుచేకొనెనట (తాను పరిపాలిస్తున్నాడట, అయ్యో! పాపం!) నీవు లేక పోతే ఆయన జగన్నాథుడే కాడట. ఏమి చోద్యం తల్లీ!

## మున్నుడి 6-20

అన్నమాచార్యులవారు శ్రీ వేంకటేశ్వరునిపై వినిపిస్తున్న చక్కటి కీర్తన నాలకించండి, ధన్యులవండి. ఓ వేంకటనాధా! ఈ వేంకటాద్రి పొంతకు (సమీపమునకు) రావయ్యా! ఓ అచ్యుతా! నారాయణుడా! అచ్చుగ (గుర్తుగా పెట్టుకొని) నేము (మేము) వున్న చోటికే నీవు రావయ్యా! నీ వుండే చోటికి మేము చేరగలమో...లేరో? అంటున్నారు. స్వామి పట్ల అంత చనువువున్నది తాళ్ళపాక వారికి. బుద్ధుని ప్రస్తావని కూడవున్నదీ కీర్తనలో చదవండి....మరి.

**కం॥ విచ్చేయుమయ్య పొంతకు**
**అచ్చుగ తిరువేంకటేశ! అచ్యుత! మే**
**ఇచ్చటయుండెడి చోటుకు**
**మెచ్చుచు, అన్నయ్య పాడె మించిన కృతినిన్**

**రాగం : మధ్యమావతి**

విచ్చేయవయ్యా వెంకటాచలము పొంత
కచ్చుగా నేమున్న చోటికచ్యుత నారాయణ ॥విచ్చేయ॥

అల్లనాడులంక సాధించందరును బొగడగ
మల్లడినయోధ్యకు మరలినట్లు
యెల్లగాగైలాస యాత్రకేగా కమ్మరమరలి
వెల్లవిరి ద్వారకకు విచ్చేసినట్లు ॥విచ్చేయ॥

యెన్నికెతో గోమంతమెక్కి జయము చేకొని
మన్ననతో మథురకు మరవినట్లు
అన్ని చోట్లానుండి అల్లిరములారగించిన
వెన్నుడవై వేడుకతో విచ్చెసినట్లు ॥విచ్చేయ॥





వహికెక్కి త్రిపురవనితల బోధించి
మహినిందిర వొద్దిక మరలి
విహగగమన శ్రీవేంకటేశ మము గావ
విహితమై నామతిలోకి విచ్చేసినట్లు ॥విచ్చేయ॥

**భావామృతం**

ఓ అచ్యుతా! నారాయణుడా! నీవు ఈ వేంకటాచలము యొక్క పొంతకు (వద్దకు), విచ్చేయవయ్యా! (రావయ్యా!) అచ్చుగా (గురుతుగా) మేమున్న చోటుకు నీవే రావాలి.( ఎందుకంటే నీవుంటే చోటుకు మేము రాలేము తండ్రీ! మాకా శక్తిలేదు.)

అల్లనాడు (ఆనాడు) లంకను గెలిచి, అందురునూ నిన్ను పొగడగ (కీర్తించగా), మల్లడి (అతిశయించి) అయోధ్యకు మరలివచ్చినట్లు మా వద్దకు విచ్చేయవయ్యా! నీ శ్రీకృష్ణావతారంలో నీవు కైలాసయాత్రకేగి, ఈశ్వరుని సందర్శించి మరలి ద్వారకానగరమునకు వచ్చితివి. అదే విధముగా నేడు మమ్ము కరుణించి మా తావునకు రావయ్యా!.

ఆ నాడు బృందావనములో గోమంతమును (గోవర్ధన పర్వతమును) యెక్కి విజయమును సాధించి అపై మధురానగరమునకు మరలి బోతివి, యెన్నో మన్ననలను పొందితివి. అదే విధముగా అన్ని చోట్లా నీవు మా అల్లిరములను (అత్తవారు అల్లుడికి పెట్టు విందు భోజనం) ఆరగించుటకు నేడు వెన్నుడవై (శ్రీకృష్ణుడవై) మా ఇంటికి రావయ్యా!

ఓ ప్రభూ! నీవు ఆనాడు బుద్ధుడవై, వహికెక్కి (కీర్తిగడించి) త్రిపురాసురుల భార్యలకు నీతత్త్వమును బోధించి వారి శీలముల నపహరించి తిరిగి నీవు నీ హృదయేశ్వరి లక్ష్మీదేవి వద్దకు మరలి ఒద్దికతో (అనుకూలడవై) వచ్చితివి. అదే విధముగా గరుత్మంతునిపై పయనించు ఓ శ్రీవేంకటేశ్వరా! మమ్ము రక్షించుటకు మాకు విహితమై (హితకారివై) యుండుటకు మా మనస్సులలో ప్రవేశించుమయ్యా! నీ రాక మమ్ము తరింపజేయును తండ్రీ!

**6-21**

## మున్నుడి

ఈ కీర్తనలో దేవి అలమేలుమంగ తన చెలికత్తెతో తన “రమణుని” (చెలువుని) రమ్మని చెప్పవే, మధ్యలో మమ్మల్ని రవ్వ చేయుట (చిన్నబుచ్చుట) దేనకి? ఆయన వస్తే ఎవరు కాదంటారు? తమ్మి పువ్వుల వాట్లు (పద్మములతో దెబ్బలు) తగిలేదాకా ఆయనంతే .....అంటున్నది. అన్నమాచార్యువారి ఈ కీర్తనలో స్వామి చేసే చేతలే, పెండ్లి తంతు వలెనున్నవి, అంటున్నారు. అన్నమయ్య నాటి తెలుగు అంతతేలిక కాదని మరొక్క సారి తెలుసుకొంటాం....

**ఉ॥ “రమ్మనవే చెలీ! విభుడు రవ్వను సేయగ నేల మమ్మికన్**
**తమ్మి విరుల్ పసందుగను తాకెడి దెబ్బల తాపు దాకనో”**
**తుమ్మెదమేని ఛాయగల తోయజనాభుని పెండ్లి పాటుగా**
**కమ్మని కీర్తనంబు, తమకంబున జెప్పెను అన్నమార్యుడున్.**

**రాగం : కళ్యాణి**

రమ్మనవే చెలువుని రవ్వమమ్మ సేయనేల
తమ్మి పువ్వుల వాట్లు తాకు దాకానా ॥రమ్మ॥

గక్కన జూచినంతనే కన్నులనే పెండ్లాయ
వెక్కనపు తలబాలు వేగినంతానా
పక్కన నవ్వినంతనే పాలకూళ్ళు సెలవాయ
మక్కువతో బువ్వములు మాపుదాకానా ॥రమ్మ॥

తొలుతటి సిగ్గులె దొడ్డ తెరమరుగాయ
వలిపెంపు తెరమాటు వడినింకానా
సొలపుల మాటలనే సోబాన పాటలాయ
చలివాసె పేరటాండ్ల సందడింకానా ॥రమ్మ॥





పై నొరగినప్పుడే పరవని పరపాయ
నానబెట్టి నాగవల్లి నాటి దాకానా
ఆనుక శ్రీవేంకటేశు దంతలోనే నన్నుగూడె
మేనిలోని సంతసాలు మెచ్చుదాకానా ॥రమ్మ॥

**భావామృతం :**

ఓ చెలియా! నా నాధుని నా దగ్గరకు వస్తే రమ్మనవే మధ్యలో మమ్ము “రవ్వసేయనేల”? (చిన్నబుచ్చుట దేనికి?) తమ్మిపువ్వుల వాట్లు (తామరపూల దెబ్బలు) తాకుదాకానా? (తగిలేదాకా ఇంతేనా?)

ఆయన గబుక్కున, నిన్ను చూడగానే, నీ కన్నులకు పెండ్లి కళవచ్చేసింది. అమితంగా తలంబ్రాలు పోసినట్లయింది. ఆయన నీ గాబరా చూసి పక్కున నవ్వగానే, పాలకూళ్ళ సెలవాయ (విందుకు అనుమతి లభించినట్లయింది.). చాలా ప్రీతితో మాపు దాకా (మరునాటి దాకా) బువ్వలు (పెళ్ళి భోజనాలే) పెట్టినట్లయింది.

ఓ చెలీ! నా తొలి సిగ్గులే పెద్దతెరచాటు పెళ్ళితంతు అయింది. ఆ తెరుమాటున వలిపెంపు (అధికమైన వణుకు) వడినింకానా? (ఇంకా ఉధృతమైనదా). పారవశ్యంతో నేను మాట్లాడే మాటలే స్వామికి మంగళగీతాల వలె తోచినవి. పేరటాండ్లు సందడించగా (కోలాహలము చేయగా) చలివాపె (నావణుకుపోయినది).

ఓ చెలీ! నేను స్వామిపై ఆనుకొనగానే పరవని పరుపువలె మృదువుగా తోచినది. ఈ అనుభూతి నాగవల్లి నాటిదాకానా (నాగవల్లి తంతు వరకు) నానబెట్టి (సిగ్గు పడునట్లు చేసినది). ఆనుక (అటుపిమ్మట) శ్రీ వేంకటేశ్వరుడు అంతలోనే నన్ను కూడినాడు. అందువలన నా దేహంలో సంతోషములు మెచ్చుదాకానా (బహుమతి వలె లభించినవి).

**6-22**

## మున్నుడి

అన్నమాచార్యులవారు లావణ్య శృంగారరాయుడైన లక్ష్మీపతి శ్రీవేంకటేశ్వరుని కీర్తిస్తున్నారు. ఈ స్వామితో యేవేళనైనా నీ వినోదాన(ని)కి యేదాయెనేమి? (యేదయినది...అయ్యా) అంటున్నారు. తన మనస్సు పాలసముద్రమట. నీవు సముద్రశాయివి కాబట్టి తన మనస్సులో విశ్రమించమంటున్నారు. భూమిలో వలె తన మనస్సులో ఎన్నో దాగి వున్నాయట. ఆయన భూకాంతుడు కాబట్టి దానినీ పరిగ్రహించాలట. తన మనస్సు నిండు కొండలాంటిదట. ఆయన యేడుకొండలవాడు కాబట్టి దానిలో వినోదించాలట. ఇంకా ఏమి చెప్పగలము?

**తే॥ లక్ష్మినాథుడా! శృంగారరాయ! నీదు**
**ఏ వినోదానికేవేళ యేది హద్దు?**
**వేంకటేశ! లావణ్య! వేవేల నోళ్ళ**
**అన్నమార్యుడు కీర్తించె ఆలపించి.**

### రాగం : శ్రీ రాగం

లావణ్య శృంగారరాయ లక్ష్మినాథ
యేవళ నీ వినోదాన కేదాయె నేమి ॥లావణ్య॥

పాలజల ధివంటిది పవ్వళించు నా మనసు
గాలి వూర్పులే కడళ్ళు కలదులోతు
చాలగ దొల్లి నీవు సముద్రశాయివట
యీ లీల నీ వినోదానకేదాయెనేమి ॥లావణ్య॥

నిక్కపు భూమివంటిది నెలవుకో నామనసు
పెక్కులిన్నియు గలవు పెరుగుచుండు
వుక్కట దొల్లియు నీవు భూసతి మగడ వట
యెక్కువ నీ వినోదాన కేదాయెనేమి ॥లావణ్య॥





నిండుగొండ వంటిదిది నిటు చుండు నా భక్తి
వుండచోటనే వుండు నొక్క చోటను
కొండల రాయడ వట కోరిక శ్రీవేంకటేశ
అండ నీ వినోదాన కేదియాయె నేమి ॥లావణ్య॥

**భావామృతం :**

ఓ లక్ష్మీనాథా! లావణ్యా! శృంగారరాయా! (శృంగార చక్రవర్తి), ఏ వేళ నీ వినోదానకు యేదాయెనేమి (ఏ నాడైనా నీ వినోదానికి ఏది అయితేనేమి?) అనగా అన్నీ నీ వినోదానికే కదా!

ఓ ప్రభు! నా మనసు కూడా క్షీరసాగరము వంటిదే నయ్యా! దానిపైనే కదా! నీవు పవ్వళించునది. నా గాలివూర్పులే (ఉచ్ఛ్వాస నిశ్వాసములే) ఆ సముద్రంలో కడళ్ళు (అలలు). అది చాలాలోతైనది. కాని నీవు తొల్లి (అనాదిగా) జలధిశాయివి ఈ విధముగా నీ వినోదానికి హద్దుయేదయ్యా! కావున నా మనస్సు అనే పాలజలధిలో కాస్త పవ్వళించి నన్ను అనుగ్రహించరాదా తండ్రా!

ఓ దేవదేవా! నా మనస్సు నిక్కపు భూమి వంటిది (నిజంగా భూమిలాంటిది). ఆ నెలవుకో (స్థానమునకు) చాలా సంపదలున్నవి. అవి పెరుగుచున్నవి కూడా. కానీ తొల్లి నీవు భూకాంతుడవు. కావున నా మనస్సులోని వైభవములన్నికీ నీవే నాధుడవు. నీకు ఎక్కువైన వినోదములకు ఏమవుతుంది? అన్ని వినోదములు నీవియే తండ్రీ!

ఓ శ్రీహరీ! నిలుచుండు నాభక్తి (నిశ్చలముగా నిలబడిన నా భక్తి) నిండుకొండవంటిరి (అతిశయించుకొండలాంటిది). అది తానున్న చోటునే అచంచలముగానున్నది. ఓ కొండలరాయా! (ఏడుకొండలవాడా) శ్రీ వేంకటేశ్వరా! అక్కడ నీ వినోదానికి కానిదియేదన్నా వున్నదా? లేనేలేదు తండ్రీ! అన్నీనీ వినోదానాకే

**6-23**

## మున్నుడి

మందర పర్వతమును తన కూర్మావతారంలో మోసి క్షీరసాగర మధనానికి తోడ్పడ్డ శ్రీహరిని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. నీ మహిమ వల్లనే ఇందునే (ఇహలోకంలోనే) ఇందరూ తుదిపదమెక్కిరి (ముక్తి పొందారంటున్నారు). కీర్తన యెంత చక్కటి సీసపద్యం అయిందో గమనించండి.

**సీ॥ ఇందునే తుది పద మెక్కిరి ఇందరున్**
**మందరధర! నీదు మహిమ యిదియే**
**మరిగిన పుణ్యుల మతిలోని కోరిక**
**పరమపు హరి! నీదు పాదము లివి**
**పంచిన యజ్ఞాల ఫలముగానున్నది**
**నించి వోదేవేశ! నీదు పూజ**
**కైవల్యమునకును కడుతెరువైనది**
**ఆవల నీ శరణాగతియును**

**ఆ.వె॥ వేంకటేశు మాకు వెలయించె గురుడిట్లు**
**మంత్రమిదియె జుమ్మి! మాకు యెపుడు**
**అన్నమయ్య పాట అతుకు పద్యమునందు**
**ఏమి చెప్పగలము ఇంతకన్న.**

**రాగం : బిలహరి**

ఇందునే తుదిపద మెక్కి రిందరును
మందరధర నీ మహిమిదివో ॥ఇందునే॥

మరిగిన పుణ్యుల మతిలో కోరిక
పరమపు హరి నీ పాదములు
గరిమ గోపికలు గావలెనన్నది
హరి నీ సంభోగ మదియేపో ॥ఇందునే॥





పొంచి వేదములు పొగడెడి యర్ధము
అంచెల గుణకథలవి నీవి
పంచి యజ్ఞముల ఫలమైయున్నవి
నించి దేవ నీ నిజపూజలెపో ॥ఇందునే॥

కైవల్యమునకు గడు దెరువైనది
ఆ వల నీశరణాగతియే
శ్రీవేంకటేశ్వర చెప్పె మాగురుడు
మా వద్ద నిదె నీ మంత్రమె పో ॥ఇందునే॥

**భావామృతం :**

మందర పర్వతమును ధరించి కూర్మావతారంలో క్షీరసాగర మధనమునకు తోడ్పడిన ఓ శ్రీహరీ! ఇందరును (ఈ నీ భక్తులు) ఇందునే (ఈ ఇహలోకంలోనే, తుది పద మెక్కిరి (ముక్తిని పొందిరి). ఇంతయునూ నీ మహిమయేపో.

ఓ పరమపు హరీ, (ముక్తి నొసగు శ్రీ హరీ!) నీవే కావాలనుకొనే పుణ్యాత్ములైన నీ భక్తుల మనస్సులోని కోరికయే నీ పాదములు (పాదదాస్యము). అటుపిమ్మట ఓ హరీ! నంద వ్రజములోని గోపికలు కావాలనుకొన్నది నీతో సంభోగమే, పో.

విస్తృతమైన వేదములు కీర్తించు అర్ధములన్నియు నీ గుణవైభవమును వివరించు భాగవతకథలే. వివరింపబడిన యజ్ఞముల ఫలములన్నియు దేవా! నీ యొక్క పూజలే సుమా! (అందుచేతనే నీవు యజ్ఞమూర్తివి, వేదమూర్తివి).

ఓ దేవదేవా! కైవల్యమునకు (మోక్షమునకు) కడుతెరువైనది (శ్రేష్ఠమైన దారియైనది) నీ యొక్క శరణాగతి మాత్రమే. ఓ శ్రీవేంకటేశ్వరా! మా గురుదేవులు శ్రీరామనుజాచార్యులవారు చెప్పిన జ్ఞానం ఇదే, మా వద్దవున్న గొప్ప మంత్రం కూడా ఇదే పో.

## 6-24

## మున్నుడి

అతి సునాయాసంగా, వేదాంత తత్త్వబోధను చేస్తున్నారు అన్నమాచార్యులవారు. ఈ మాట మఱచిపోయామంటే ఇక దారిలేదు. కాబట్టి ఓ మనసా! దైవమునే తలచుకో. అంతే కాదు తరితో (కవచమువలె భావించి) తలచుకో అంటున్నారు. శ్రీవేంకటేశ్వరుని యొక్క దివ్యమహిమ వెలుపల (ప్రపంచమంతా), లోపల (అంతః కరణయందును), లోగొనియున్నది (వశపరచుకొనియున్నది). దానినే మనము సృష్టి అంటున్నాము. కనుక ఆయననే నమ్ముకొ అంటున్నారు.

**చం॥ మరిచితిమన్న లేదు మరి మార్గము, దేవుని నమ్ము చిత్తమా**
**తెరువిక శ్రీహరే జగతిదీనజనావళి దిక్కుమొక్కురా**
**నరహరి నామమున్ తలచినాగతి వాడనె అన్నమార్యుడున్**
**తిరుమల వేంకటేశ్వరుని దివ్యప్రభావము చాటిజెప్పెరా.**

**రాగం : భూపాలం**

మరిచితిమంటే మరిలేదు
తరితో తలచవో దైవము మనసా ॥మరచితి॥

పుట్టుచున్నది పోవుచున్నది
పట్టపు జీవుల ప్రపంచము
నట్టనడుమనే నరహరి నామము
గట్టున తలచవో గొనకొని మనసా ॥మరచితి॥

పొద్దు వొడచునదె పొద్దుగుంకెనదె
తిద్దిన జగముల దినదినము
అద్దపు నీడల యంతర్యామిని
వొద్దనె తలచె నొనరవొ మనసా ॥మరచితి॥





లోపల వెలుపల లోగానివున్నది
శ్రీపతి మహిమల సృష్టియిదే
యేపున శ్రీవేంకటేశ్వరుడితడే
దాపని నమ్ముచు తలచవో మనసా ॥మరచితి॥

**భావామృతం :**

ఓ మనసా! ఈ మాట మఱిచిపోయామంటే మరింకొక దిక్కులేదు. నీవు ఆ దైవమునే 'తరితో తలచవో'' (కవచమువలె రక్షగాభావించి ధ్యానింపుము) అదియే సరియైనదారి.

ఈ పట్టపు జీవుల ప్రపంచము (స్థానమును పొందిన ప్రాణల లోకము) జన్మలనెత్తుచున్నది మరియు ప్రాణములను వీడుచున్నది. నట్టనడుమనె (పుట్టుక, చావు మధ్యలో మాత్రమే) నరహరినామము ( ఆ జగన్నాధుని నామమును) స్మరించే అవకాశమున్నది. కావున ఓ మనసా! తలచవో (స్మరించరాదా?)

ఓ మనసా! పొద్దువొడచునదె (సూర్యోదయమగుచున్నది.) పొద్దుగుంకెనదె (సూర్యాస్తమయము అగుచున్నది. తిద్దిన (క్రమశిక్షణలో పెట్టబడిన) జగముల (లోకములలో) దినదినము గడచుచున్నది. అద్దపు నీడల అంతర్యామిని (అద్దములోని ప్రతిబింబము వంటి నీ అంతరాత్ముని నీ వొద్దనె (ఎదుటనే) భావించి, ఒనరవో (సుస్థిరముగానుండుము).

ఓ మనసా! ఈ సృష్టి వెలుపల (ప్రపంచములోను), లోపల (అంతః కరణములలోనూ, లోగొనివున్నది (వశపరచుకొన్నది) స్వామిదివ్య మహిమయే. ఎందుచేతనంటే ఇది శ్రీపతి (శ్రీ మన్నారాయణుడు) తన మహమలతో సృష్ఠించిన జగత్తు. ఇతడే ఏపున (విజృంభించిన) శ్రీ వేంకటేశ్వరుడు. ఆ స్వామియే దాపని (ఆధారము అని ) నమ్ముచూ, తలచవో (ఆయననే స్మరించుము).

**6-25**

## మున్నుడి

బ్రహ్మోత్సవాల కోలాహలం. బంగారు గరుత్మంతుని వాహనంపై వూరేగుతున్నాడు తిరుమల దేవదేవుడు. ఆ వైభవం చూసి పరవశించిపోయిన అన్నమాచార్యులవారు చక్కటి కీర్తననాలపిస్తున్నారు. ఓ దేవా! నీ వుద్యోగము (కార్యక్రమము) యెక్కడనో వైకుంఠంలోవున్నది. ఇక్కువ (అనంతమైన) నీ మహిమకు ఎవ్వరు ఎదురు చెప్పగలరయ్యా! అంటున్నారు. చుల్లరి రాక్షసులు, పల్లించి, పల్లదము వంటి పదములు నేడు వాడుకలో లేవు.

**కం॥ "ఎక్కడ నీ వుద్యోగము?**
**ఇక్కువ, నీ దివ్య మహిమ కెదురేదయ్యా?**
**చక్కగ విచ్చేయుమయా!**
**ఎక్కుచు గరుడనిని," పాడె హితుడన్నయయున్.**

**రాగం :వసంత**

ఎక్కడ నీ వుద్యోగ మెటు విచ్చేసేవయ్యా
యిక్కువ నీ మహమకు నెవ్వరెదురయ్యా ॥ఎక్కడ॥

పల్లించి గరుడనిపై నీవుబ్బున నెక్క
అల్లనాడె పారిజాత మడవికెక్కె
పల్లదపు రుద్రుడును బాణుని వాకిలి దొక్కె
చుల్లరి రాక్షసమూక సురసుర సుక్కె ॥ఎక్కడ॥

గరుడనిపై నీవు కడు బేరెములువార
ధర జలధరుల నమృతములు దేరె
నిరతి గంసాదులనెత్తురుటేరు వారె
పరులు నీ కెదిరిన పగయెల్ల దీరె ॥ఎక్కడ॥





బంగారు గరుడని పై నీవు వీధులేగ
చెంగట శ్రీవేంకటేశ సిరులు మూగె
సంగతినమేల్మంగ సంతసాన విఱవీగె
పొంగారు దేవదుందుంభులు పైపై వాగె ॥ఎక్కడ॥

**భావామృతం :**

ఓ దేవదేవా! యెక్కడ నీ వుద్యోగము? (నీ కార్యనిర్వహణ యెక్కడ? వైకుంఠంలో) ఇక్కువ (ఇక్కడకు) ఎటువిచ్చేసేవయ్యా? (ఎట్లు వచ్చెదవు?) నీ మహిమకు నెవ్వరెదురయ్యా? ( ఎదురు ఎవరు చెప్పగలరయ్య)

ప్రభూ! పల్లించి (మెత్తని ఆసనము వేసికొని) గరుడునిపై నీవు వుబ్బున (సంతోషంతో) యెక్కగానే, అల్లనాడు (పూర్వం ద్వాపరయుగంలో) స్వర్గంలోని పారిజాతవృక్షమును అడవికి (ద్వారకానగరమునకు) యెక్కె (చేరినది). ఎక్కడో కైలాసంలో వుండవలసిన, పల్లదంపు (అతిశయించిన) రుద్రుడు (పరమశివుడు) బాణాసురుని వాకిట్లోకి చేరవలసి వచ్చింది. చుల్లరి రాక్షసులమూకలు (పొగరుబట్టిన అసురులు) సురసురలాడె (చురచుర కాలిపోయారు) అంత ప్రతాపశాలివైన నీ దివ్య వాహనమే ఈనాడు మా కనువిందు చేస్తున్న గరుడుడు.

దేవా! నీవు గరుడునిపైనన్, పేరములు వార (వ్యాపించగా) భూలోకములో మేఘములు అమృతమును దేరె (వర్షించినవి). నిరతి (మిక్కిలి ఆ సక్తి గల) కంసాది దానవుల నెత్తురు యేరులైపారినది. పరులునిన్నెదిరించిన, వారి పగ నశించింది (అంటే వాళ్ళ చావుతో వారి పగ కూడ నశించినది అని అర్థం)

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు బంగారు గరుడనిపై వీధులేగ (వూరేగుతుంటే), చెంగట (అతిశయించు) సిరులు మూగె (ఐశ్వర్యములు బాగా పెరిగినవి). నీ సంగతి (సాహచర్యమున) మా తల్లి అలమేలుమంగ సంతసాన విఱవీగె (సంతోషంతో గర్వపడింది. పొంగారు (విజృంభించిన) దేవదుందుభులు పైపై వాగె (పెద్దపెద్దగా మ్రోగినవి).

## 6-26

## మున్నుడి

అహోబలంలో వెలసిన నవనారసింహులను (తొమ్మిదిమంది నృసింహులను) కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. మా జ్వాలా నృసింహుడు, యోగానందనృసింహుడు, కానుగుమాని నృసింహుడు, మట్టెమళ్ళ నృసింహుడు, భార్గోటి నృసింహుడు, ప్రహ్లాదనరసింహుడు, లక్ష్మీనరసింహుడు, వరాహనరసింహుడు, శ్రీనరసింహుడు, అను నవనారసింహులను కీర్తిస్తున్నారు. ఒక్కొక్కరి ప్రత్యేకతను కూడా ఉటంకిస్తున్నారాయన. స్వామికి తొమ్మిదేమిటి, పదివేల బహురూపములున్నవి అంటున్నారు. ఇక్కడ అహోబలంలోను, అక్కడ వేంకటాద్రి మీదనూ నీవే వున్నావంటున్నారు.

**కం॥ నవనారసింహ నమితం**
**భవనాశీ తటి నివాస! బలనరసింహా!**
**కవి అన్నమయ్య తలచెను**
**నవవిధ నరసింహుడవల నడచె తిరుమలన్.**

**రాగం : నాట**

నవనార సింహా నమో నమో
భవనాశితీర అహోబల నారసింహ ॥నవ॥

సతత ప్రతాప రౌద్ర జ్వాలా నారసింహ
వితత వీరసింహ విదారణా
అతిశయ కరణ యోగానంద నరసింహ
మతి శాంతపు కానుగుమాని నారసింహ ॥నవ॥

మరలి భీభత్సపు మట్టెమళ్ళ నారసింహ
నరహరి భార్గోటి నారసింహ
పరిపూర్ణ శృంగార ప్రహ్లాద నరసింహ
సిరుల అద్భుతపు లక్ష్మీనరాసింహ ॥నవ॥





వదన భయానకపు వరాహ నారసింహా
చెదరని వైభవాల శ్రీనరసింహా
అదన శ్రీవేంకటేశ అందు నిందు నిరవైతి
పది వేలు రూపముల బహునారసింహా ॥నవ॥

**భావామృతం :**

ఓ నవ నారసింహా! (తొమ్మిది విధములుగానున్న నారసింహా!) వందనములు. ప్రభూ! నీకు నమస్కారములు, భవనాశి నదీతీరమున అహోబలక్షబలక్షేత్రములో నెలకొన్న నృసింహ దేవా! నిన్ను శరణుజొచ్చితిని.

స్వామీ! జ్వాలానృసింహుని రూపంలోనున్న నీవు 'సతతప్రతాపరౌద్ర' మూర్తివి (ఎల్లపుడు కోపిష్టి అయిన ప్రతాపశాలివి). అంతేకాదు ఆయన 'వితత వీర విదారణ సింహము (వ్యాపించిన వీరత్వముతో వధించు సింగము). ఇకపోతే రెండవ స్వామి యోగానంద నృసింహుడు. ఈయన అతిశయించన కరుణామూర్తి, మూడవ వాడు 'కానుగమాని' నారసింహుడు. ఈయన అమితశాంతమూర్తి.

నాలుగవ నరసింహుని పేరు 'మట్టెమళ్ళ నృసింహుడు', ఈయన భీభత్సమూర్తి. మిక్కిలి వెఱపు కలిగించువాడు. ఇక ఐదవవాడు భార్గోటి నరసింహుడు. ఈయన నరహరి. మొండెము నరుని ఆకారముతోను, శిరస్సు కేసరి ఆకారముతోను వున్నవాడు. మనకు కనుపించు ఈ ఆరవ నృసింహుడు ప్రహ్లాద నరసింహుడు. ఈయన పరిపూర్ణ శృంగార మూర్తి. ఏడవ నృసింహుని పేరు లక్ష్మీనారసింహుడు, ఈ స్వామి అద్భుతమైన వైభములను ప్రసాదించు దేవదేవుడు.

అహోబలమున వెలసిన ఎనిమిదవ నృసింముడు వరాహనరసింముడు, ఆయన భయంకరమైన వదనము గల భీకరాకారుడు. ఆఖరివాడు శ్రీనరసింహుడు. ఈయన చెదరని వైభవాల స్వామి (చెడిపోని సంపదలు ప్రసాదించు నరసింహుడు). ఆదుకొనునట్టి ఓ శ్రీవేంకటేశ్వరా! అందునింద నీవే ఇరవైతివి. (అక్కడ తిరుమలలోను ఇక్కడ అహోబలంలోను నీవే సుస్థిరుడవైతివి). నీవు పదివేల (అసంఖ్యాకమైన) రూపములు గల బహునరసింహుడవు.

**6-27**

## మున్నుడి

'ఋణానుబంధరూపేణామ్, పశు, పత్ని,ర సుతాలయాః' అన్నారు పెద్దలు, ఋణం వుండటంవల్లనే బంధాలు కలుగుతాయి. అదే మాటను అన్నమాచార్యులవారు, అందరు అప్పులవాళ్ళే అంటున్నారు. " కప్పగన్ తిప్పగన్ కర్తలు వేరీ (వీరలా...) అంటున్నారు. కప్పగన్ అంటే కర్మఫలం కల్పించుకోవటం, తిప్పగన్ అంటే కర్మఫలం మార్చుకోవటం.... వీరి వలన అవుతుందా? వీరు కర్తలా? అంటున్నారు. ఈ బంధాలు యెప్పుడు వీడీ (విడిపోతాయి?) అవి విడిపోవటం వెన్నుడైన వేంకటేశ్వరునకే అది సాధ్యం అంటున్నారు.

**ఉ॥ అప్పులవారె యందరును అద్భుతతత్త్వము నెంచి చెప్పెరా**
**"కప్పగ దిప్పగన్" యెపుడు గర్తలు కారనె అన్నమార్యుడున్**
**ఎప్పుడు వాయు బంధములు యెన్నడు వీడును, కల్లయే యనెను**
**ఒప్పులు జేయగా మరియు యున్నతి సేయగ వెన్నుడే తగున్.**

**రాగం : కాంభోజి**

అప్పుల వారే అందరును
కప్పగ దిప్పగ గర్తలు వేరీ ॥అప్పుల॥

ఎక్కడ చూచిన నీ ప్రపంచమున
జిక్కులు సిలుగులు జింతలును
దిక్కెవ్వరు యీ తీదీపులలో
దిక్కుమొక్కులకు దేవుడెకాక ॥అప్పుల॥

యేది దలంచిన నేకాంబును
సూదులమూటల సుఖము లివి
కాదన నౌనన గడగనిపించగ
పోదికాడు తలపున గలడొకడే ॥అప్పుల॥





యెన్నడు వీడీ నెప్పుడు వాసీ
బన్నిన తమతమ బంధములు
వున్నతి సేయగ వొప్పులు నెరపగ
వెన్నుడు వేంకటవిభుడే కలడు ॥అప్పుల॥

**భావామృతం :**

ఓ మానవులారా! అందరునూ అప్పులవారే సుమా! ఋణం తీర్చుకోవటానికే జన్మిస్తారు. అదీ భగవధిచ్ఛానుసారం జరుగుతుంది. కర్మఫలం అనుభవించటమే జీవుడు చేయగలగింది. కప్పగన్ (కర్మఫలాన్ని కల్పించుటకు గాని), తిప్పగన్ (కర్మఫలాన్ని తారుమూరు చేయుటకు గాని), కర్తలు వేరీ (వీరు కర్తలా?) అది ఆ దేవుని వలన జరిగే పని, వీరి వలన అవుతుందా?

ఎప్పుడు చూచిననూ ఈ ప్రపంచంలో చిక్కులు (ఇబ్బందులూ), చిలుగు (కష్టములు), చింతలు (దుఃఖములు) కలుగుతూనే వుంటాయి. ఈ తీదీపులలో, (ఈతిబాధలలో) మనకు దిక్కెవ్వరు? (ఆదుకొనే నాధుడెవరు?) ఆ దేవుడుకాక (పరమాత్మ తప్ప) దిక్కుమొక్కు ఎవ్వరు అవుతారు?

ఏ కాలంబున (ఎప్పుడైనా) యేది తలంచిన సుఖము అనునవేవియైనా సూదుల మూటలు, ఆ మూటలు మోస్తుంటే చురుక్కుమని సూదులు గుచ్చుకోకుండా వుంటాయా? అందుకని ఈ మూట, మేం మొయ్యము అనటానికి కూడ వీటులేదు. కాదు, ఔను అనటానికి గాని కడకనిసించగ(ముగించుటకు)గాని వీలులేదు. ఈ వీలువున్న పోదికాడు (శూరుడు) మన తలపుననుండే దేవుడు ఒక్కడే, ఆయన వల్లనే అవుతుంది.

తమతమ బంధములు (తమంతట తాము కల్పించు కొన్న ఈ బంధములన్నియునూ) పన్నిన బంధములు (ఏర్పరచు కొన్న చుట్టరికములు). ఇవి యెన్నడు వీడీ (విడిపోతాయి?) ఎక్కడు వాసీ (వదలుతాయి?) ఎన్నటికీపోవు. అయితే దారి యేమిటి? కలడు అని శరణని, ఉన్నతి సేయగ (ఉన్నతమైన పనులును చేయుచూ) ఒప్పులు నెరపగ (మంచిపనులు చేస్తుంటే), అన్నీ ఆయనే చూసి వుద్ధరిస్తాడు.

**6-28**

## మున్నుడి

అన్నమాచార్యులవారి సుపుత్రుడు పెదతిరుమలాచార్యులవారు చెప్పిన కీర్తన నాస్వాదించండి. ఈ కీర్తనకి ప్రతి పదార్థం వివరించాలంటే తెలుగులో అందె వేసిన చేయి అయివుండక తప్పదు. "నామదారికాపు మొక్కు" నారయణ అంటే యేమిటి? ఇట్లాంటి చిక్కుటు చాలా వున్నాయి. ఈ కీర్తనలో అందుకే దీనినెన్నుకున్నాను."నన్ను నిన్ను నెంచుకోవో" అంటే "నన్ను నిన్నుగా పరిగణించుకో". నేనేనీవు నీవేనేను. అన్నీ నీ చేతనే జరుగుతాయి. ఓ నారయణుడా! అదివో (ఆ బ్రహ్మమే) నీవు, అంటున్నారు.

**కం॥ నను నిన్ను నెంచుకోవో**
**వినుమన్నియు నీదు చేత వెల్లడియగురా**
**అనె పెద తిరుమల హరికిన్**
**తను నారాయణుని పాడె తనివారంగన్.**

**రాగం : శహన**

నన్ను నిన్ను నెంచుకోవో నారాయణా
అన్నియు నీ చేతినే అదివో నారాయణా ॥నన్ను॥

నా మనసెఱుగవా నారాయణా నేడు
నాములాయె వయసులు నారాయణా
నామదారికపు మొక్కు నారాయణా
ఆముకొని నీ ప్రియములు నారాయణా ॥నన్ను॥

నగుతా నేనంటే నింతే నారాయణా
నగ రెఱిగిన పని నారాయణా
నగవులు మాకు జాలు నారాయణా
అగడు సేయకు మిక నప్పటి నారాయణా ॥నన్ను॥





ననలు నీ వినయాలు నారాయణా
నను పంటి మిదివో నారాయణా
ఘనుడ శ్రీవేంకటాద్రి గలసితివిట్టెనను
అనుమాన మెల్లా బాసెనందు నారాయణా ॥నన్ను॥

**భావామృతం :**

ఓ నారాయణుడా! నన్ను నిన్ను నెంచుకోవో (నన్ను నిన్నుగా పరిగణించవయ్యా!) నీవే నేను. నేనే నీవు. త్వమేవాహం అని భావిస్తాను. అన్నియూ నీ చేతిమీదుగానే జరుగుతాయి. అదివో (ఆ పరబ్రహ్మకూడా) నీవేనయ్యా!

ఓ నారాయణుడా! నా మనస్సేమిటో నీ వెఱుగవా తండ్రీ! ఇకపోతే నా వయసులు 'నాము' (పనికిరాని కొయ్యపై చిగురించు మొక్క) లైపోయాయి. అన్నీ నామదారికపు మొక్కు (పేరుకోసం మొక్కు కొన్న మొక్కులు) నీ ప్రియములు (నీకు నా మీద గల ప్రేమ) ఆముకొనె (నన్ను గర్వపడేట్లు చేస్తున్నది) ఇక నా అదృష్టమేమని చెప్పను? అంతయ నీకరుణ.

ఓ నారాయణుడా!నగుతానేనంటే (నవ్వుతూ చలోక్తిగా నేనేమైనా అంటే), అది నగరెఱిగిన పని (ప్రసిద్ధిని చెందిన పని). నగవులు మాకు జాలు (మాతో పరాచికములు ఇంకచాలు), అగడు సేయకుమీ నన్ను నిందల పాలుజేయవద్దు). అప్పటి నారాయణా (ఆది నారాయణుడా) నన్నుదయతలచుము ప్రభూ!

ఓ నారాయణుడా! నీ వినయములన్నియును ననలు (చిగురించుచున్నవి). ఇదిగో ఇదంతా ననుపు అంటిమి (ఇంపైనవి అని అంటిమి) నారాయణా! ఘనుడవైన ఓ వేంకటేశ్వరా! నన్ను నీ శ్రీవేంకటాద్రిమీద ఇట్టే కలిసితివి. అందుచేత నా అనుమానములన్నియునూ రూపుమాసినవి. ఓ నారాయణా నాకు ధన్యతచేకూరినది.

## 6-29

## మున్నుడి

సర్వేశ్వరుడైన పరమాత్మ తప్ప ఎఱగ నింకాఏమీ లేదు" అంటున్నారు అన్నమాచుర్యులవారు. రతికెక్కిన పనులన్నీ (అనుభవాన్ని కలిగించే పనులన్నీ) ఆ శ్రీ రామచంద్రుడే పో అంటున్నారు. ధనము, దైవము, తలిదండ్రులు, భార్యాపుత్రులు, దేహంలో వుండే జీవాత్మ, మోక్షదాత అన్నీ శ్రీవేంకటేశ్వరుని రూపంలో భాసిల్లుతున్న సర్వేశుడే అంటున్నారు. మోహమును కలిగించె వాడు కూడా ఆయనే కాబట్టి ఇక నమ్మగలిగిన దెవ్వరిని? ఆయనొక్కడ్నే కదా!

**మ॥ ఇతరంబేదియు లేదు నీ వొకడవే యెవ్వారు నీవే ప్రభూ!**
**రతికెక్కే పనులెల్ల రాఘవుడె పో రాజీవనేత్రుండె పో**
**మతిలో జేరెడి మాధవుండితడె పో మా తల్లియున్ దండ్రియున్**
**హితుడై చెప్పెను అన్నమయ్య వినుడీ ఈ జ్ఞానమే చాటు పో.**

**రాగం : దుర్గ**

ఇతర మేదియు లేదు యెఱగ మింతేకాని
రతికెక్కే పనులెల్లా రామచంద్రుడే పో ॥ఇతర॥

ధనమై చేరే వాడు దైవమై కాచేవాడు
మనసులో దలచేటి మాధవుడే
మునుకొన్న గ్రామములై ముందరనుండే వాడు
కొననాలుక మీదటి గోవిందుడే పో ॥ఇతర॥

తల్లియై పెంచేవాడు తండ్రియై పుట్టించేవాడు
వెల్లవిరి దాగొలిచే విష్ణుమూరితి
ఇల్లాలై సుఖమిచ్చి యెంచ బుత్రులైనవాడు
చెల్లుబడి దా మొక్కేటి చేతిపై శ్రీహరియే ॥ఇతర॥





దేహమై వుండేటివాడు దినభోగమైనవాడు
యీహల శ్రీవేంకటేశు డితడొక్కడే
మోహాచారమైన వాడు మోక్షమైనిలిచేవాడు
సాహసించి నమ్మగల సర్వేశుడితడే ॥ఇతర॥

**భావామృతం :**

ఓ ప్రజలారా! ఇతర మేదియును లేదు. ఇంతేకాని (ఇది తప్పించి) యెఱగము (తెలియనే తెలియము). ఈ ప్రపంచంలో రతికెక్కిన పనులెల్లా (అనుభవాన్ని కలుగజేయు పనులన్నియునూ) ఆ శ్రీరామచంద్రుడే సుమా!

ప్రజలవద్ద ధనము రూపంలో చేరి ఎన్నో అనుభవాలనిస్తున్నదెవరు? ఆయనే సుమా! దైవం రూపంలో అనుక్షణం మనని కాపాడుతున్నదీ ఆయనే. మాధవుని రూపంలో మనం మనసులో ధ్యానించేదీ ఆయన్నే. అదే విధంగా మునుకొన్న (అతిశయించిన) గ్రామములై (వునికిగలవాడై) మన ముందర ఉన్నది కూడా ఆయనే. మన నాలుక చివర గోవిందుని రూపంలో వుంటాడు. అందుచేతనే మనం గోవిందా! అనగలుగుతున్నాం.

మనని కడుపున భరించి పెంచే తల్లి ఎవరు? ఆ దేవుడే. తండ్రియై మనని పుట్టించేవాడూ ఆయనే, అందుకనే మనం వెల్లివిరై (అతిశయించి) ఆ విష్ణుమూర్తిని ఆరాధిస్తాము. అవన్నీ అటుంచి మానవులకు ఇల్లాలు (భార్య) రూపంలో సుఖమునిస్తున్నది కూడా ఆయనే. పుత్రుల రూపంలో వుద్ధరించే వాడూ ఆ దేవదేవుడే. ఈ విధంగా మనతో నిత్యమూ వుండేది మనం నమస్కరించు చేతిపై శ్రీహరి వలె చెల్లుబడి అయ్యే వాడూ ఈ స్వామియే.

దేహము రూపంలో వున్నవాడూ ఆయనే. దినభోగమైన వాడూ (దినదినము మనం పొందే భోగము) ఆయనే. ఈ భూమిపై శ్రీవేంకటేశ్వరుని రూపంలో వున్నదీ ఇతడొక్కడే. మానవులకు మోహాచారమును (వ్యామోహమును) కల్పించుచున్నది ఆయనే. చివరికి వైరాగ్యమును కల్పించి ముక్తినిప్రసాదించుచున్నది కూడా ఆయనే. అంత్యకాలమున "అన్యధాశరణం నాస్తి త్వమేవ శరణం మమ" అని నమ్మదగిన సర్వేశుడూ ఇతడే..కదా!

## 6-30

## మున్నుడి

గీర్వాణిలో అహోబలనారసింహుని స్తుతిస్తున్నారు అన్నమాచార్యులవారి సుపుత్రుడు తాళ్ళపాక పెదతిరుమలచార్యులవారు “ఓ మానవ సింహమా! నీకు వందనములర్పించుచున్నాను. అహోబలమున ప్రమదను (భార్యను) అంకమున (తొడపైన) వుంచుకొని భక్తులను ఆశీర్వదించుచున్న నరసింహా! నీకు నమస్కారములు” అంటున్నారు. ‘భూనభాంతరములు’ (భూమి, ఆకాశం, వాటి మధ్యప్రదేశం) పూరిత (ఏ మాత్రంసందు లేకుండా నిండిపోయిన) నరసింహా! ప్రణతులు” అంటున్నారు

**తే॥ తరుణి నంకపీఠిక మీద దాల్చువాని**
**ధర నహోక్షబలంబున నిల్చు నారసింహు**
**తను ‘నమామ్మహం’ యని సంస్కృతమున పాడి**
**అన్నమార్యుని పుత్రుడు సన్నుతించె.**

**రాగం: కేదారాగౌర**

నమామ్యహం మానవసింహం
ప్రమదాంక మహోబల నరసింహం ॥నమామ్యాహం॥

దానవ దైత్య విదారణ సింహం
నానాయుధకర నరసింహం
భూనభోంతరాళ పూరిత సింహం
ఆనన వహ్ని లయాంతక సింహం ॥నామామ్యహం॥

ప్రళయనృసింహం బహుముఖ సింహం
సలలిత గరుడాచల సింహం
కులిశనఖర ముఖ ఘోషిత సింహం
తిలకిత బహు రవిదీపిత సింహం ॥నామాన్యహం॥





శాంత నృసింహం శౌర్య నృసింహం
సంతత కరుణా జయ సింహం
కాంతం శ్రీ వేంకటేగిరి సింహం
చింతిత ఘన సంసిద్ధి నృసింహం ॥నమామ్యహం॥

**భావామృతం :**

ఓ మానవ సింహమా! (నరసింహా!) నీకు నేను నమస్కరించుచున్నాను. ఓ అహోబలనారసింహా! ప్రమదను (శ్రీ లక్ష్మిని) అంకమున (తొడపైన) వుంచుకొనిన నరసింహా! నీకు వందనములు

ఈ అహోబల నృసింహుడు దానవులను మరియు దైత్యులను తుదముట్టించిన సింహము. అనేక విధములైన ఆయుధములను తన హస్తముల ధరించిన వాడు ఈ నరసింహుడు. భూమి ఆకాశమే కాక, వాటి మధ్య ప్రదేశము కూడా కిక్కిరిసి నిండిపోయిన వాడీ నరసింహుడు. తన ముఖమునుండి అగ్నిజ్వాలలను వెదజల్లుచూ లయమును సృష్టించుచున్నాడీ నృసింహుడు.

ఈ నరసింహుడు ప్రళయమును సృష్టించు భయంకరుడు. గరుడాచల క్షేత్రమున అందముగా నెలకొనిన సింహమీతడే. ఈ స్వామి “కులిశనఖర ముఖ ఘోషిత సింహం” (వజ్రాయుధము వంటి గోళ్ళు, కోరలున్న నోరుగల సింహము) నృసింహుడీయన.

నవ నారసింహులు వెలసిన ఈ అహోబలక్షేత్రమున ఈ స్వామి శాంతనృసింహుడు. అంతే కాదు గొప్ప శౌర్యవంతుడు. ఎల్లప్పుడూ కరుణామయుడు. ఈ స్వామి అనేక విజయములను ప్రసాదించువాడు. వేంకటగిరి మీద వెలసిన శ్రీకాంతడయిన శ్రీవేంకటేశ్వరుడు కూడా ఈ సింహమే. ఈ నృసింహుడు కోరుకున్న గొప్ప వరములను సిద్ధింప జేయగల దేవదేవుడు.

6-31

## మున్నుడి

ఈకీర్తన అన్నమాచార్యులవారు బహుశా తన యవ్వనంలో చెప్పివుంటారని నాకు అనిపిస్తుంది. సవతుల తగదాలు, తెలివిగల భర్తపరిష్కారాలు, జవరాలి అలుకలు, ఆవిడ భర్త బుజ్జగింపులు ఇవన్నీ ఆచార్యులవారి స్వానుభవాలా? యేమి? అని పిస్తుంది. విడువతగని ప్రియురాల బలములు చూపితేను నాయాలబెట్టెడి వాడు నాధుడావాడు? అంటున్నారు. ఇదేమిటో తెలియాలంటే...భావామృతమే చదవాలి.

**చం॥వలచిన  యాడువారి కడు వాదులు మానని వాడు జాణడా?**
**పలుకక భర్తతో సవతి మాటలు మానిన నవ్వుకోవలెన్**
**తెలియుము కోపులింతులని తేల్చేను పాడుచు అన్నమార్యుడున్**
**అలుగక శయ్య జేరవలె ఆ తృత జూపుచు వేంకటేశ్వరా!**

**రాగం : పాడి**

ఆడువారు కడుగోపులవుట నీ వెరగవా
నేడు గొత్తయిగా భూమి నేర్పుక వచ్చేరా ॥ఆడువారు॥

వలచిన యాడువారు వాదులాటకు వచ్చిన
చలము సాధించువాడు జాణడా వాడు
కలయని కాకతోడ కమ్మటి నలిగి పోగా
పిలిచి మాటాడకున్న ప్రియుడా వాడు ॥ఆడువారు॥

చనువుగలుగువారు సణగుల దిట్టగాను
కనలి యెగ్గు వట్టితే ఘనడా వాడు
గునిసి సవతులపై కోపాన పతి నంటేను
విని నవ్వకుండేవాడు విభుడావాడు ॥ఆడువారు॥





పాయరాని యట్టి వారు బలములు చూపితేను
నాయాల బెట్టెడివాడు నాధుడా వాడు
యీ యెడ శ్రీవేంకటేశ యింతినిట్టే గూడితివి
చయకు రాకుండువాడు సరసుడావాడు ॥ఆడువారు॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు కూడా ఇద్దరు భామల ముద్దుల మొగనివే కదా! నీకు ఆడువారు మిక్కిలి కోపదారి వారని తెలియదా? నేడు కొత్తగా భూమిపై నేర్చుక వచ్చేరా?

వలచిన స్త్రీలు వాదులాటకు వచ్చినచో, చలము సాధించువాడు (పంతము పట్టి సాధించు వాడు) జాణడా? (తెలివితేటలు వున్నవాడేనా?) కలయని కాకతోటి (సంధికి రాని వుడుకుమోతుతనంతో), కమ్మటి (సుందరి) బాగానలిగిపోతే, పిలిచి మాటాడకున్న (రాజీకివచ్చి మాటలు కలపని వాడు) ప్రియుడా? (ప్రేమికుడా) ఏ నాటికీ కాదు ప్రభూ!

భర్త వద్ద చనువు గల భార్యలు సణుగుతూ నిందించినచో కనలి (మండిపడి) నేరారోపణ చేసేవాడు యేమి గోప్పవాడు? గునిసి (కులుకు చూపి) సపతులపై కోపము మొగనిపై చూపితే విని నవ్వుకోవాలి గాని, పట్టించు కొనేవాడు ఎట్లాంటి మొగుడండీవాడు?

పాయరానియట్టి వారు (విడువరాని ప్రియురాండ్రు) బలములు చూపితే (తమ పట్టుదల చూపితే), నాయాలబెట్టెడివాడు (న్యాయస్థానంలో వారిని నిలబెట్టేవాడా) నాథుడా! (పతియేనా?) ఓ శ్రీవేంకటేశ్వరా! ఇప్పుడు నీవు నీ భామను ఇట్టే కూడితివి. చయకు రాకుండువాడు (బుజ్జగించి శయ్యపై చేరనివాడు) సరసుడా? ఎన్నడూ కాదు..వాడు విరసుడే ప్రభూ!

## 6-32

## మున్నుడి

అన్నమాచార్యులవారు ఈ అద్భుతమైన కీర్తనలో ప్రత్యక్షరూపుడైన పరమాత్మునికి మనం చేయవలసిన నిత్యపూజలేమిటో చెబుతున్నరు. గుడి, ఆలయశిఖరం, హరిపీఠము, దీపారాధన, మంత్రములు, ఘంట, నైవేద్యము వంటివి బహిఃపూజకే గాని మానసిక పూజకి ఇవన్నీ అక్కర లేదు అంటున్నారు. జీవాత్ముడే హరికి దాసుడైనప్పుడు శ్రీవేంకటేశుడు పరమాత్మకావున ఈ పూజ నెంతో ప్రీతితో స్వీకరిస్తాడు. సందేహమెందుకు?

**ఆ.వె॥ నిత్యపూజలివియె నేరిచినన్ అహో!**
**కనుల యెదుట దోచు ఘన విభునికి**
**పరవశించి పాడె పరమాత్మ కీరితి**
**విబుధుడన్నమయ్య వేంకటేశ!**

**రాగం : ఖరహరప్రియ**

నిత్యాజాలివివో నేరిచిన నోహో
ప్రత్యక్షమైనట్టి పరమాత్మునికి ॥నిత్య॥

తనువే గుడియట తలయే శిఖరమట
పెను హృదయమే హరి పీఠమట
కనుగొన చూపులె ఘనదీపములట
తన లోపలి అంతర్యామికిని ॥నిత్య॥

పలుకే మంత్రమట పాదైన నాలికే
కలకలమను పిడిఘంటయట
నలువైన రుచులే నైవేద్యములట
తలపు లోపల నున్న దైవమునకు ॥నిత్య॥





గమన చేష్టలే అంగరంగ గతియట
తమిగల జీవుడే దాసుడట
అమరిన వూర్పులే ఆలవట్టములట
క్రమముతో శ్రీవేంకటరాయనికి ॥నిత్య॥

**భావామృతం :**

ఈ తిరుమలలో ప్రత్యక్షదైవం అయిన పరమాత్మ ఆ శ్రీవేంకటేశ్వరుడు. ఆయనకు మేము చేసే నిత్యపూజలేవియో నేరిచిన (తెలిసికొనిన) ఓహో! ఏమి ఆనందం కలుగుతునిది!!

ఆ స్వామి, నిజ భక్తులయొక్క తనువే (దేహమే) ఆయనకు గుడి (ఆలయము) అట. వారి శిరస్సు ఆయన ఆలయ శిఖరం అట. ఆయన భక్తుల హృదయమే స్వామికి హరిపీఠమట. ఆ దేవదేవుని చూపులు దివ్యజ్యోతులై గుడిదీపములవలె ప్రకాశించుచున్నవి. ప్రతియొక భక్తుని అంతరాత్మునిగా భాసిల్లుతున్న ఆ స్వామికి విడిగా ఆలయమూ పూజలూ కావలెనా? అక్కరలేదు.

శ్రీహరియొక్క నిజ భక్తుల మృదువైన పలుకులే ఆయనకు వారు చదివే మంత్రములు. పాదైన నాలుకే (స్థిరవచనము పలుకు నాలుక) భక్తితో గలగలమని రవళించు ఘంటానాదము. ఆ నాలుక అనుభవించు, నలువైన (చక్కనైన) రుచులు ఆ స్వామికర్పించు నైవేద్యములు. మన తలపులలో (భావనలలో) వున్న ఆ దైవమునకు (పరమాత్మునికి) సచ్ఛీలుర సంభాషణలంటే అంత ప్రీతి. పరుష వచనములను ఆయన తిరస్కరిస్తాడు. ఇది సత్యం.

"గమన చేష్టలే అంగరంగ గతియట" (జీవుడు చేసికొన్న చేష్టలె. వాడు పొందబోయే అంగరంగవైభవములకు ప్రాతిపదిక) తమి (ఆసకి) గల జీవాత్మయే ఆ శ్రీహరికి ప్రియమైన దాసుడట. ఆయన భక్తుడైన ఆ జీవుని వూర్పులే (ఉచ్ఛ్వాస నిస్వాసములే) ఆయనకు వారు లిసరు ఆలవట్టములు (వింజామరులు). ఈ క్రమములో (వరుసలో) ఆ శ్రీవేంకటేశ్వరునికి నిత్యపూజలు ఇవిగో ఇలా జరుగుతూనే వున్నాయి.

.6-33

## మున్నుడి

సాంఘిక దురాచారాలను అన్నమాచార్యులవారు ఎన్నో కీర్తనలలో తెగనాడారు. కులము మతము మొదలైనవన్నీ మానవ కల్పితాలు. పరమాత్మనుంచి జన్మించిన జీవికి కులమేమిటి? తాను పరమాత్ముడైన శ్రీహరినుంచి వచ్చానని గ్రహించి తక్కిన వారందరుకూడ దైవస్వరూపులని గ్రహించినవాడు ఏ కులజుడైతేనేమి ఎవ్వరైతేనేమి అంటున్నారు. ఇంతకంటే జ్ఞానం ఇంకేముంటుంది చెప్పండి. ఆత్మనియతి అంటే ఆత్మనిగ్రహం కావాలి. విద్యుక్త కర్మమార్గములనతిక్రమించనివాడికి కులంతో పనేమిటి?

**కం॥ ఏ కులజుడైన నేమిటి?**
**ఆకడ హరినెరుగు వాడు అతడె ఘనుడౌ**
**మాకందించెను జ్ఞానము**
**చేకొని యిటు అన్నమయ్య చెప్పెను సూక్తిన్**

**రాగం : భూపాలం**

ఏ కులజుడేమి యెవ్వడైననేమి
ఆకడ నాతడె హరినెరిగిన వాడు ॥ఏ కులజు॥

పరగిన సత్యసంపన్నుడైన వాడే
పరనింద సేయ తత్పరుడు కానివాడు
అరుదైన భూతదయానిధియగు వాడే
పరులు తానేయని భావించువాడు ॥ఏ కులజు॥

నిర్మలుడై యాత్మ నియతి గలుగువాడే
ధర్మతత్పర బుద్ధి తగిలినవాడు
కర్మమార్గములు కడవనివాడే
మర్మమై హరిభక్తి మఱవని వాడు ॥ఏ కులజు॥





జగతిపై హితముగా చరియించువాడే
పగలేక మదిలోన బ్రదికినవాడు
తెగి సకలము నాత్మ తెలిసినవాడే
తగిలి వెంకటేశు దాసుడయిన వాడు ॥ఏ కులజు॥

**భావామృతం :**

ఓ మానవులారా! చివరికి హరియే ఆధారమని, గమ్యమని యెఱిగిన జ్ఞాని, ఏ కులము వాడయితే నేమిటి? ఎవ్వడైతే నేమిటి? అతనే సర్వోత్తముడు. సందేహం లేదు.

పరగిన (దీక్షతో) సత్యము పలుకుటయే నిష్ఠగా కలవాడూ, పరులను దూషించుటయందు ఆసక్తి లేనివాడూ, ఎంతో భూతదయగలవాడు ఇతరులుకూడ తనవంటి వారేయని భావించే వాడు సర్వశ్రేష్ఠుడు. వాడికి కులమేమిటి? ఏ కులమైనా ఒక్కటే.

నిర్మల హృదయుడై ఆత్మనిగ్రహం కలిగియున్నవాడునూ, ఏది ధర్మమో ఏదధర్మమో విశ్లేషించి ధర్మమార్గాన్నే అవలంభించువాడునూ, విద్యుక్త కర్మమార్గమును అతిక్రమించనివాడు హరిభక్తియొక్క ఔచిత్యం యెఱిగినందుచేత దానిమర్మం తెలిసినవాడై యెన్నడూ హరిభక్తి వీడనివాడు ఏ కులంవాడయితేనేమి, వాడి పుట్టుక యెటువంటిదయితేనేమి?

జగతిపై (ఈ భూమిమీద) పరహితైభిలాషియై చరించేవాడు (నడచుకొనేవాడు), మనస్సులోకూడా పగద్వేషములేనివాడు, సర్వమూ ఆత్మజ్ఞానం ద్వారా నేర్చినవాడునూ, తగిలి (ప్రీతితో) శ్రీవేంకటేశ్వరునికి దాసుడైనవాడు ఎవ్వరైతే నేమి? యే కులము వాడయితే నేమిటి చెప్పండి.

**6-34**

## మున్నుడి

చక్కటి వైరాగ్య చింతన ప్రభోదిస్తున్నారు అన్నమాచార్యులవారు. సంశయాత్మకమైనదేదైనా అవుతుంది లేక అవదు అనే రెండు స్థితులలో ఉంటుంది. కళ్లు రెండూ తెరిస్తే జ్ఞాని. రెండూ మూస్తే అజ్ఞాని. ఒక్కటే కన్ను తెరిస్తే ఇంకొక కన్ను మూసినట్లే కదా! ఇది తెలుసుకోవటానికి ఇన్ని చదవవలెనా? ఇంత వెదక వలెనా? అంటున్నారు. మనం ప్రపంచం అని పిలిచే ఈ ఇహము ఒక్కటే, మరణించాక అనుభవించే పరము కూడా ఒక్కటే. ఈ రెండింటికి గురి (లక్ష్యం) ఎవరు? జీవుడు. ఈ రెంటికీ కర్త ఎవరు? శ్రీవేంకటేశ్వరుడు.

**ఆ.వె॥ ఇన్ని చదువనేల? యింతా వెదకనేల?**
**కన్ను తెఱువ నొకటి కన్నుమూత**
**అన్నమయ్య పాట ఉన్నతంబగు బాట**
**హరి శరణము నరయ వరము పరము**

**రాగం : వకుళాభరణం**

ఇన్నియు చదువనేల ఇంత వెదకనేల
కన్ను దెరచు టొకటి కనుమూయటొక్కటే ॥ఇన్నియు॥

వలెననేదొకమాట వలదనేదొకమాట
సిలుగులీరెంటికిని చిత్తమే గురి
వలెనంటే బంధము వలదంటే మోక్షము
తెలిసే విజ్ఞానులకు తెరువిది ఒక్కటే ॥ఇన్నియు॥

పుట్టెడిదొకటే పోయెడిదొకటే
తిట్టమై ఈ రెంటికిని దేహమే గురి
పుట్టుట సంశయము పోవుట నిశ్చయము
వొట్టిన విజ్ఞానులకు నుపమిది యొకటే ॥ఇన్నియు॥





పరమనే దొక్కటే ప్రపంచమొక్కటే
సిరులనీ రెంటికిని జీవుడే గురి
యిరవై శ్రీ వేంకటేశు డిహపరముల కర్త
శరణాగతులకెల్ల సతమీతడొకడే ॥ఇన్నియు॥

**భావామృతం :**

ఓ మానవులారా! ఇన్ని చదువుట దేనికి? ఇంతగా అన్వేషించుట దేనికి? ఇంత చిన్న విషయం మీకు తెలియుట లేదా? ఒక కన్ను తెరచుట అంటే ఒక కన్ను మూసినట్లే కదా!

మానవుడి చిత్తవృత్తి వలననే కొన్ని కావాలి అనుకొంటాడు. కొన్ని వద్దు అనుకొంటాడు. ఈ రెండు రకములైన సిలుగులు (అవస్థలకు) గుఱి (లక్ష్యం) ఒక్కటే. మన చిత్తమే దానికి గుఱి. ఏది అయినా కావాలి అనుకొంటే అది బంధమవుతుంది. వద్దు అనుకొంటే అదే మోక్షం. అంటే ఈ విషయం తెలిసిన విజ్ఞానులకు ఈ వైరాగ్యమే మోక్షమునకు దారి అవుతుంది. (అంటే వైరాగ్యం రాని వానికి ముక్తి అసాధ్యం అని తేలికగా అర్థం అయింది కదా!)

మానవులారా! పుట్టుక దేనికి జరిగింది? ఈ దేహానికి పోవటం (నశించటం) దేనికి జరుగుతుంది? అదీ దేహానికే జరుగుతుంది. తిట్టమై (స్థిరముగా) ఈ రెండిటికీ దేహమే కదా! లక్ష్యము? ఆలోచించి చూడండి, పుట్టుక సందేహాస్పదమే. ఎవరి కెప్పుడు పుట్టామో ఇంకొకరు చెప్తేనే కదా! మనకు తెలిసింది. కాని చచ్చి పోవుట మాత్రం నిశ్చయంగా జరుగబోయేదే. ఒట్టిన విజ్ఞానులకు (జ్ఞాన జ్యోతి స్వరూపులకు) యే పోలికయినా ఒక్కటే. (అనగా వారికి చావు పుట్టుకలు రెంటికీ తేడా వుండదు).

ఇహము అని పిలువబడే ఈ ప్రపంచమును, పరము అని పిలువబడె పరలోకములను అనుభవించు వాడెవడు? వాడినే జీవుడు అంటున్నాం. కనుక, ఈ ఇహపరాలు రెంటికీ గురి యెవరు? జీవుడే కదా! కానివాడు అస్వతంత్రుడు. వాడి పని వాటిని అనుభవించటం మాత్రమే. మరి ఇహ పరములు రెండిటికీ కర్త యెవరు? ఇంకెవరు ఇరవైన (ఆధారభూతుడైన) శ్రీవేంకటేశ్వరుడే. మన శరణాగతికి సతమైన (శాశ్వతమైన) ఆయన ఒక్కడే ఉన్నాడు.

**6-35**

## మున్నుడి

రమ్యమైన శరణాగతిని ఆలపిస్తున్నారు మన అన్నమాచార్యులవారు. పల్లవి యధాతథంగా ఆటవెలది చరణాల్లో ఇమిడిపోయిందంటే... ఆచార్యులవారు ఎంత లాక్షణికమైన కవిత చెబుతున్నారో గమనించండి. నన్ను కనిపెట్టి రక్షిస్తున్న ఆతనికి శరణు జొచ్చాను. ఇహలోకంలో ఈప్సితాలనిస్తూ పరలోకంలో మోక్షం ఇచ్చే పతికి (నాథునికి) శరణు అంటున్నారు. వేంకటాద్రిమీద నెలకొని దీనులను రక్షిస్తున్న శ్రీహరికి శరణు అంటున్నారు.

**ఆ.వె॥ అరసి నన్ను గాచినాతనికి శరణు**
**పరము నిహము నేలు పతికి శరణు**
**పూని వేంకటాద్రి దీనులగాచేటి**
**హరిని శరణువేడె నన్నమయ్య**

**రాగం : దేశ్**

అరసినన్ను గాచి నాతని శరణు
పరము నిహము నేలే పతికిని శరణు ॥అరసి॥

వేదములు దెచ్చినట్టి విభునికి శరణు
ఆదిమూలమంటే వచ్చి నతనికి శరణు
యేదెసా తానైయున్న యీతనికి శరణు
శ్రీదేవిమగడైన శ్రీపతికి శరణు ॥అరసి॥

అందరికి ప్రాణమైన ఆతనికి శరణు
ముందు మూడు మూర్తుల మూర్తికి శరణు
దిందుపడి దేవతల దేవునికి శరణు
అంది మిన్ను నేలనేకమైనతనికి శరణు ॥అరసి॥





తానే చైతన్యమైన దైవానకు శరణు
నానా బ్రహ్మాండాల నాథునికి శరణు
ఆనక శ్రీవేంకటాద్రి యందునుండి వరములు
దీనుల కిందరి కిచ్చే దేవునికి శరణు ॥అరసి॥

**భావామృతం :**

"అరసి నన్నుగాచి నాతనికి శరణు" అనగా నన్ను ఏమరక ఒక కంట కనిపెట్టి రక్షించుచున్న ఆ దేవదేవనికి శరణు నర్థించుచున్నాను. ఈ లోకములను పరలోకములను పరిపాలించుచున్న జగన్నాథునికి శరణు వేదెదను.

సోమకుని జంపి వేదములను రక్షించి తెచ్చినట్టి శ్రీపతికి శరణు. దేనికేది మూలమో అనుకుంటూ పోతే చివరికి ఆదిమూలమైన యతనికి శరణు. ఏ దిక్కున చూచినా తానే యున్నవానికి శరణు. శ్రీలక్ష్మికి వల్లభుడైన శ్రీహరిని శరణు వేడుచున్నాను.

ప్రతి జీవికీ ప్రాణమైన మహానుభావుని శరణుజొచ్చుచున్నాను. "ముందు మూడు మూర్తులు" అనగా బ్రహ్మవలె సృష్టిని, విష్ణువువలె సంరక్షణను, రుద్రునివలె లయమును నిర్వహించు చున్న త్రిమూర్తులు అని అర్థం. ఆ త్రిమూర్తులకు ఆదిమూర్తి అయిన దేవదేవునికి శరణు నర్థించెదను. దిందుపడి (అతిశయించి) దేవతలందరికీ దేవుడైన స్వామిని శరణు గోరుచున్నాను. త్రివిక్రముని వలె ఏ మాత్రమూ సందు లేకుండా నింగి నేలా ఆక్రమించిన విరాట్పురుషుని శరణుజొచ్చి అర్థించుచున్నాను.

తానే చైతన్య స్వరూపునిగానున్న విశ్వచైతన్యమూర్తిని శరణు వేడుచున్నాను. ఈ విశ్వంలో ప్రభవిల్లుచున్న అనేక బ్రహ్మాండములున్నవి. వాటి అధినాథునికి శరణుజొచ్చెదను. ఈ విశ్వరచనా కార్యక్రమము ఇట్లుండగా, తరువాత శ్రీ వేంకటాద్రిపై నెలకొని తనను శరణుజొచ్చిన దీనులకు అనేకములైన కోర్కెలు దీర్చుచున్న శ్రీవేంకటేశ్వరుని శరణు నర్థించుచున్నాను.

**6-36**

## మున్నుడి

తిరుపతిలో వెలసిన కోదండరామస్వామి మీద మధురమైన కీర్తన వినిపిస్తున్నారు. అన్నమాచార్యులవారు. ఈకీర్తనలో సీతమ్మ రామచంద్రునితో గొప్పగొప్ప 'సవాళ్ళను' విసురుతున్నది. రసికుడవైన ఓ తిరుపతి రఘువీరా!(కోదండరామా!) నేను వేసే సవాళ్ళు కొసరుగాదయ్యా! (నిన్నుకొంచెము చేయుట నా వుద్దేశ్యం కాదు.) నాకు నీపై వున్న కూరిమే (ప్రేమే) నన్ను అలా చేయిస్తోంది. రాముడే కదా! సీత బహిః ప్రాణం? అది సరే, ఇకజవాబు చెప్పు స్వామీ! నా ప్రశ్నలంటే వేంకటేశ్వరునిగా కనకమహాలక్ష్మిని కూడుట కాదయ్యా!

**చం॥ తిరుపతి రాఘవా! రసిక! దివ్యప్రభావమునెంచ శక్యమా**
**స్థిరమగు కూరిమిన్ కొసరుచేయకుమా, యనె సీత తానయెన్**
**వరదుడు అన్నమార్యుడును పాడెను కీర్తన మద్భుతంబుగా**
**మురియుచు నాదు బోంట్లు విని మొక్కెద రెల్లెడ వేంకటేశ్వరా!**

**రాగం : రామక్రియ**

రసికుడ తిరుపతి రఘువీరా
కోసరుగాదు నాలోని కూరిమిలుగాని ॥రసికుడ॥

వెలయ నీ విరిచిన విల్లు వంటిది గాదు
విలసిల్లు నా బొమ్మల విండ్లు గాని
చెలగి తపసు చేసే చిత్రకూటగిరిగాదు
గిలుకొట్టు నా కుచగిరులు గాని ॥రసికుడ॥

మేటియై నీవు వేసిన మెకము చూపుగాదు
సూటిదప్పని నా కనుచూపులు గాని
గాటమై నీవు సేతువు గట్టిన జలధిగాదు
చాటున నా చెమటల జలధులుగాని ॥రసికుడ॥





తగ నీవు గెలిచిన దనుజ యుద్ధము గాదు
దగతోడి నా మదన యుద్ధముగాని
నగు శ్రీవేంకటేశ కనకసతి పొందుగాదు
పొగడే సీతనైన నా పొందులు గాని ॥రసికుడ॥

**భావామృతం :**

తిరుపతిలో వెలసిన ఓ రఘువీరా! (కోదండరామా!) నీవు గోప్ప రసికుడవు స్వామీ! నాలోవున్న నీపై కూరిమి (ప్రేమ) ఏ మాత్రం కొసరుగదయ్యా! (నిన్ను కొంచెయుచేయుటకాదు. కాని నేను చెప్పేది నిజమే.

ఇదిగో విల్లులా వంగివున్న నా కన్నుబొమ్మలను చూశావా? ఇవి నీవు ఆ నాడు మిథిలలో విఱిచిన శివధనస్సువంటివిగావు. ఇదిగో నా ఈ కుచగిరులను గమనించితివా? ఇవి నీవానాడు చిత్రకూటపర్వతము మీద చెలగి (దీక్షగా) తపమునాచరించితివే... అట్లు కాదు. ఈ కుచగిరులను సాధించుట ఇంకా కష్టం ప్రభూ!

ఓ రామచంద్రా! వాడిగా (సునిసితంగా) వుండే నా క్రీగంటి చూపును చూశావా? ఇవి ఆ నాడు నీవు మారీచుడు బంగారు లేడియై వచ్చినప్పుడు ఆ మృగము చూసిన చూపులు గావు. ఇవి ఇంకావాడి అయినవి. ఇదిగో చాటున (వెలువడుచున్న) నా చెమటల జలధులను చూచితివా? ఇది నీ వానాడు సేతువును నిర్మించిన నూరు యోజముల సాగరము కాదు. ఇంకా అధికమైన నీరధి ఇది.

ప్రభూ! నీవు అవలీలగా ఖర దూషణాది రాక్షసులను గెలిచావు. కాని నా తోటి మదన సంగరం అంత తేలికైనది కాదు. అది దగతోడిది (బడలిక కలుగజేయునది) సీతనైన నాతో పొందు, ఆ నవ్వుల వేంకటరమణుని దేవేరియైన కనక సతి (కనకమహాలక్ష్మి) పొందుగాదయ్యా! నా పొందు ఇంకా అపురూపమైనది.

**6-37**

## మున్నడి

అన్నమాచార్యులవారు చక్కటి జ్ఞానబోధన చేస్తున్నారు. విని తరించండి. ఓ మనసా! పారకుమీ (పిఱికి వలె పారిపోకు). పంతము విడువకుమీ (నీ పట్టుదలను వదలకుము- అని వుద్బోధిస్తున్నారు. ఒక వేళ అన్నమయ్య చెప్పినట్లు చేయకపోతే ఏమవుతుంది? ఓ మనసా! పారిపోతే నీవే బడుగు అయ్యెదవు. అట్లుగాక నీ లక్ష్యాన్ని చేరువ అయ్యేవా... ఆ నాడే నీకు విశిష్టత లభిస్తుంది. శివునివైరి అయిన మన్మథునికి చిక్కితివా కంతువారెదవు (చెడిపోతావు). అట్లు కావలదు. వెన్నుడైన శ్రీవేంకటపతినే ధ్యానించుము. వేసరకుము (బాధపడవద్దు) అంటున్నారు

ఉ॥ **పారకు చిత్తమా! యిటుల పంతము వీడకు మీయనెన్ భళా!!**
**పారిన నీవెహీనమయి బానిస చేరువనాడె యౌదువే**
**మీరిన శంభువైరి 'మది' మించునశాంతిని మండ జేయునే**
**చేరుము వేంకటేశ్వరుని చెప్పెను దీటుగ అన్నమార్యుడున్.**

## రాగం : దేశ్

పారకుమీవో మనసా పంతము విడువకు మీ మనసా
పారిన నీవే బడుగయ్యెదవు చేరువనాడే చెప్పనె మనసా ॥పారకుమీ॥

చింతించకు మీ శివునివైరి చిక్కువడకుమీవో మనసా
కంతువారకుము వయసు బ్రాయములు కావటికుండలు వోమనసా
యెంటేమేలు గీడే కాలము ఎప్పుడునుండదు వోమనసా
సంతరించుకో వానిని మనసున సంతోషముగా వో మనసా ॥పారకుమీ॥

యెన్నికలే తలపోయకుమీ యేమరకుండుమీ వో మనసా
కన్న విన్నవారిలో నెప్పుడు కాకుపడకుమీ వో మనసా
పున్నమ మాసాలు పుడమిలో బదుకులు పోయి వచ్చేవి వో మనసా
మిన్నో నేలని వున్న దినములో మీదు చూడకుమి వో మనసా ॥పారకుమీ॥





కన్నుల సంగాతము సేయకుమీ కళవళించకుమి వోమనసా
వన్నెల మాటలు చెవుల బెట్టక వాసి విడువకుమి వోమనసా
మున్నిటి సురలు బ్రహ్మాదులకైనను ముక్తి సాధనము వోమనసా
వెన్నుని వేంకటగిరి పతిదలచుము వేసరకుమీ వో మనసా ॥పారకుమీ॥

## భావామృతం :

ఓ మనసా! నీవు పిఱికివలె పలాయనం చిత్తగించవలదు. నీవు పంతమును విడువకుమీ (నీ పట్టుదలను విడనాడవద్దు. అట్లా పారినయెడల నీవు బడుగయ్యెదవు (చెడిపోయెదవు). ఆపైన అట్లాకాకుండా నీ లక్ష్యానికి చేరువ అయ్యావా, ఆనాడు నీకు విశిష్టత లభిస్తుంది.

ఓ మనసా! శివుని వైరి అయిన మన్మథుని గురించి చింతించకుము. చిక్కులలో పడెదవు సుమా! నామాట వినుము కంతువారకుము (చెడిపోకుము). ఓ మనసా! వయస్సు యవ్వనము కావటికుండలవలె వూగిసలాడునవే సుమా! మేళ్ళు కీళ్ళూ వస్తూనే వుంటాయి, పోతూనే వుంటాయి. కాలము ఎప్పుడూ స్థిరముగా నుండదు. కనుక ఓ మనస్సా! వానిని (దేవదేవుని) సంతోషముతో నీలో ప్రతిష్ఠించుకో. అంతకంటే గొప్పపని లేదని గ్రహించుము.

ఓ మనస్సా! యెన్నికలే తలపోయకుము (జరిగిన మంచి కాలము గురించి మాత్రమే ఆలోచించకుము). అట్లు ఆలోచించి నిన్ను నీవు మైమరువకుము. కన్న (చూచిన) వాటి గురించి విన్నవాటి గురించి ఎప్పుడు కాకపడకుము (కలతపడవద్దు). ఓ మనసా! పుడమిలో బదుకులు (ప్రపంచంలోని అందరి జీవితాలూ) వెన్నెలమాసములు (శరదృతువులాంటివి). అవిపోతూనే వుంటాయి, మరల వస్తూనే వుంటాయి. దివిలోను, భువిలోను యెంతకాలం వుంటామన్నది చూడవద్దు. ఉన్నంతకాలం ఉన్నతంగా వుండుటయే తగిన పని.

ఓ మనసా! కన్నులు కలిపి చెలిమి చేయవద్దు. ఆపై కళవళపడవద్దు. వంచనతో కూడిన మాటలను విని మోసపోవద్దు. నీఖ్యాతిని చెడగొట్టుకోవద్దు. ఓ మనసా! మున్నిటి (అనాదివారైన) బ్రహ్మాదిదేవతలకు కూడా ముక్తి సాధనము ఒక్కటే. అదే శ్రీమహావిష్ణువు అయిన శ్రీవేంకటేశ్వరుని ధ్యానించుట. ఓ మనసా! చాంచల్యమును పొందకుము.

## 6-38

## మున్నుడి

చక్కటి వైరాగ్యకరదీపిక వంటి కీర్తనను వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఈ సంసారము అనునది మహామాయ. దీనికి జిక్కువడిన జీవులు జీవితాంతం ఆ మాయకు కట్టుబడిపోయి దానిమీద భ్రమతో ఎన్నటికీ దానిని రోయరు (ఏవగించుకొనరు). దాని బాధలనుభవిస్తున్నంతకాలం రోత కలిగినా రోయలేరు. మతి చెడి తీయగా ఆ బాధలననుభవిస్తూనే వుంటారు అంటున్నారు. మరి ఇక గత్యంతరమేమిటి? జీవుల దైన్యాన్ని పోగొట్టే శ్రీవేంకటేశ్వరుడు దయతలచాలి. అంతే.

**కం॥ మాయల దగులుచు మతిచెడి**
**రోయక సంసార సుఖపు రోతకు ప్రాణుల్**
**రోయదలంచియు రోయరు**
**'తీయగ సై చెదరు' అన్న దీటుగ తెలిపెన్.**

**రాగం : ఆహిరి**

మాయల కగపడి - మతిచెడి ప్రాణులు
రోయదలంచియును -రోయగలేరు ॥మాయకు॥

మిసమిస మెరువగ-మెల్లన చేరిరి
ముసిడిమాని ఫల-ములచూచి
రసమని సంసా-రపు బాలకులిదె
విసిగి చేదుగని-విసుగ గలేరు ॥మాయకు॥

బలు విషమొలికెడి- పాము బట్టుకొని
అలరుచు నలుగడ-నాడేరు
పొలసి యాసలూ-ర్పులు నిగుడించగ
తెలిసియు నింకా-దెలియగ లేరు ॥మాయకు॥





తేనెదెచ్చిక-త్తికి దారబెట్టి
నానా విధముల-నాకేరు
దీనత లణపెడి- తిరు వేంకటపతి
చేని పంటలకు-చెయిజాచ లేరు ॥మాయకు॥

**భావామృతం :**

ఈ సంసారము యొక్క మాయలకు దగులుకొని ప్రపంచంలోని జీవులు (ప్రాణులు) అందరూ అప్పుడప్పుడు రోతగలిగి నా రోయతలచినా రోయలేక దీనికి వశులై సంచరించుచున్నారు. (ఇదంతా ఈ విష్ణుమాయయే.)

మిసిమిస మెరయుచున్న ముసిడిమాని (ముష్టి చెట్టు యొక్క ) పండ్లను చూచి, రసమని (బాగా రుచిగా యుంటాయని) సంసారపు బాలలు (సంసారపు యావలోనున్న అజ్ఞానులు) మెల్లన జేరిరి (నెమ్మదిగా దానికి చేరువ అయ్యారు). తీరా చూస్తే అవి తీపిపండ్లుకావు. వాటి చేదుకు ఇప్పుడు విసుగుకొన్నా చేయగలిగిందేముంది? దాన్ని విరుగగలేరు. (విడుదలకాలేరు).

గొప్ప విషమును జాలువారే సర్పమును బట్టుకొని దాని వల్ల ప్రమాదంతెలియక సంతోషముతో ఆడుకొంటున్నారు. నాలుగుదిక్కులా ఆ పాముతో ఆడుతూనేవున్నారు. ఆ పాము ఆసలనెడి నిటూర్పులను బుసకొట్టుచునేయున్నది. ఇదంతా తెలసి కూడా వీరు దీంట్లోంచి బైటపడలేకున్నారు.

మధురమౌ తేనెని తీసికొని వచ్చి ఒక కత్తికి బాగా పట్టించి, తీయగావుందని ఆ పదునైన కత్తి అంచును నాకుతున్నారు. వీళ్ళ వెఱ్ఱిపాడుగాను ఆ పదునైన అంచును రకరకాలుగా నాకుతున్నారు. ఈ జీవుల దైన్యత్వాన్ని అణచగల ఓ శ్రీవేంకటేశ్వరా! సమృద్ధిగా పండిని చేనువంటి నీవు వారితోనే వున్నా, వారు ఆ పంట నందుకొనేందుకు ప్రయత్నించడం లేదు.... ఏమి దౌర్భాగ్యమిది తండ్రీ!

**6-39**

## మున్నుడి

ఇది వరలో కొన్ని కీర్తనలలో శ్రీ వేంకటేశ్వరునికి ఆ రోజుల్లో నివేదించే తినుబండారాలగురించి అన్నమాచార్యులవారు కీర్తించటం విన్నాము. ఈ కీర్తనలో చిన్నారి కృష్ణయ్యకు ఏయే చిఱుతిళ్ళు ఇష్టమో, వేటిని ఆ నాటి పద్ధతిలో గోపెమ్మలు వుట్లలో దాచుకునే వారో పట్టిక ఇస్తున్నారు. సుండీ! అంటే నేటి కాలంలో సుమా! అన్నట్లు. తల్లి బిడ్డతో అల్లరి చేస్తే తన్నులు తింటావు సుమా! అంటుంది ఈ రోజుల్లో. అన్నమయ్య కాలంలో సుండీ! అనేవారు. ఈ పిల్లవాడు తోటి పాపాయిలతో వీధులో పాకే వాడు నేడు కోలాటాల కఱ్ఱలు పుచ్చుకొని వుట్లు పగుల గొట్టీ జుండీ.... అంటున్నారు.

**ఉ॥ బాలలతోడి వీధులను పాకెడి బిడ్డడు సుండి!! నేడిదే**
**కోలల నెత్తి ఉట్లు పడగొట్టెను యేమని చెప్పమందురే**
**మాలిమి బిడ్డ యీ పిడుగుమాన్య యశోదకు అన్నమయ్యనెన్**
**తేలెను వేంకటేశ్వరుడె దీటగు నందుని గోపబాలుడౌ.**

**రాగం : ఆహిరి**

బాలులతో వీధులలో బారాడు వాడు
కోలలెత్తుక వుట్టు గొట్టీ జుండీ ॥బాలలు॥

నారికడపు వక్కలు నానిన సనగలు
చారపప్పు దేనెలు చక్కెరలును
పేరిన నేతులు నానబియ్యాలు నుట్ల
చేరి యశోదబిడ్డకు జెప్పేరు సుండీ ॥బాలలు॥

చక్కిలాలు నడుకులు సనిగెపప్పులును
చెక్కిన మెత్తని తూటచెఱకులును
పెక్కువగా నుట్లలో బిందెల నించిన వవే
చక్కనెశోదబిడ్డకు జాటేరు సుండీ ॥బాలలు॥





నువ్వులు జిటి బెల్లాలు నున్నని చిమ్మిలులు
నువ్వుటిడియును జిన్ని నురుగులును
యెవ్వారు శ్రీవేంకటపతి కెఱుగించ నారగించి
కివ్వకివ్వ నవ్వ నణకించీ జుండీ ॥బాలలు॥

**భావామృతం :**

ఈ చిన్నారి కృష్ణయ్య ఇది వరకు చిన్నారి బాలురతో కలసి వీధులలో పారాడుతుండేవాడు. ఇవ్వాళ కోలలు (చిన్న కఱ్ఱలు) ఎత్తుకొని ఎగిరివుట్లను కొడుతున్నాడు, సుండీ! (సుమా)

వీడు తినే చిఱుతింట్లు చూడండ్రా! నారికడపు వక్కలు (కొబ్బరితో చేసిన చిన్నచిన్న బిళ్ళలు), నానిన సనగలు(నానబెట్టిన శనగలు), చారపప్పు (సారపప్పు), తేనెలు, చక్కెరలు, పేరిన (గడ్డకట్టిన) నెయ్యి, నానబెట్టిన బియ్యము మొదలైనవి వుట్లలో దాచుకున్నాం. చేరి (వెళ్ళి) ఆ యశోద బిడ్డడకి జెప్పేర సుండీ! (ఆయశోద కొడుక్కి చేప్పేరు సుమా! కొంపంతా వూడ్చిపారేస్తాడా అల్లరి పిడుగు)

ఇంకావాడికేమి ఇష్టమో చూడండి. చక్కిలాలు, అడుకులు (అటుకులు), సనిగ పప్పులు (పుట్నాల శనగపప్పు), చెఱకు గడను నఱికి మెత్తని చిన్నచిన్న ముక్కలు చేసిన “తూట” ఎత్తైన వుట్లలో బిందెలను పెట్టి ఆ బిందెల్లో పెక్కువ (ఎక్కువగా) నింపాము. ఈ సంగతి చక్కని ఆ యశోదబిడ్డ దగ్గర చాటింపు వేసేరు సుండా! జాగ్రత్త! అన్నీ క్షణంలో మాయం చేస్తాడు.

ఇంకావాడికి చిటిబెల్లము, నువ్వలు కలిపికొట్టిన ‘గుండ’ అంటే కూడా వాడికి ఇష్టం. నువ్వుటిడియను (నువ్వపప్పు ఇడీలైవుండవచ్చును) అంటే వాడికిష్టమే. జిన్నినురుగులు అంటే కూడా వాడికి ప్రీతి. ఇదంతా సరే.... ఈ సంగతి ఎవ్వారు (అందరూ) , శ్రీవేంకటపతికి చెప్పి ఆరగింపు చేయిస్తుంటే... ఆయన, “కిలకిలమని నవ్వి అపహసించినాడు సుమా!).

## మున్నుడి 6-40

చిన్నప్పట్నించి నా ఈ శరీరాన్ని అంతా 'బ్రాహ్మలబ్బాయి' అనేవారు. మా పెద్దవాళ్ళు చెప్పిన కొన్ని "కర్మలు నేనూ ఆచరించాను, కాని అన్నమాచార్యులవారి ఈ కీర్తన నన్ను ఆలోచనల్లో పడేసింది. అసలు ఈ పరమాత్మతత్త్వం అర్థంకాని వాడు బ్రాహ్మడెట్లా అవుతాడు? ఆదినారాయణుని నిరంతరం ఆత్మలో నిలుపుకోనివాడు'బ్రాహ్మడే' కాదు పో...అంటున్నారు.

**సీ॥ అణురేణు పరిపూర్ణుడైన శ్రీవల్లభున్**
**బ్రణుతించు వారె పో బ్రాహ్మలనగ**
**హరినామములను సంధ్యావిధులన్ సల్పు**
**పరిపూర్ణమతులె పొ బ్రాహ్మలనగ**
**యేవి చూచిన హరి యిన్నిటా కలదని**
**భావించు వారలే బ్రాహ్మలనగ**
**ఆదినారాయణు ననయంబు దమయాత్మ**
**బాదుకొలుపువారె బ్రాహ్మలనగ**

**తే॥ వేదరక్షకుడైనట్టి వేంకటేశు**
**పాదసేవకుండొక్కడే బ్రాహ్మడనగ**
**అన్నమార్యుని కీర్తన మాలపించి**
**మనిషినైతిని కాకుంటి బ్రాహ్మణుండు**

**రాగం: శ్రీరాగం**

అణురేణు పరిపూర్ణడైన శ్రీవల్లభుని
బ్రణుతించు వారువో బ్రాహ్మలు ॥అణురేణు॥

హరినామములనె సంధ్యాది విధులొనరించు-
పరిపూర్ణమతులువో బ్రాహ్మలు
హరిమంత్రవేదపారాయణులు హరిభక్తి
పరులైనవారువో బ్రాహ్మలు ॥అణురేణు॥





యేవి చూచినను హరి యిన్నిటా గలడనుచు-
భావించువారువో బ్రాహ్మలు
దేవకీనందునుడె దేవుడని మతి దెలియు
పావనులు వారువో బ్రాహ్మలు ॥అణురేణు॥

ఆది నారాయణుని ననయంబు దమయాత్మ
బాదుకొలిపిన వారువో బ్రాహ్మలు
వేదరక్షకుడైన వేంకటగిరీశ్వరుని-
పాదసేవకులువో బ్రాహ్మలు ॥అణురేణు॥

**భావామృతం :**

అణువణువునా, ప్రతిరేణువులోనూ పరిపూర్ణుడైన (ఏమాత్రం ఖాళీలేకుండా నిండిపోయిన) శ్రీపతిని....ప్రణుతించువారువో (బాగుగా కీర్తించువారే). బ్రాహ్మలు (బ్రాహ్మణులు), ఆ కులంలో పుట్టినంతమాత్రాన కారు.

తమ సంధ్యాది కార్యక్రమాలలో నిరంతరం శ్రీహరి నామమును జపించువారిని, పరిపూర్ణమతులైన (మనస్సంతా హరితో నిండిన మహాత్ములు) వారినే బ్రాహ్మణులు అంటారు. హరి మంత్రముతో కూడిన వేదపారాయణము చేస్తూ హరి భక్తులైనవారలే బ్రాహ్మణులు. భక్తిలేనివాడు బ్రాహ్మణుడు కాదు.

నాడు ప్రహ్లాదుడు చెప్పినట్లు, ఇందుగలడందులేడని సందేహములేక, యెందైనా హరియే కలడనే వాడే బ్రాహ్మణుడు. అట్లు భావించనివాడు బ్రాహ్మడే కాదు. దేవకీనందనుడైన శ్రీకృష్ణపరమాత్మను, భగవంతుడని మనస్సున నమ్మకంగా నిలుపుకొన్నవారే బ్రాహ్మణులు ఒక బ్రాహ్మణుడికి పుట్టినంత మాత్రాన బ్రాహ్మణుడు కాదు.

ఆదినారాయణుడైన దేవదేవుని, అనయంబు (ఎల్లప్పుడు) తమ ఆత్మలో బాదుకొలిపిన వారు (బాగుగా నాటుకొనిన వారే) బ్రాహ్మణులు అని పిలువదగినవారు.వేదరక్షకుడైన శ్రీవేంకటగిరిపతి యొక్క పాదసేవకుడైనవాడే బ్రాహ్మణుడు. అట్లుగాక ఒక జంధ్యం వేసికొని, అడ్డబొట్టో, నిలువు బొట్టో పెట్టుకొనే, పిలకధారులు బ్రాహ్మణులుకాదు.... బ్రాహ్మణకులస్థులు అంతే......

**6-41**

## మున్నుడి

అన్నమాచార్యులవారి ఈ కీర్తనలో 'విభక్తి'ని బట్టి కీర్తన స్వరూపమే మారిపోతుంది 'వలపులధికము సేయు వైభవములు' అనే పల్లవిని చూడండి. వలపులు వైభవములను అధికము సేయును - అవుతుంది ప్రథమా విభక్తితో అంటే ప్రేమలు వైభోగాలను పెంచుతాయా? కానేకాదు. 'వలపులను వైభవములు అధికము సేయు' - అని ద్వితీయా విభక్తి ఉపయోగిస్తే... వైభవములు ప్రేమలను పెంచుతాయి అని అర్థమవుతుంది. నేను పద్యంలో కూడా ఇదే ధోరణి నవలంభించాను. గమనించండి. భావామృతం జాగ్రత్తగా చదవండి.

**తే॥ వలపులధికము సేయును వైభవములు**
**తలపులధికము సేయును తనదు చింత**
**అందములు పొందులును సేయు అమితమనెను**
**అలర "వేంకటేశుని కృప" అన్నమయ్య.**

### రాగం : శ్రీరాగం

వలపు లధికము సేయు వైభవములు
తలపు లధికము సేయు తలపోతలు ॥వలపు॥

కోప మధికము సేయు గోరికలు
తాప మధికము సేయు దమకంబులు
కోపంబు తాపంబు గూడ నధికము సేయు
యేపయిన మోహముల నేమందునే ॥వలపు॥

మచ్చి కధికము సేయు మన్ననలు
యిచ్చలధికము సేయు నీరసములు
మచ్చికలు నిచ్చలును మగుడ నధికము సేయు
నెచ్చరిక కూటముల నేమందమే ॥వలపు॥





అంద మధికము సేయు నైక్యములు
పొందు లధికము సేయు బొలయలుకలు
అందములు బొందులును నలర నధికముసేయు
నెందు నరుదగు వేంకటేశు కృపలు ॥వలపు॥

### భావామృతం :

ఓ మానవులరా! వైభవములు (సిరిసంపదలు) వలపులను (ప్రేమలను) అధికము చేస్తాయి. తలపోతలు (అదేపనిగా చింతించే మనస్తత్వం) తలపులను (ఆలోచనలనే) అధికము చేస్తాయి. (ఇక ఆ చింతకు అంతే వుండదు).

కోరికలు తీరకపోతే అవి కోపమును తప్పక అధికము సేయును. తమకంబులు (మైమరపు చెందు స్వభావము) తాపమును (విరహవేదనను) అధికము చేయును. ఇకపోతే ఏపయిన మోహములను (అధికమైన మోహములను) ఏమనవలెను? అవి కోపమును పాపమును రెంటినీ పెంచుతాయి కదా!

మన్ననలు (ఒక వ్యక్తికి మనమిచ్చే గౌరవ మర్యాదలు) మచ్చికను అధికము చేయును. (వారితో మన చనవును పెంచుతుంది) "ఇచ్చలు అధికము సేయున్ ఈరసములు"... అంటే... ఈ రసములు (ఈర్ష్యలు) ఇచ్చలు (కోరికలను) అధికము సేయును. ఇకపోతే, హెచ్చరించవలసిన కూటములను (సంబంధములను) అధికము చేస్తాయే... ఈ మచ్చికలు మరియు ఇచ్చలు.. ఆ కూటములను యేమనవలెనో తెలియుటలేదు.

ఐక్యములు (ఒకటిగా అయిపోవటం) అందమును అధికము సేయును. ''పొందులధికము సేయున్ పొలయులుకలు''- అంటే.. పొలయులుకలు (ప్రణయకోపములు) పొందులన్ అధికము సేయును (కలయికలను, సంభోగములనధికము సేయును). అయితే... యెందున్ (యెక్కడైనా సరే) వేంకటేశ్వరుని కృపలు (దయ, వాత్సల్యములు) వుంటే... అవి అందములను పొందులను రెంటినీ తప్పక వృద్ధి చేస్తాయి.

6-42

## మున్నుడి

శ్రీవేంకటేశ్వరుడు అలమేల్మంగను పరిణయమాడి కొత్త పెళ్లికూతురుతో పాటు తరలిపోబోతున్నాడు. తొలినాటి బిడియంతో సిగ్గుపడుతున్నాడు శ్రీనివాసుడు. పుత్తడిబొమ్మ అలమేల్మంగ చక్కదనం వర్ణించటం సామాన్యులవల్ల అయ్యే పనియేనా? అన్నమాచార్యులవారు ఆనాటి నవ వధూవరులను భావించి వధువు తరపున నాలుగు మంచి మాటలు చెబుతున్నారు. జగన్నాధునే యేమని మందలిస్తున్నారో చూడండి. "ఇమ్ముల సిగ్గువడక (ఇంతగా బిడియపడక) యేలుకో వయ్యా! మా అమ్మాయిని" అంటున్నారు. ఇంకేం చెప్పను?

**కం॥ "కొమ్మకు పెండిలి కొడుకై**
**సొమ్ముగవచ్చితివియేలు సుదతి మురియగన్**
**ఇమ్ముల సిగ్గువడకు మా**
**రమ్మా!" అన్నయ్య పిలిచె రాజీవాక్షున్**

**రాగం : ముఖారి**

కొమ్మకు నీవిట్టే పెండ్లి కొడుకువై వచ్చితివి
ఇమ్ముల సిగ్గువడక యేలుకోవయా ॥కొమ్మకు॥

పుత్తడి వంటిది యీ పొలతి చక్కదనము
చిత్తరువు వంటిది మించిన రూపము
క్రొత్త మెఱుగువంటిది కోమలపు దేహము
చిత్తగించవయ్యా యీకె సింగారము ॥కొమ్మకు॥

పూవుతీగెవంటిది పొలుపైన ఈకె తీరు
వావిరి బైడి సలాక వంటిది రేక
సోవ చిగురువంటిది చూచితేను నిలువెల్లా
వేవేగ చూడవయ్యా యీ విలాసము ॥కొమ్మకు॥





వన్నెల నాణిముత్తెము వంటిది తనపోలిక
వెన్నెల సోగ వంటిది వింతభావము
యిన్నిటా శ్రీవేంకటేశ యింతినిట్టే కూడితివి
వున్నతి మెచ్చవయ్యా యీ వొయ్యారము ॥కొమ్మకు॥

**భావామృతం :**

ఓ శ్రీనివాసా! ఈ కొమ్మకు (యువతికి) నీవు ఇట్టే పెండ్లికొడుకై వచ్చితివి. ఇమ్ముల (ఇంతయెక్కువగా) సిగ్గువడక (బిడియపడకుండా) యీ అలమేల్మంగను యేలుకోవయ్యా (స్వీకరించవయ్యా!)

ఓ ప్రభూ! ఈ పొలతి (తరుణి) చక్కదనము పుత్తడి వంటిది (బంగారము వంటిది). ఈమె రూపము గొప్ప చిత్రకారుడు వేసిన చిత్తరువు వంటిది. కోమలమైన ఈమె దేహము క్రొంగొత్త మెఱుపుతో మెఱయుచున్నది. ఈమెయొక్క సింగారములను చిత్తగించవయ్యా (తలచవయ్యా!)

ఈమె తీరు పొలువైనది (విధానము ఒప్పు అయినది). అది కోమలమైన పూవుతీగెవంటిది. ఈమె రేక (తిన్నదనము), వావిరి పైడి సలాకవంటిది (అంటే.. ఉత్కృష్టమైన బంగారు కమ్మీ వంటిది). ఈమెను నిలువెల్లా గమనించితే లేతచిగురువంటి మృదువైన కోమలి. ఓ దేవదేవా! జాగుచేయక వేవేగ (అతిశీఘ్రముగా) ఈమె విలాసములను గమనించవయ్యా!

ఓ జగన్నాథా! ఈమె పోలిక, దీప్తించెడి ఆణిముత్యము (గుండ్రటి చక్కటి ముత్యము) వలెనున్నది. ఈమె భావము, వెన్నెలసోగ (దీర్ఘమైన వెన్నెల) వంటిది. ఇన్ని విధములైన విశిష్టతలున్న ఈ జవ్వనిని నీవు ఇట్టే (సునాయాసంగా) కూడితివి (పొందితివి). ఓ శ్రీవేంకటేశ్వరా! ఈమె వొయ్యారము (సౌకుమార్యమును) నీవు ఉన్నతముగా మెచ్చుకోవయ్యా! ఈమెననుగ్రహింపుమయ్యా!

**6-43**

## మున్నుడి

అన్నమాచార్యులవారి ఈ కీర్తన తక్కిన దశావతార కీర్తనలవలె ఇదికూడా నర్మగర్భంగా, కాస్త తికమకపెట్టేదిగానే వుంటుంది. అసలు పల్లవి కూడా అర్థం కావాలంటే కష్టపడాల్సిందే. "ఏమీననకురే యెప్పుడు మీరు" అని అంటున్నారు. ఇంతవరకూ తేలికే... "గామిడి యై కాలిసన్న గదలీని బిడ్డడు"... అంటే యేమిటి? నేను ఇలా భావించాను... "ఓ అమ్మలారా! గామిడియై (శ్రేష్ఠుడై) ఈ బిడ్డడు (శిశువు) కాలిసన్న (కాలు తన గుర్తుగా) కదలుచున్నాడు. ఈ శిశువు తన కాలి బొటనవ్రేలు నోటిలో యుంచుకొని దానిని చీకుతూ జగద్విఖ్యాతుడైనాడు. వీడే పరబ్రహ్మ."

**కం॥ "అనకురె యేమీ మీరలు**
**వినుతించెడి 'కాలిసన్న బిడ్డడు' కదటే!!"**
**పనిగొని పాడెను అన్నయ**
**మన "వేంకడె" దశవిధముల మాధవుడనెరా.**

**రాగం : భైరవి**

ఏ మీన నకురే యెప్పుడు మీరు
గామిడియై కావిసన్న గదలీని బిడ్డడు ॥ఏమీ॥

పొలసీ ననకురే పొదిగి యిందరు గూడి
వులికి తలదీసుక వున్న బాలుని
పలుక దనకురే బలుమోరతోపు గోపి
తలకి సిబ్బితిగొని త(నీద) లరమ్మ బిడ్డడు ॥ఏమీ॥

అడిగీ ననకురే ఆస దీరదనకురే
కడగి చలమరియై గాసిబెట్టీని
జడలున్న వనకురే జననుతడీ శిశువు
కడు దూరీ గిరులకు గమనించి బిడ్డడు ॥ఏమీ॥





బిత్తలున్నాడనుకురే పృథివిలో బిన్నవాడు
మత్తులైవున్నవారి మడియించీని
చిత్తిణి వాడనకురే శ్రీవేంకటేశుడు
యెత్తుక యీరేడు లోకాలేలీని ॥ఏమీ॥

### భావామృతం :

ఓ అమ్మలారా! మీరీ శిశువును యేమీ అనకురే (అనవద్దు). ఎప్పుడూ అనవద్దు. ఎందుకంటే వీడు "గామిడియై కాలిసన్న గదలీని బిడ్డడు" (శ్రేష్ఠుడై ఈ శిశువు తన "కాలు" జగద్విఖ్యాతమైన "గుర్తు" గా కలిగియున్నాడు. తనకాలి బొటనవ్రేలును నోటిలో వుంచుకొని చీకుతూ మఱ్ఱిఆకుపై పవళించి నీరధిలో తేలిన శ్రీరంగ శిశువు ఈతడే సుమా!)

పొలసీననకురే పొదిగి యిందరునుగూడి ఇంతమంది ఒక్కటై వీడు పొలుసులున్నవాడు అని అనకండే (మత్స్యావతారము). వులికీతలదీసుకవున్న బాలుని – భయముతో తనతల హఠాత్తుగా తనలోనికి తీసికొన్న బాలుడు (తాబేలు ఆవిధంగా చేస్తుంది. అనగా కూర్మావతారుడు). పలుకదనకురే బలుమోరతోపుగోపి – వీడు మాటలాడడు అనకండే... పెద్దమూతివున్న కోపిష్టియైనవాడు (వరాహతారము). తలకి సిబ్బితి గొని త(నీద)లరమ్మ బిడ్డడు. భయంకరమైన తన ఆకృతికి సిగ్గుపడి ఈ బిడ్డడు తనీదలరమ్మా! (అతిశయించినవాడమ్మా! అనగా నరసింహ స్వరూపుడు).

తరువాయి నాలుగు అవతారములు ఇలా వర్ణించబడ్డాయి. అడిగీననకురే ఆస దీరదనకురే – యాచించాడనవద్దమ్మా! వీడి ఆశకు అంతులేదని అనకండే (త్రిజగముల నాక్రమించిన వామనుడు). కడగి చలమరియై గాసిబెట్టీని – మత్సరము కలిగినవాడై బాధపెట్టినాడు (పరశురాముడు). జడలున్నవనకురే జననుతుడీ శిశువు – వీడు జడలు ధరించినవాడనవద్దు జనులచే కీర్తించబడినట్టి శిశువు (శ్రీరామచంద్రుడు). కడు దూరీ గిరులకు గమనించి బిడ్డడు – గోపికల రాకను గమనించి గోవర్ధన గిరులలో దాగి వారికై కాపుకాశాడీ బిడ్డడు (శ్రీకృష్ణుడు).

తరువాయి రెండు అవతారాలు ఇలా వర్ణించబడ్డాయి. బిత్తలున్నాడనకురే పృథివిలోన్ పిన్నవాడు – వీడు దిగంబరి అని నవ్వకండమ్మా! పృథ్విలో అవతరించినవారిలో పిల్లవాడీతడే (బుద్ధభగవానుడు). మత్తులైవున్న వారి మడియించీని మదించిన దుర్మార్గులను రూపుమాపేవాడు (కల్కి అవతారము). చిత్తిణి వాడనకురే శ్రీవేంకటేశుడు యెత్తుక యీరేడు లోకాలనేలీని – మొండివాడనకండమ్మా! వీడు శ్రీవేంకటేశ్వరుడు. ఉన్నతుడైన ఈ రాజు సమస్తలోకములను పరిపాలించును.

**6-44**

## మున్నుడి

"పుండరీకాక్షుడైన పురుషోత్తమునితో స్వామీ! ఇక నీ కోపతాపాలు చెల్లవయ్యా! ఎందుకంటే నిన్ను చూచి ఇందిరాదేవి నలి (యోగ్యముగా) నవ్వినదయ్యా!" అంటున్నారు అన్నమాచార్యులవారు. ఆ జలధికన్య(సాగరపుత్రిక) నిన్ను తన స్వయంవరమునకు పిలిచి పెనవేసుకుపోయిందట. ఆనాటినుంచి క్షణమైనా స్వామిని వీడక ఆయన వురమునెక్కి (ఆయన హృదయాన్ని అధిష్టించి లోకాలను పరిపాలిస్తోందట. భళా!

**తరలము॥**

**అలుకలెల్లను చెల్లవో హరి అచ్యుతా! నళినీధవా!**
**లలన ఇందిర నవ్వెనో మధురంబుగా నిను జూచుచున్**
**జలధికన్యక పిల్చె నిన్నిటు చక్కగా పెనవైచెరా**
**యెలమి వేంకటరాయ! నీవురమెక్కెరాయనె అన్నయున్.**

**రాగం : మోహన**

అలుకలు చెల్లవు హరిపురుషోత్తమ
నలి నిందిర నీతో నవ్వినది ॥అలుకలు॥

ఆదిలక్ష్మి మోహన కమలంబున
వేదమాత నిను వేసినది
ఆదెస నీపై నభయహస్తమును
సాదరమున గడు చాచినది ॥అలుకలు॥

సిరి తనకన్నుల చింతామణులను
పోరి నీపై దిగబోసినది
వరద హస్తమున వలచెయి వట్టుక
అరుదుగ నినుమాటాడించి ॥అలుకలు॥





జలధికన్య తన సర్వాంగంబుల
పిలిచి నిన్ను నిటు పెనగినది
అలముక శ్రీ వెంకటాధిప నిను రతి-
నెలమి నీ వురంబెక్కినది ॥అలుకలు॥

**భావామృతం :**

పురుషోత్తముడవైన ఓ శ్రీహరీ! ఇకపై నీ అలుకలు (కోపములు) చెల్లవయ్యా! ఎందుకంటే ఇందిరాదేవి (శ్రీలక్ష్మి) నిన్ను చూచినది నవ్వినది (యోగ్యముగా నవ్వినది). నిన్ను తన స్వంతం చేసికొనినది.

వేదమాత (వేదములు కీర్తించెడి జనని) యైన ఆదిలక్ష్మి మోహన కమలంబున జనించి నిన్ను వేసినది (వరించినది). అందుచేత తన అభయహస్తమును ఆ దెస (నీవు ఎక్కడ వుంటే అక్కడ) చాచి మిక్కిలి సానుకూలయై అనుగ్రహించుచున్నది.

సిరి (సిరులను ప్రసాదించు ఆ తల్లి) తన కన్నులను నీపై దిగబోసినది (పైనుంచి క్రిందకు చూపులను విస్తరింపజేసినది). ఆ కన్నులు చింతామణులు (కోరిన కోర్కెలను దీర్చు దివ్యమణులు). ఆ శ్రీదేవి అరుదగు (అపూర్వమైన) తన వరదహస్తముతో నీ పాణిగ్రహము చేసి నీతో మధురముగా మాట్లాడినది.

జలధికన్య (సాగరపుత్రిక) యైన ఆ శ్రీమహాలక్ష్మి నిన్ను ఆహ్వానించి, నిన్ను తన సర్వాంగములు తాకునట్లు పెనవేసి కొనినది. ఆ దేవికి నీవనిన అంతప్రీతి. ఓ శ్రీవేంకటేశ్వరా! అలముక (పైకొని) నిన్ను, యెలమి (సంతోషముతో) నీ వురంబెక్కినది (నీ హృదయ పీఠమునధిష్టించినది). ఇక ఆ తల్లికి అడ్డేముంది స్వామీ!

**6-45**

## మున్నుడి

కోపావేశాలతో ఊగిపోతూ తనశత్రువులను నిందించే అన్నమాచార్యులవారివీ ప్రత్యక్షమవుతున్నారీ కీర్తనలో. తన ఇష్టదేవతలైన నరసింహుడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మరియు శ్రీవేంకటేశ్వరునకు తన నమోవాకములను తెలుపుతూ వారిని యేమి ప్రార్థిస్తున్నారో వినండి. తన శత్రువులను సరగున (వేగంగా) సంహరించవే అని వేడుకొంటున్నారు. నిన్ను తిట్టినాడని నీ బావ 'శిశుపాలుని' చంపావు ఆనాడు. నీ దాసుని అవమానపరిచాడని 'కాశ్యపుని' సంహరించావు. అబద్దాలాడి గుడ్లగూబ ఇల్లు కాజేసిన గద్దను చంపావు. మరినేడు నాశత్రువులనెందుకు చంపవు అంటున్నారు.

**కం॥ నరసింహా! రామకృష్ణా!**
**తిరువేంకటగిరి నివాస! దేవేశ! నమో**
**సరగున శత్రుల జంపుము**
**అరిపీడితు దన్నమయ్య ఆర్తితొ వేడెన్.**

**రాగం : అఠాణా**

నరసింహ రామకృష్ణ నమో శ్రీవేంకటేశ
సరగు నా శత్రుల సంహరించవే ॥నరసింహ॥

బావ తిట్లకు శిశుపాలుని జంపిన-
యేవ కోపకాడవు నేడెందు వోతివి
నీవాడనని నన్ను నిందించే శత్రువును
చావగొట్టి వానినిట్టే సంహరించవే. ॥నరసింహ॥

దాసుని భంగించేటి తరి కాస్యపు జంపిన
ఈసు కోపగాడ విపుడెందు వోతివి
మేసుల నీ లాంఛనాలు మించి నన్ను దూషించే
సాసించి శత్రువును సంహరించవే ॥నరసింహ॥





కల్లలాడి గూబ యిల్లుగైకొను గద్ద జంపిన
యెల్లగాగ గోపకాడ వెందువోతివి
యిల్లిదె శ్రీవేంకటేశ యీ నీమీది పాటలు
జల్లన దూషించు శత్రు సంహరింపవే ॥నరసింహ॥

**భావామృతం :**

ఓ నరసింహా! శ్రీరామా! శ్రీకృష్ణా! శ్రీవేంకటేశ్వరా! నీకు నమోవాకములు. సరగు (వేగముగా) నీవు నాశత్రువులను సంహరించవయ్యా!

ఆ నాడు నీ బావ (నీమేనత్త కొడుకు) అయిన శిశుపాలుడు నీ ద్వేషముతో తిట్టుతుంటే నూరు తిట్లవరకు క్షమించినా నూరుతిట్లు దాటి నీ భక్తుడైన భీష్ముని కూడ తిట్టగానే "యేవ"తో (రోతపుట్టి), వాని శిరస్సును నీ చక్రముతో ఖండించిన కోపిష్ఠివి. నేడు యెక్కడికి పోయావయ్యా! నీ దాసుడనని నన్ను నానా విధములుగ నిందించుచున్న నా శత్రువును (అజ్ఞానం అనే శత్రువు) చావగొట్టి చెవులు మూయవయ్యా! నా శత్రువును సంహరించవయా!

ఆనాడు కశ్యపమహర్షి కొడుకు (హిరణ్యకశిపుడు) నీ దాసుడైన ప్రహ్లాదుని భంగపరుస్తుంటే (అవమానిస్తుంటే), కోపము తట్టుకోలేని ఈసుకాడవై (కోపగాడవై) నాడు ఆయనను సంహరించినావు. అటువంటి నీవు నేడు యేమయ్యావయ్యా? మేసులన్ (?) ఈ లాంఛనాలు (పటాటోపములు) మించి (అధికముగా) నన్ను దూషించి (నన్ను బాధిస్తుంటే) చూస్తూ వూరుకుంటావేమయా? వాటిని కట్టడి చేసి దర్పము అనే ఆ నా శత్రువును తుదముట్టించవేమయ్యా?

పూర్వం ఒక గద్ద నీ భక్తురాలైన ఒక గుడ్లగూబను, దాని ఇంట్లోంచి తరిమివేసి ఆ ఇంటిని స్వాధీనం చేసికొని గుడ్లగూబను దిక్కులేని దాన్ని చేసింది. కోపంతో నీవు దానిని సంహరించావు. అట్లా దుర్మార్గులను పూర్తిగా దోచుకుంటావు. అటువంటి నీవు నేడు యెక్కడికి బోతివయ్యా? ఓ శ్రీవేంకటేశ్వరా! యిల్లిదే (ఇదిగో) నేను నీమీద భక్తితో కీర్తనలు పాడుతుంటే... వీటిని జల్లు (ఉమ్మివంటి వ్యర్థమైనది) అని దూషించు వారిని చంపి అవతల పారవేయవేమయా!

**6-46**

## మున్నుడి

వేదనుతుడైన అహోబల నారసింహుని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఆ స్వామి వేడుకలు దైవారగ తన దాసులను ఆదరిస్తున్నాడట. అంటే వేడుకలు అతిశయించగా తన భక్తులను అనుగ్రహిస్తున్నాడు. ఈ కీర్తనలో ఆ స్వామి అంగాంగ వర్ణన చేస్తున్నారు. ఎంత అద్భుతమైన వర్ణనో వినండి. ఆయన గోళ్లు చిలుక గోళ్లలాగ అర్ధచంద్రాకారంలో వంగి వున్నాయట. నేనెన్నడూ ఇంత చక్కటి వర్ణన వినలేదు.

**ఉ॥ వేదములెల్ల బూని నిను పెన్నిధి వోలె నుతించె, వేడుకల్**
**పాదుగ హెచ్చెనయ్య! నిను పాడితిమో నరసింహ! మమ్ము నీ**
**వాదర మొప్ప దాసులకు ఆర్తిని దీర్చెద వన్నమయ్యనెన్**
**మేదిని వేంకటేశ్వరుని వేఱొక రూపము యీ నృసింహుడే.**

**రాగం : మోహన**

వేదములు నుతించగ వేడుకలు దైవారగ
ఆదరించీ దాసులమోహన నారసింహుడు ॥వేదములు॥

నెఱుల జడలతోడ నిక్కు కర్ణములతోడ
కుఱచ కొమ్ములతోడ కోఱలతోడ
వుఱక సిరి దొడపైనుంచుక సింహాసనాన
మెఱసీ ప్రతాపములు మేటి నారసింహుడు ॥వేదములు॥

నిడుప మీసాల తోడ నిట్టూరుపుల తోడి
మిడి గుడ్లతో తెల్లని మేని తోడ
ఒడల సొమ్ముల వెట్టి ఒడ్డోలగమై వుండి
కడు మంచి వరాలిచ్చీ ఘన నారసింహుడు ॥వేదములు॥





చిలుకు గోళ్లతోడ సెలవి నవ్వులతోడ
బలు జిహ్వతోడ యోగపట్టెముతోడ
అలరి శ్రీవేంకటాద్రి అహోబలగిరిని
అల ప్రహ్లాదుని గాచె ఆది నారసింహుడు ॥వేదములు॥

**భావామృతం :**

అహోబలమున వెలసిన ఈ మోహన నారసింహుడు చతుర్వేదములూ తనను చక్కగా కీర్తిస్తుంటే తనదాసులను ఆదరిస్తున్నాడు. ఈ స్వామికి వేడుకలు దైవారుచున్నవి (అతిశయించుచున్నవి).

ఈయనకు నెఱుల జడలున్నవి (ఉంగరాలు తిరిగిన జడలున్నవి). ఈయనకు నిక్కిన చెవులు కొట్టవచ్చినట్లు కనబడుచున్నవి. ఈయనకు కుఱచ కొమ్ములున్నవి (పొట్టి కొమ్ములవలె పొడుచుకొని వచ్చిన నుదుటి యెముకలున్నవి). పదునైన కోఱలున్నవి. ఈయన సిరిని (లక్ష్మీదేవిని) తన తొడపై కూర్చొనబెట్టుకొని, ఉఱక (ఔచిత్యముతో) యున్నాడు. సింహాసనముపై మెఱసి పోతున్న ప్రతాపముతో వైభవోపేతముగానున్న మేటి నరసింహుడు ఈ స్వామి.

ఈయనకు నిడుపైన (పొడవైన) మీసాలున్నాయి. తీవ్రంగా నిట్టూరుస్తున్నాడు (దీర్ఘమైన ఉచ్ఛ్వాసనిస్వాసలు గలవాడు). ఈయనకు మిడిగుడ్లు వున్నాయి. ఒంటి రంగు తెల్లగా వున్నది. ఒంటినిండా నగలు ధరించియున్నాడు. ఈయన ఒడ్డోగమై వున్నాడు. (విశాలమైన దేహముతో వున్నాడు). ఘనుడైన ఈ నరసింహుడు చాలా మంచి వరముల ననుగ్రహించుచున్నాడు.

ఈయన కొనదేరిన గోళ్లు చిలుకు గోళ్లు (బాణములవలె) నున్నవి. ఈయన నవ్వుతుంటే సెలవి (చొల్లు) కారుతున్నది. ఈయన జిహ్వ(నాలుక) పొడవుగా బలంగా వున్నది. ఈయన యోగపట్టెము (యోగులు ధరించు జంధ్యము వంటి పట్టుగుడ్డ పట్టీ), ధరించియున్నాడు. ఈ అహోబలం కొండపైనే గాక శ్రీవేంకటాద్రిమీద కూడా వెలసియున్నదీయనే. ఈయనే ఆ నాడు ప్రహ్లాదుని రక్షించిన ఆది నారసింహుడు.

## మున్నుడి 6-47

చిన్నప్పుడెప్పుడో "దీని భావమేమి తిరుమలేశ!" అనే చిక్కు ప్రశ్నల ప్రహేళిక యెక్కడో చదివినట్లు గుర్తు. అన్నమాచార్యులవారి ఈ కీర్తన అటువంటిదే. ఆయన స్ఫూర్తితో యెంత చక్కటి సీసపద్యం ఆవిర్భవించిందో చూడండి. ఈ ప్రహేళిక (Quiz) లో వున్న వారంతా హరిని పొందిన వారే, కాకపోతే తలా ఒకదారి... ఏదారైనా 'హరిదారే'...

**సీ॥ నిను సదా స్మరియించె నీ దాసుడొక్కండు**
**గంట చెవుల కద్దు గట్టెనొకడు**
**నినువేడి భోగియై నెరవేరె నొక్కండు**
**నిను దిట్టి యొక్కండు నిన్ను పొందె**
**మతి చింతవిడి, భాగవతుడయ్యె నొక్కండు**
**నారాయణాయని యెరుగ డొకడు**
**నీ పనులొనరించి నీవాడొకండయ్యె**
**చాకిరీ చేయించె సఖుడొకండు**

**ఆ.వె॥ కౌగిలిచ్చి రతుల ఘనులైరి కొందరు**
**వెంటతిప్పుకొనెను పేర్మికొన్ని**
**హరికి యెవ్వరైన అన్నయ్య సములనె**
**వీరలెవరు తెలుపు వేంకటేశ!**

**రాగం : మంగళకౌశిక**

ఇందరు నీకొక్క సరి-యెక్కువ తక్కువ లేదు
చెంది నీ సుద్దులు యేమి – చిత్రమో కాని ॥ఇందరు॥

నీ నామముచ్చరించి – నెరవేరె నొక్క మౌని
నీ నావము వినక- నెరవేరె నొక్కడు
పూని నిన్ను నుతియించి – భోగియాయె నొక్కండు
మోనమున నిన్నుదిట్టి – మోక్షమందె నొకడు ॥ఇందరు॥





మతిలో నిన్ను దలంచి – మహిమందె నొక యోగి
తతినిన్ను దలచకే – తగిలె నిన్నొకడు
అతిభక్తి బనిసేసి – యధికుడాయె నొకడు
సతతము బనిగొని – సఖుడాయెనొకడు ॥ఇందరు॥

కౌగిటి సుఖములిచ్చి – కలిసిరి గొందరు
ఆగి నిన్ను వెంటదిప్పి – ఆవులు మేలందెను
దాగక శ్రీవేంకటేశ – దగ్గరైన దవ్వయిన
మాగి నిన్ను దలపోసె – మనసే గుఱుతు ॥ఇందరు॥

**భావామృతం :**

ఓ దేవదేవా! ఇందరు నీకొక్కసరి (ఇంతమంది కూడా నీకు సమానమే). ఒకరు యెక్కువ ఒకరు తక్కువ అను బేధ భావము నీకు లేనేలేదు. ఈ నీ కథలు యెంత చిత్రంగా వుంటాయయ్యా!

(అందరూ నిన్ను పొందినవారే... కానీ అందరిదీ ఒకేదారి కాదు. ఎవరి దారి వారిదే) ఎప్పుడూ నీనామస్మరణచేస్తూ అగ్రగణ్యుడైనాడొక్కడు. (నారదుడు). ఒకడేమో నీపేరు కూడా వినపడకూడదని చెవులకు ఘంటలు కట్టుకొని తిరిగాడు (ఘంటా-కర్ణుడు). నీ దాసుడయి యెంత దరిద్రపీడితుడైనా చివరికి భోగాలనుభవించాడు ఇంకొకడు (కుచేలుడు). మోనమున (చెడ్డ కోపముతో) నిన్ను తిట్టీ తిట్టీ నీ చేతిలో మోక్షం పొందినాడు ఇంకొకడు (శిశుపాలుడు).

సర్వావస్థలయందు నిన్నే తలంచి (ధ్యానించి) తక్కిన ఆలోచనలను విడనాడి ఒకడు మహోన్నతుడైనాడు పరమ భాగవతోత్తముడైనాడు (శుకమహర్షి). ఇంకొకడు తతి (భోగ లాలసుడై) నారాయణా అని నీ నామము కూడ తలవక అంత్యకాలంలో తన కొడుకు కోసం అలమటిస్తూ వాడిపేరు నారాయణా అని పలికి విష్ణులోకం పొందాడు (అజామీళుడు). భక్తితో నీ ఆజ్ఞ పాలించి నీ పనులన్నీ చేసిపెట్టి ఇంకొకడు నీవాడయ్యాడు (ఉద్ధవుడు). ఎప్పుడూ నీచేత వూడిగము చేయించుకొని నీ సఖుడై నిన్ను పొందాడొకడు (అర్జునుడు).

ఓ పరాత్పరా! కొందరు నీ కౌగిలిలో సంభోగ సుఖమిచ్చి ఘనతకెక్కేశారు. (గోపికలు). సరే, వారంతా యుక్తాయుక్త జ్ఞానం వున్నవారు. ఆ జ్ఞానం కూడా లేని కొన్ని నిన్ను తమవెంట తిప్పుకొని మేలు పొందాయి (రేపల్లెలోని ఆవులమందలు). దాగక (మాయా మర్మంలేని) శ్రీవేంకటేశ్వరా! నీ సన్నిధిలో వున్నా వుండకపోయినా మాగి (పరితపించి) నిన్ను ధ్యానించే మనస్సే గుఱుతు(ఉత్కృష్టమైనది).

## 6-48

### మున్నుడి

అన్నమాచార్యులవారి ఈ కీర్తన తేలిక అని భ్రమింపజేసే బహుజటిలమైన కీర్తన. అసలు వుండాల్సిన మెలిక అంతా పల్లవిలోనే ఉన్నది. అన్నమయ్య భాషా పటిమ నేమని వర్ణించను? సంకుచేతి నన్ను నీవు జట్టి గొంటి చాలదా? అంటే... యేనుగు గాచిన వాడ యేనుగాదటే? అంటే.. చీకటి నల్లనిమేని చెలువుడను, అంటే... వేకపు బిరుదు మీద వేయకు చేయి, అంటే... ఇలా అన్నీ సందేహాలే...

**మ॥ "గురుతౌ కొండల గుబ్బలందు తరుణుల్ కోరాదిబోయేరటే**
**విరివై ఆవులగాచినాడ గిరులన్ వెన్నుండ నేగానటే?**
**అరయన్ చేతిని కంబుకంఠి! వినవే అందాల శంకున్నదే**
**కరినే గాచితి తొల్లి, మాధవుడ నేగానా?" యనెన్ అన్నయున్.**

***కోరాదిబోవుట=చెడతిరుగుట**

**రాగం : ముఖారి**

కొండల గుబ్బల నాలో గోరాది గొనేవు
కొండల నావుల గాచిన కోడెకాడగాన ॥కొండల॥

వంకల కురులదాన వద్దు నే నీకు మూడు
వంకల వెంట తిరిగేవాడగాన
సంకు మెడదాన నీతో సరివచ్చేనా
సంకు చేతి నన్ను నీవు జట్టి గొంటి చాలదా ॥కొండల॥

యేనుగు నడపుదాన నేలనే నీకు తొల్లి
యేనుగు గాచిన వాడ యేనుగాన
మీను కవగంటిదాన మెచ్చేవా నన్ను మేటి
మీననై జలధిలో మెరసినవాడను ॥కొండల॥





చీకటి తురుముదాన చేరకు నన్ను
చీకటి నల్లని మేని చెలువుడను
వేకపు బిరుదు మీద వేయకు చేయి
వేకమైన భూమిమోచే వేంకటవిభుడను ॥కొండల॥

**భావామృతం :**

ఓ భామినీ! నీవు కొండల, గుబ్బల (గుట్టల) లో నాతోన్ "కోరాది గొనేవు" (దుమ్ము రేగేటు చెడ తిరుగుతున్నావు)... అది నీకు అంత తేలికగా కుదిరేపనియేనా? ఆడువారు సుకుమారులు నీలాంటి వారివల్ల ఈ కొండలలో తిరుగుట కాదు. అయితే నేనూ సామాన్యుడను కాను. కొండలలో ఆవులను కాచిన కోడెవయసు చిన్నవాడను అంటే కృష్ణమూర్తిని.

ఉంగరాల జుట్టు వున్న ఓ తరుణీ! నేను మూడు వంకల వెంట తిరిగే వాడనే (ముల్లోకములలో తిరుగుతుండే జగన్నాథుడనే), నన్ను తక్కువగా అనుకోవద్దు. సంకు మెడదాన! (శంఖమువంటి మెడ గలిగిన సుందరీ!) నేను నీకు సరితూగుతాను యెందుకంటే... శంఖము చేతిలోగల నన్ను నీవు "జట్టిగొంటి చాలదా" (స్వాధీనం చేసికొన్నావు అది చాలదా?)

'కరిగమన'లని స్త్రీల నడకను మదగజపు నడకతో పోల్చెదరు. అటువంటి ఏనుగు నడక గలదానా! పూర్వం భూలోకంలో గజేంద్రుని రక్షించిన వాడను నేను కాదటే. మీనుకవగంటిదానా! (చేపల జంట వంటి కన్నులు గలదానా!) నన్ను మెచ్చుకొంటావా, యెందుకంటే నేను సముద్రంలో పెద్ద మత్స్యమునై శోభిల్లితిని కదటే.

చీకటి తురుము దానా! (చీకటి వలె నల్లగా వున్న సిగ కొప్పు కల చిన్నదానా!) నా దగ్గరకు రాకు (వస్తే... తట్టుకోలేను). యెందుకంటే నల్లని చీకటి వంటి శరీరంగల నీ సఖుడను నేనే సుమా! ఓ సుందరీ! నా వేకపు బిరుదు మీద (నా ఎత్తైన పిరుదులమీద) నీవు చేయి వేయవద్దు. ఎందుకంటే నేను వేకమై (విశాలమైన) భూమిని మోసినవాడను. (అది వరాహముగా ఆయన చేసిన పని అదే కదా!) (మున్నుడిలోని సందేహాలు తీరినవా?)

(గమనిక : వేకపు బిరుదు మీద వేయకు చేయి... అనే పదంలో బిరుదు అంటే శౌర్యము కాదు, పిరుదు అని నా ఊహ...)

## 6-49

### మున్నుడి

తన తండ్రి అన్నమాచార్యులవారి అడుగు జాడలలో నడచి, ఏడుకొండలవాడి దయను పొందిన ధన్యజీవి పెద తిరుమలాచార్యులవారు. శ్రీవేంకటేశ్వరునిపై మనకు ప్రేమ కలుగవలెనంటే ఆ స్వామికి మనపై దయకలుగవలసిందే. లేకపోతే... ఎన్నిసార్లు తిరుమల దర్శించినా "తిరుమలయ్య" కనబడడు స్వామి విగ్రహమే కనబడుతుంది. శ్రీహరి దర్శనము, అనుభవము, కలుగవలెనంటే స్వామి శరణ్యముతో కైంకర్యము చేసికొని సర్వమూ ఆయనే అని భావించాలి. అదే పట్టినవారల భాగ్యము. ఈ రహస్యం తెలిసితే (తెలియుటకు) గుర్తులివి... అని చెబుతున్నారు.

**కం॥ పట్టిన వారల భాగ్యము**
**యిట్టిదె యని కీర్తనంబు నింపుగ పాడెన్**
**దిట్టగు పెద తిరుమల కవి**
**గుట్టది తెలిసినను యివియె గురుతులు యనియెన్.**

**రాగం : మలహరి**

పట్టిన వారల భాగ్యమిదే
గుట్టు తెలిసితే గురుతులివి ॥పట్టిన॥

కామధేనువును కల్పవృక్షమును
దామోదర నీ దర్శనము
భూమీశత్వము భువనేశత్వము
సామజవరద నీ శరణ్యము ॥పట్టిన॥

పరుసవేదియును పరమైశ్వర్యము
హరినిను గొలిచే అనుభవము
నిరత భోగములు విధి విధానములు
గరిమ మెరయు మీ కైంకర్యములు ॥పట్టిన॥





నిండు భోగములు నిత్య శోభనము
కొండలయ్య నీ గుణకథలు
అండనె శ్రీవేంకటాధిప సర్వము
మెండు కొన్నదిదె మీ కరుణ ॥పట్టిన॥

**భావామృతం :**

ఇదె (ఈ శ్రీవేంకటేశ్వరుని సేవ) పట్టిన వారల భాగ్యము (ఎవరైతే చేబడతారో వారికి అదే మహద్భాగ్యము). ఈ గుట్టు తెలిసితే (తెలియుటకు) గుర్తులు ఇదిగో ఈ చెప్పబోవునవే.

ఓ దామోదరా! నీ దర్శనమున్నదే... అది కామధేనువు, కల్పవృక్షము తమ స్వంతమైనంత భాగ్యప్రదము. కామధేనువు కోరుకున్న దేనినైనా అనుగ్రహిస్తుంది. కల్పవృక్షము అనంతమైన సిరిసంపదలనిస్తుంది. ఈ రెండూ క్షీరసాగరమథనంలో పుట్టాయి. దేవలోకంలో ఉంటాయి. ఓ సామజవరదా! (గజేంద్రుని రక్షించిన శ్రీహరీ! నీ శరణాగతి సార్వభౌమత్వము కంటే సర్వలోకాధిపత్యము కంటే, మేలైనది. ఎందుకంటే నీ శరణాగతి యెప్పుడూ తోడు నీడై కాపాడుతుంది. తక్కిన రెండూ ఇవ్వాళ ఉంటాయి, రేపు పోతాయి. "కారే రాజులు రాజ్యముల్ గలుగవే" అని ఏనాడో పెద్దలు చెప్పారు కదా!

పరుసవేది అనే దానితో ఏ వస్తువును తాకినా అది స్వర్ణము అయిపోతుంది. పరమైశ్వర్యము అంటే గొప్ప ఐశ్వర్యమును ప్రసాదించునది. ఈ రెండూ ఉన్నవాడు ఎంత శ్రీమంతుడో వేరే చెప్పాలా? కాని ఓ శ్రీహరీ! నిన్ను కొలిచిన వారికి కలిగే నీ అనుభవము ముందు అవి ఏపాటి సంపదలయ్యా? నిరత భోగములు (మిక్కిలి ఆసక్తితో నీకు చేయు భోగములు) సేవా విధి విధానములు, మేము నీకు చేయు కైంకర్యములే కదా!

ఓ ఏడుకొండలవాడా! నీ భాగవత గాథలు, నీ గుణగణ, సంకీర్తన మాకు సమస్త భోగములను నిత్య వైభవములను సమకూర్చును. ఓ శ్రీవేంకటేశ్వరా! మీ కరుణ, అండదండలూ వున్నవారికి సర్వమూ మెండుకొన్నది (అతిశయించును). ఇది తథ్యము తండ్రీ!

**6-50**

## మున్నుడి

శ్రీ మహావిష్ణువు సేనాధిపతియైన విష్వక్సేనుడిపై అద్భుతమైన కీర్తన చెబుతున్నారు అన్నమాచార్యులవారు. ఇదిగో అచ్యుతుని సేనాపతి వస్తున్నాడు. ఓ అసురులారా! పారరో (పారిపోండ్రా) పది దిక్కులకు - అని హెచ్చరిస్తున్నారు. శ్రీవేంకటేశ్వరుని బ్రహ్మోత్సవాల సమయంలో అన్నమయ్య చెప్పిన అజరామరమైన కీర్తన ఇది. ఆనాటి తిరుమలేశుని వైభవాన్ని కళ్లకు కట్టుతున్నది. అవునా?

**కం॥ కనుడీ హరి సేనాపతి**
**మన విష్వక్సేనుడంట మాధవు వెంటన్**
**గునగున పారరొ అసురులు**
**ఘనుడౌ అన్నయ్యపాడె కడు వేడుకతో.**

**రాగం : మోహన**

అదెవచ్చె నిదెవచ్చె నచ్చుతు సేనాపతి
పది దిక్కులకు నిట్టె పారరో యసురులు ॥అదె॥

గరుడధ్వజం బదె ఘన శంఖరవమదె
సరుసనే విష్ణుదేవు చక్రమదె
మురవైరి పంపులవె ముందరి సేనలవె
పరచి గగ్గోల కాడై పారరో దానవులు ॥అదె॥

తెల్లని గొడుగులవె దేవదుందుభులు నవె
యెల్ల దేవతల రథా లింతటా నవె
కెల్లు రేగీ నిక్కి హరి కీర్తి భుజములవె
పల్లపు పాతాళాన బడరో దనుజులు ॥అదె॥





వెండిపైడి గుదెలవె వెంజామరములవె
మెండగు కైవారాలు మించినవవె
దండి శ్రీవేంకటపతి దాడి ముట్టినదె యిదె
బందు బండై జజ్జరించిపారరోదైతేయులు ॥అదె॥

**భావామృతం :**

ఓ రాక్షసులారా! అదిగో వచ్చేస్తున్నాడు. ఇదిగో వచ్చేస్తున్నాడు. అచ్యుతుని సేనాధిపతియైన విష్వక్సేనుడు, అతడే. పది దిక్కులలో యెక్కడికి పారిపోతారో, ఇట్టే పారిపోండ్రా.

అదిగో చూశారా శ్రీహరి యొక్క గరుడధ్వజము. మీకు ఘనమైన పాంచజన్యమను శంఖము చేసే శంఖారావం వినబడుచున్నదా? అదిగో సరుసనే (ఆ ప్రక్కనే) విష్ణు దేవుని సుదర్శన చక్రము ఎలా మిఱుమిట్లు గొల్పుచున్నదో చూడండి. మురవైరి అయిన శ్రీకాంతుని పంపులు (పురమాయింపులు) అవిగో. రక్షణగా ముందున నడచి వస్తున్న దేవతల సేన అదిగో. ఓ దానవులారా! మీరంతా గగ్గోలు పెట్టి పారిపోండి. మీ ప్రాణాలు కాపాడుకోండి.

అదిగో ఆ కనబడుతున్న తెల్లని గొడుగులు నారాయణుని రాకను సూచిస్తున్నాయి. ఢమఢమా మ్రోగుతున్న దేవదుందుభుల భేరీ వినబడుచున్నది కదా! బారులు తీరి దేవతా ప్రముఖుల రథాలు ఒకదాని వెనుక ఒకటి వస్తున్నాయి. అందుచేత కెల్లురేగి (దారినిండా దుమ్మురేచి నానాగందర గోళంగా ఉన్నది). శ్రీహరి ఆగమనాన్ని సూచిస్తూ ఆయన భుజకీర్తులు ప్రస్ఫుటంగా నిక్కి (అతిశయముగా) కనిపిస్తున్నాయి. ఓ దనుజుల్లారా! మీ స్థావరమైన పల్లపు లోతైన పాతాళమునకు పారిపోండి. మీ పిక్కబలం చూపించండి.

అదిగో బంగారు, వెండి 'గుదెలు'. ('గుదె' అంటే నాలుగు మూరలు పొడవున్న దండము. నేటి కాలంలో వీటిని లాఠీలు అంటున్నాం. కానీ లాఠీ పొడుగు ఆనాటి గుదె పొడుగులో సగమే ఉంటుంది). అవిగో వింజామరలు. అదిగో అసంఖ్యాకమైన "కైవారాలు" (వంది మాగదులు... వీళ్లు విజయీభవ అని ఉత్సాహపరుస్తుంటారు). అదిగో శ్రీవేంకటేశ్వరుని 'దండి దాడిముట్టి' (దండెత్తి ముట్టడించు సైన్యము). ఇక బందుబండై (ఆకతాయితనం అరిగిపోయి) ఓ దైత్యులారా! జజ్జరించి పారరో... (కకావికలై పారిపోండి).

**6-51**

## మున్నుడి

భజనవలె కొనసాగే అన్నమాచార్యులవారి కీర్తనను ఆలకించండి. శ్రీహరి శరణాగతిలో మేము పొందే సుఖము అంతులేనిది. మాకిది చాలును. ఇదిగాక వేరే ఏ సిరిసంపదలైనా మాకు అనవసరం. మేము వాటిని ఒల్లము (ఒప్పుకోము) అని తెగవేసి చెబుతున్నారు. మాకు ఆదిదేవుడైన శ్రీహరి తప్ప అన్యుల శరణ్యము వద్దు. మేము ఒప్పుకోము. అన్యులను మేము నుతించము. శ్రీవేంకటేశ్వరుడే మాకు గతి. ఇంకనే గతిని మేము ఒల్లము అంటున్నారు. అదండీ భక్తి అంటే.

**ఉ॥ "ఇందున వున్నదే సుఖము యింతియ చాలును వొల్లమన్యముల్**
**ఇందుకు వేరుయైన సిరులేమిటికిన్"? యనె అన్నమార్యుడున్**
**"పొంది హరిన్ గడించు కడుపుణ్యము చాలదె!!" మేటికీర్తనన్**
**విందుగ జెప్పెనీ భజన వేంకటనాయక! చిత్తగింపుమా.**

**రాగం : దేశ్**

ఇందులో నగల సుఖమింతే చాలుమాకు
నిందు వెలియైన సిరులేమియు నొల్లము ॥ఇందు॥

ఆదిదేవునచ్చుతు సర్వాంతరాత్మకుని
వేదవేద్యు కమలాక్షు విశ్వపూర్ణుని
శ్రీదేవుహరి నాశ్రిత పారిజాతుని
ఆదిగొని శరణంటి మన్యము మేమొల్లము ॥ఇందు॥

పరమాత్ము పరిపూర్ణు భవరోగవైద్యుని
మురహరు గోవిందు ముకుందుని
హరిపుండరీకాక్షు ననంతు నభవుని
పరగ నుతించితిమి పరుల నేమొల్లము ॥ఇందు॥





అనుపమ గుణదేహు నణురేణు పరిపూర్ణు
ఘనుచిరంతనుని కలిభంజను
దనుజాంతకుని సర్వధరు శ్రీవేంకటపతి
గని కొలిచితిమి యేగతులు నేమొల్లము ॥ఇందు॥

**భావామృతం :**

ఓ ప్రజలారా! దేవుడైన ఈ శ్రీహరిని ఆశ్రయించుటలో వున్న సుఖము, ఇంతమాత్రం చాలును. ఇందులో వున్న సుఖం ఇంకెందులోను లేదు. దీనికి వెలియైన (అన్యమైన) సిరులు మేము వొల్లము (ఒప్పుకోము). మాకు ఆ సిరిసంపదలు అనవసరం.

ఆదిదేవుడైన అచ్యుతునికి, సర్వాంతరాత్మునికీ, వేదముద్వారా యెరుగబడిన పద్మనయనునికి, విశ్వమంతా సంపూర్తిగా నిండియున్న శ్రీకాంతునకు, శ్రీహరికి, ఆశ్రయించిన వారికి పారిజాతవృక్షము వంటి వానికి మొదటినుండి మేము శరణుజొచ్చి యున్నాము. ఇతరమేదైనను మేము అంగీకరించము. నాకు వారక్కరలేదు.

పరమాత్ముడైన స్వామిని, పరిపూర్ణుడైన వానిని, భవరోగపీడితులైన వారికి వైద్యుడైన దేవుని, మురాంతకుని, గోవిందుని, ముకుందుని, హరిని, పుండరీకములు (కమలములు) వంటి కన్నులున్న స్వామిని, అనంతుడని పిలువబడువానిని, పుట్టుకయే లేనివాడిని, మేము కీర్తించుచుంటిమి. పరాయివారిని మేము అంగీకరించము.

అనుపమమైన సద్గుణములే దేహముగాగల వానికి, అణువణువునా రేణువు రేణువునా ఉన్న భగవంతునిని, ఘనుడైన చిరంతనుని (అనాదియైన వానిని) కలిదోషమును 'నిర్మూలించువానిని, రాక్షసాంతకుని, సర్వమును ధరించు శ్రీవేంకటేశ్వరుని చూచి మేము పూజించితిమి మాకు యే గతియూ నక్కరలేదు. ఏ వైభవమూ అక్కరలేదు. అసలు వాటిని మేము అంగీకరింపము. మాకు వద్దేవద్దు.

6-52

## మున్నుడి

అన్నమాచార్యులవారు చెప్పిన చక్కటి భజన వినండి. ఇది పెద్ద పెద్ద చరణాలున్న కీర్తన. అనేక భాగవత గాథలు తెలిస్తేగాని ఈ కీర్తన అర్థంకాదు. ఓ ప్రభూ! నీ మహిమలను మాయను తెలియుట అంత సులువు కాదు. నీవు చ్యుతి (అంతము) లేని దేవదేవుడవు. వామనునిగా బలినణచిన త్రివిక్రముడవు. క్రీడికి విశ్వరూపదర్శనంగావించిన శ్రీకృష్ణపరమాత్మవు. శ్రీసతీవల్లభుడవు. శ్రీవేంకట నిలయుడవు. నీదాసులందరికీ పక్షపాతములేక పదువలందించు ఆశ్రితవత్సలుడవు అంటున్నారు.

**ఆ.వె.॥ ఏమి చిత్రమయ్య! యేవిధి దెలిసేము**
**నీదు మాయ మేము నీమహిమలు**
**అన్నమయ్య పాడెనద్భుత భజనను**
**ఆలకింపుడింక హరియు మురియు.**

**రాగం : భాగేశ్వరి**

ఏమి చిత్రం బేమి మహిమలు యేమి నీమాయా వినోదము
వామనాచ్యుత నిన్ను దెలియగ వసుధలో మాతరములో ॥ఏమి॥

సకల లోక నివాస నాయక శౌరి మురహర నరహరీ
ప్రకటమాయెను నీగుణంబులు పాలముచ్చవటంచును
వికటముగ నిను గన్నతల్లి నీవదనంబు మీటిన
యఅకట హోయని నోరు దెరచిన యందులోకములుండెను ॥ఏమి॥

శ్రీసతీపతి దైత్య దానవ శిక్ష కామర రక్షక
రాసికెక్కెను బండి రొప్పిన రవ్వలూ నీ సేతలు
మోసమున నర్జునుడు నీలో ముందుగానక మాటలాడిన
వాసవార్చిత విశ్వరూపము వసుధ జూపితి వవుదువు ॥ఏమి॥





నమో నమో శ్రీవేంకటేశ్వర నారదప్రియ భక్తవత్సలు
విమలమగు నీ దాసులిదె నీ విద్యలెల్లా జూచిరి
సుముఖులై కరిశబరి బలియును శుకధ్రువాదులు నిన్ను గొలువక
సమత వున్నత పదవులొసగితి సర్వమిందును గంటిమి ॥ఏమి॥

**భావామృతం :**

ఓ ప్రభూ! నీ మహిమలను నీ మాయా వినోదమును మేము గుర్తించగలమా? అవి ఎంత చిత్రమైనవి. నీవు చ్యుతి (నాశనము) లేని, వామన మూర్తివనీ, వసుధలో నిన్న తెలిసిన వారెవరు లేనేలేరు.

సర్వలోకములు నీలోనే వసించుచున్నవి. నీవు శౌరివి. మురాసురుని నిర్మూలించినవాడవు. నృసింహమూర్తివైన నీ గుణములు అసమానమైనవిగా ప్రకటింపబడినవి. కాని నీ కన్న తల్లియైన యశోద నిన్ను పాలముచ్చు (పాలదొంగ) వలె వికటముగా (తప్పుగా) అర్థం చేసుకొని నిన్ను నోరు తెరచి చూపించమన్నది. నీవు హోయని నోరు దెరచి అందు లోకములన్నియూ చూపించితివి.

ఓ శ్రీనాథా! నీవు దైత్యులను దానవులను శిక్షించు సురరక్షకుడవు. నీవు బండిని విరిచి శకటాసురుని వధించితివి. నీసేతలు (లీలలు). ప్రఖ్యాతములైనవి. మోగుమున (మాయావిచలితుడై) అర్జునుడు నీతో సంవాదించెను. అతనిని రణోన్ముఖుని చేయుటకు విశ్వరూపమును వసుధలో చూపించినవాడవు. నీవు వాసవార్చితుడవు (దేవేంద్రునిచే పూజింపబడువాడవు).

నారదునికి అత్యంత ప్రీతిపాత్రుడైన ఓ భక్తవత్సలా! నీకు వందనములు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీకు వందనములు. నీదాసులు నిర్మలులైనచో నీ మహిమలను గుర్తించకలరు. నీకు సుముఖులైన గజేంద్రుడు, శబరి, ధ్రువుడు, బలిచక్రవర్తి, శుకమహర్షి నిన్ను కొలిచి ధన్యులయ్యారు. సమానముగా వారందరికీ ఉన్నత పదవులనొసంగితివి. అట్టి దేవా! సర్వమూ ఇందులోనే కనుగొంటిమి.

**6-53**

## మున్నుడి

బాగా తరచి ఆలోచిస్తేనే గాని అర్థంగాని అధ్యాత్మకీర్తనను చెబుతున్నారు అన్నమాచార్యులవారు. శరీరం అనే వూరికి తొమ్మిది దారులున్నాయట. వాటిలో 'పాపాలు' అనే తల నరికేసే వాళ్ళు తిరుగుతుంటారట. కొన్నాళ్ళు మన్మధుడనే రాజు ఆ వూరిని యేలి, కోపంఅనే ప్రధానమంత్రితో పాలన చేస్తే ఇంద్రియాలనే వాళ్ళు కాపులై కూడా జ్ఞానధనాన్ని కొల్లగొట్టారట. చిత్తమనే సేనాధిపతి చింతలనే సైన్యాన్ని విషయలోలురుగా చేశాడట. కోరికలనే బందిపోటు దొంగలు పెరిగిపోయారట. ఇక ఇలా లాభం లేదని వేంకటేశ్వరుడు జీవుని రాజుని చేసి పరిస్థితి చక్కదిద్దాడట..... ఆలోచించండి, ఎంత జ్ఞానమున్నదో..

**ఉ॥ కాయమనేటి వూరికిని గంతలు తొమ్మిది యందునందునన్**
**పాయక త్రచ్చులాడిరట పాప తలారులు, కాముదేలికౌ**
**పోయెడి జవ్వనంబమరి యున్నది బత్తెము, జీవినెంచుచున్**
**మాయల వేంకటేశ్వరుడు పాలనజేసెను అన్నమయ్యనెన్.**

**రాగం : బౌళి**

కాయమనే వూరికి గంతలు తొమ్మిదియాయ
పాయక తిరుగాడేరు పాపపు తలారులు ॥కాయమ॥

కాముడనియెడి రాజు గద్దెమీద నుండగాను
దీము గోపపు ప్రధాని దిక్కులేలీని
కోమలపు జ్ఞానమెల్లా గొల్లబోయె నాడనాడ
గామిడులై రింద్రియపు గాపులెల్లా నిదివో ॥కాయమ॥





చిత్తమనే దళవాయి చింతలనే పౌజు వెట్టి
యిత్తల విషయములు యెన్నికిచ్చిరి
తుత్తుమురై కోరికెల దొండెము రేగగ జొచ్చె
జొత్తుల వెరగుపడి చూచీ బుట్టుగులు ॥కాయమ॥

బలు సంసారమనేటి భండారము ఘనమాయ
కలదీగి జవ్వనపు కైజీతము
యిలలో శ్రీవేంకటేశుడింతలో జీవుడనేటి
బలువుని రాజు జేసి పాలించె నన్నును ॥కాయమ॥

**భావామృతం :**

కాయము (శరీరము) అనే వూరికి తొమ్మిది కంతలు (దారులు) వున్నాయి. ఈ వూరిలో పాపులైన తలారులు (తలనరికి వేసేవారు) తిరుగుతూ వున్నారు.

ఆ నగరానికి సింహాసనాధిష్టుడైన రాజు కాముడు (మన్మధుడు). వానికి "దీము కోపము" ( ప్రజ్వరిల్లే ఆగ్రహం) అనే ప్రధానమంత్రివున్నాడు. వాడు దిక్కులన్నీ పరిపాలిస్తున్నాడు. దానికి ( ఆ నగరానికి), కామిడులైన (కోర్కెలతోనిండిన) ఇంద్రియాలు కాపువారై (రక్షకులై) వున్నారు. రోజురోజుకీ కొద్దికొద్దిగా ఆ నగరాన్నించి కోమలమైన జ్ఞానం (చక్కటి జ్ఞానము) కొల్లగొట్టబడింది. అదిగో ఆ వైనము చిత్తగించండి.

ఆ నగరానికి దళవాయి (సేనాధిపతి) చిత్తము (మనస్సు). దానికి "పౌజుపెట్టిన" సైన్యమే చింతలు (మనస్సు కలిగించే ఆలోచనలు). ఆ సైన్యం వాళ్ళ అసలు పని మానేసి, విషయసుఖాల మీద ఆసక్తితో వాటికి ప్రాధాన్యత నిచ్చారు. అప్పుడు ఆ మనస్సులోని కోరికలు, తుత్తుమురై (పొడిపొడి అయిపోయ) దొండెము రేగగ జొచ్చె (చెలరేగాయి). ఆ మనస్సు దాని ఫలతంగా రక్తసిక్తమైన జన్మలనుపొంద వలసి వచ్చింది.

ఈ విధంగా బలవత్తరమైన సంసారమనునట్టి బొక్కసాన్ని (ధనాగారాన్ని), యౌవనము అనే ధనంతో నింపుతూ అంతమైపోతున్నారు జీవులు. దీనికి అంతమెప్పుడు? అంతమనేది ఉన్నది. భయపడవద్దు. శ్రీవేంకటేశ్వరుడు ఈ జీవిపై దయదలచి బలమైన జీవునియెన్నుకొని వాడిని మిగతా జీవులకి రాజును చేస్తాడు.

**6-54**

## మున్నుడి

పరమాత్ముని సేవించుటకు పలుదార్లున్నా నవవిధ భక్తి జగత్ప్రసిద్ధమైనది. అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో ఆ నవ విధ భక్తి వలన కలిగే మేళ్ళను వివరిస్తున్నారు, తనశైలిలో. ఏ సుఖమైనా కొంత కాలపరిమితి వుండేదే. ఒక్క జనార్దనుని సేవవల్ల కలిగే సౌఖ్యమే కాలపరిమితిలేని సంతతసౌఖ్యము అని అంటున్నారు. పైగా ఈ సౌఖ్యముతో పాటు ముక్తి కూడా లభిస్తుంది. ఇక ఇంతకంటే గొప్పది ఇంకొకటేమివుంటుంది అంటున్నారు. శ్రీవేంకటోత్తముని కొలువు కంటే వుత్తమైనది లేదంటున్నారు.

**చం॥ ఘనమికలేదు శ్రీహరిని గట్టిగ నమ్ముచు సేవచేయుడీ**
**వనజభవాది దేవగణవందితు శౌరిని ఆ జనార్దనున్**
**చనువున కొల్వుడీ అదియె సంతతసౌఖ్యము అన్నమయ్యనెన్**
**తను గొని వేంకటోత్తముని దాస్యము జేసెను కీర్తినెంచుచున్.**

**రాగం : సువటి**

ఇంతకంటే ఘనమికలేదు
సంతత సౌఖ్యము జనార్దనుడే ॥ఇంత॥

భయనివారణము పరమాత్ముని నుతి
జయకారణము ఈశ్వర చింత
అయుత పుణ్యఫల మచ్యుతుని సేవ
క్రియతో నిజమెరిగిన వారికిని ॥ఇంత॥

కర్మహరము శ్రీకాంతుదరిశనము
ధర్మరాసి మాధవు శరణు
ఆర్మిలి సంపద లనంతుని తగులు
నిర్మలముగ పూనిన దాసులకు ॥ఇంత॥





ఆగమోక్త మీ హరి కైంకర్యము
భోగము విష్ణుని పూజయిది
యోగము శ్రీ వేంకటోత్తముని కొలువు
బాగులు నేర్చిన ప్రపన్నులకును ॥ఇంత॥

**భావామృతం :**

ఓ మానవులారా! జనార్దనుడే పరమాత్ముడు. ఆయనను సేవించుట, సర్వకాల సర్వావస్థలయందు సౌఖ్యప్రదము. ఇంతకంటే ఘనమైనది మరి ఇంకొకటి లేదు.

ఆ పరమాత్ముని నుతించుట వలన భయము నివారణమగును. ఈశ్వరుడైన ఆయన చింత (ఆలోచన) ఎప్పుడూ జయమునకు హేతువైయున్నది. అచ్యుతుని సేవ ఆయుత (సిద్ధించిన) పుణ్యఫలము. క్రియతో (పూనుకొని) నిజము తెలుసుకొన్నవారికి ఈ సత్ఫలితములు తప్పక కలుగుతాయి.

శ్రీకాంతుని దర్శనమాత్రము చేతనే పూర్వ, ప్రస్తుత కర్మలఫలము నశిస్తుంది. మాధవుని శరణాగతి అత్యుత్తమ ధర్మము. అనంతుని పై తగులు (ఆసక్తి) ఆర్మిలి సంపద (అతిశయించిన సిరి). నిర్మలులై పూనికతో ఆ దామోదరుని దాసులైనవారికి ఇవియన్నియు సంప్రాప్తిస్తాయి. సార్థకతనిచ్చేది శౌరి శరణాగతి మాత్రమే.

శ్రీహరికి కైంకర్యము (ఊడిగము) చేసై అది వేదవిదితమే. విష్ణుదేవునికి చేసే పూజ దివ్యవై భోగములను పలు భోగభాగ్యములను ప్రసాదిస్తుంది. శ్రీ వేంకటగిరిపైనున్న ఆ పురుషోత్తముని కొలువులభించవలెనంటే అది గొప్పయోగము. ఇందుకు సందేహం లేదు. ప్రపన్నులై (భక్తితో శరణాగతులై) బాగులు నేర్చిన వారికి "(యుక్తాయుక్త విచక్షణ నెరిగిన వారికి)" సర్వమూ సిద్ధిస్తుంది అని గ్రహించండి.

6-55

## మున్నుడి

వీనుల విందైన పెండ్లి పాటను వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. మనం కూడా స్వామి పెండ్లి స్వయంగా చూస్తున్న అనుభూతి కలుగుతుంది, ఈ కీర్తనవింటే. అలమేల్మంగమ్మ శ్రీవేంకటేశ్వరులు కదిసి (దగ్గరై) తమకముతో మైమరచి వున్నారట. అంకెల పానుపు మీద అమరించరో అని పవళింపు సేవతో ముగించారు. అన్నమాచార్యులవారి ప్రత్యేకత చూడండి, ముహూర్తం వేళ యేదో సరిగా కనుక్కోండి వారు వీరు చెప్పిన మాటలు విని మోసపోకండి అంటున్నారు.

**కం॥ అదిగో శ్రీవేంకటపతి**
**అదిగో అలమేలుమంగ అతి తమకముతో**
**కదిసి తరలిరనె బెండ్లికి**
**అదనుగ మన అన్నమయ్య హరి అలరంగన్.**

**రాగం : సాళంగం**

అదె శ్రీ వేంకటపతి అలమేలు మంగయును
కదిసివున్నారు తమకమున బెండ్లికిని ॥అదె॥

బాసికములు గట్టరో పైపై దంపతులకు
శేసపాలందియ్యరో చేతులకును
సూసకాల పేరటాండ్లు సోబాన బాడరో
మోసపోక యిట్టే ముహూర్తమడుగరో ॥అదె॥

గక్కునను మంగళాష్టకములు చదువరో
తక్కక జేగట (జేగటి) వేసి తప్పకుండాను
నిక్కి నిక్కి చూచేరదే నెరి దెర దియ్యరో
యొక్కటైరి కొంగుముళ్ళు వొనరగ వేయరో ॥అదె॥





కంకణ దారములను కట్టరో యిద్దరికిని
సుంకుర బెండ్లి పీట గూచుండబెట్టరో
లంకె శ్రీ వేంకటేశు నలమేల్మంగను దీవించి
అంకెల బానుపు మీద నమరించరో ॥అదె॥

**భావామృతం :**

ఓ ప్రజలారా! అదిగో చూడండి శ్రీ వేంకటేశ్వరుడు అలమేల్మంగమ్మ వివాహమాడుతున్నారు. వారిద్దరు పెండ్లి కోసం తమకముతో (మైమరపుతో) కదిసి (దగ్గరయై) వున్నారు.

దంపతులిద్దరికి పైపై (నుదుళ్ళపై) బాసికములను కట్టండి. వారిద్దరి చేతులకు శేసపాలు (ఒకరు త్రాగిమిగిల్చిన పాలు ఇంకరికి)అందించండి. సూసకాలు (తలలో ధరించే బంగారు తిరుగుడు బిళ్ళ) ధరించిన పేరంటాడ్లు మంగళగీతములను పాడుచున్నారు. ఈ హడావిడిలో సరియైన ముహూర్తం సమయం యేమిటో కనుక్కోకపోతే మోసపోతారు. కాబట్టి జాగ్రత్తపడండి. సమయం మించిపోయాక వస్తే నిరాశ తప్పదు.

పురోహితులు గక్కున (వెంటనే) మంగళాష్టకములు (మంగళాశాసనములు) చదవండి. తక్కక (విడువకుండా) చేతికి చేగట్టి (చేతికట్టు తోరణము) కట్టండి. వధూవరులు నిక్కినిక్కి చూసుకొంటున్నారు. ఇద్దరూ ఆ పైన కొంగూకొంగూ ముడివేయుట చేత పులకరించి పోతున్నారు.

వధూవరులిద్దరికీ కంకణములను ధరింపజేయండి. సుంకుర (ధవళక్షతలు) చల్లి, వారిని పెండ్లిపీటల మీద కూర్చొన బెట్టండి. వధూవరులు అయిన అలమేల్మంగ శ్రీ వేంకటేశ్వరులు ముడిపడ్డారు. ఓ పెండ్లి పెద్దలారా! ఈ దంపతులను ఆశీర్వదించి జంటగా వీరిని పానుపుపై చేర్చండి. మీ జన్మతరించిందని ఈ లక్ష్మీనారాయణులకు నమస్కరించండి.

## 6-56

## మున్నుడి

అహోబలంలో నెలకొన్న లక్ష్మీనృసింహుని కీర్తిస్తున్నారు, అన్నమాచార్యులవారు. కంభము (స్తంభము) న ఆవిర్భవించి హిరణ్యకశిపుని, వాడి విచిత్రమైన వరాలు పొల్లుబోకుండా, సంహరించి, ప్రహ్లాదుని భయమునివారించి, లోకముల పీడను తుదముట్టించిన అసురాంతకునికి జయ జయధ్వానములు పలుకుతున్నారు. "ఓ జనులారా! మన భయములన్నీ వదిలిపోయాయి. ఇప్పుడు మనం బ్రతికిపోయాం" అని అంటున్నారు. ఇహపరములు రెంటినీ ఇచ్చే స్వామి ఇందును, అందును (అహోబలంలో, తిరుమలలోను) విహరిస్తున్నాడట.

**ఆ.వె॥జయము జయము యింక జనులాల! మనకెల్ల**
**భయములన్ని వాసె బ్రతికితిమనె**
**తానహోబిలమున శ్రీనరసింహుని**
**అన్నమయ్య కొలిచె సన్నుతించి.**

**రాగం : సావేరి**

జయము జయము ఇక జనులాల
భయములు వాసెను బ్రతికితి మిపుదు ॥జయము॥

ఘన నరసింహుడు కంభమున వెడలె
దనుజులు సమసిరి ధర వెలసె
పొనిగె నధర్మము భూభారమడగె
మునుల తపము లిమ్ముల నీడేరె ॥జయము॥

గరిమతో విష్ణుడు గద్దెపై నిలిచె
హిరణ్యకశిపుని నే పడచె
అరసి ప్రహ్లాదుని అన్నిటా మన్నించె
హరుదును బ్రహ్మయు అదె కొలిచేరు ॥జయము॥





అహోబలేశుడు సిరినంకమున ధరించె
బహుగతి శుభములు పాటిల్లె
ఇహపరము లొసగె నిందును నందును
విహరించెను శ్రీవేంకటగిరిని ॥జయము॥

**భావామృతం :**

ఓ ప్రజలారా! ఇకపై మనకు జయము నిశ్చయము. జయము కలుగుటతో బాటు మన భయములు కూడా తొలగిపోవుటచే మన మందరము బ్రతికిపోయాము.

ఘనుడైన నృసింహుడు స్తంభము నుండి వెలవడినాడు . రాక్షసులంతా నశించారు ధరవెలసె (భూమి చైతన్యవంతమైనది). అధర్మము పొనిగె (నశించినది). భూ భారము అడగె (తగ్గిపోయినది). మునుల తపస్సులన్నీ ఇమ్ముల ఈడేరె (ఫలించినవి). జయములు స్వంతమైనవి.

శ్రీ మహావిష్ణువు నృసింహుడై సింహాసనము నధిష్టించినాడు. హిరణ్యకశిపునే పడచే (ఇక్కడ జయించె అను భావముతో చెప్పబడింది). తన దాసుడైన ప్రహ్లాదుని అన్ని విధములామన్నించి అభయమిచ్చాడు. అదిగో శంకరుడు, బ్రహ్మ మొదలైన దేవతలంతా ఆయనను సేవిస్తున్నారు.

ఈ అహోబల నృసింహుడు సిరిని (లక్ష్మీదేవిని) తన అంకముపై (తొడమీద) ధరించె (కూర్చొన బెట్టుకొనియున్నాడు). అందుచేత ఆయన దాసులకు బహు విధములైన శుభములు పాటిల్లె (పొందబడినవి). ఆ స్వామి ఇందును అందును (ఈ అహోబలంలోను, అక్కడ తిరుమలలోను) ఇహపరములొసగె (సిరి సంపదలే కాక అంత్యమున మోక్షమును కూడా ఇస్తున్నాడు). ఎందుకంటే శ్రీవేంకటగిరి పై కూడా ఆయనే విహరించె (కొలువైయున్నాడు కదా!).

**6-57**

## మున్నుడి

ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు జీవులు పుణ్యము పాపము రెంటినీ చేసి తత్ఫలితంగా సుఖదుఃఖములను పొందుతున్నారు అని చెబుతున్నారు . అయితే ఎంత పుణ్యానికి ఎంత ఎక్కువ సుఖం ఎంత పాపానికి ఎంత ఎక్కువ దుఃఖం పొందుతాడు అని నిర్ణయించేది ఎవరు? ఆ పరమాత్ముడే. జీవి ఆయనతో బేరం ఆడతాడట. ఇది వారానికి ఒకసారి జరిగే 'సంత' కాదు, ప్రతిదినమూ వుండే సంత, ఈ పాపపుణ్యాలే మీ 'కొంగురొక్కం' (Money in pocket). వాటిని వెచ్చించి సుఖదుఃఖాలను కొనుక్కోండి అంటున్నారు. త్వరగా 'వెల దెంచండి' (ధరను ఏదో కాడికి నిర్ణయించేసేయండి.....రారో (రండ్రా) అంటున్నారు.

**తే॥ కొలది పుణ్యపాపంబులే కొంగుగట్టి**
**వెలను తెంచుచు సంతలో బేరమాడ,**
**వేగిరంబె రారో! యని పిలిచినాడు**
**అన్నమార్యుని కీర్తన అద్భుతమురా.**

**రాగం : బౌళి**

కొలది పుణ్య పాపాలే- కొంగురొక్కములు వెట్టి
వెలదెంచి బేరమాడ- వేగిరమే రారో ॥కొలది॥

జననాలు మరణాలు- సంసారభోగములును
అనిశము భూమి మీద-నగ్గువలు
కొనేవారు దినేవారు-కూడికూడి మూకలై
దినసంత లెక్కెనిదే-దేహులాల రారో ॥కొలది॥

అంగనల వలువల- అంగళ్ళు వెట్టిరదె
చెంగట వయసులనే-చింతల కింద
సంగతి గాయమనే- సంచుల నించుకొందము
చెంగిపోరాదు మనకు - జీవులాల రారో ॥కొలది॥





లంపటాలు సంపదలు-లలి నంబారాసులాయ
యింపుల ముంచి తలల-కెత్తుకోరో
దింపక యిందులోననే-తిరిగి శ్రీవేంకటేశు
పంపున లాభము చేరె (రీ)-ప్రాణులాల రారో ॥కొలది॥

**భావామృతం :**

ఓ జీవులారా! ఈ సంతలో బేరమాడటానికి త్వరత్వరగా రండు. మీరు చేసిన కొలది (కొద్దిపాటి) పుణ్యము, పాపము మీకు 'కొంగురొక్కం' (కొంగులో ముడి వేసి వెంట తీసికొని వెళ్ళే పైకము). దానిని వెచ్చించి, 'వెలదెంచి' (ఏదో ఒక ధర నిర్ణయించి) అవసరమైతే ఆ పైవాడితో బేరమాడటానికి రండ్రా!

ఓ దేహులారా! (దేహధారులారా!) ఇది దినసంత (రోజువారీ సంత). దీనికి మూకలై (గుంపులుగా) కొనేవారు, తినేవారు (అనుభవించేవారు) కూడికూడి (ఒకరికి తోడుగా ఇంకొకరు కలిసి ) వస్తూనేవుంటారు. చావు పుట్టుకలు, సుఖదుఃఖాలు అనిశము (ఎల్లప్పుడూ) నగ్గువలు (అతిచౌకగా దొరుకుతాయి). ఈ దినసంతలు యెక్కినవి (యెక్కువైపోయాయి). త్వరగారండి.

ఓ జీవులారా! చెంగట వయసులనే, చింతల (చింతచెట్లు) క్రింద దుకాణాలు పెట్టి, అంగనల వలపులు (స్త్రీ కామవాంఛలు) అనే సరుకు అమ్ముతున్నారు. సంగతి (దగ్గరగా వచ్చి) మీ శరీరమనే సంచులనిండా నింపుకొండి. (ఈ సంచుపాతదై చెడిపోతే ఎక్కువ సరుకుపట్టదు).పోనీ...మాకు స్త్రీ వద్దు, అని చెంగిపోదామా (తొలగి వేరే పోదాం) అంటే... అదీ సాధ్యం కాదు. మనకు వేరే గత్యంతరం లేదు. ఆ స్త్రీ కోసం పాపపుణ్యాలు చేస్తూవుండాలి. వాటి ఫలితం అనుభవిస్తూనేవుండాలి. (ఓరి దేవుడో..).

సరే..వీటితో పాటు, అంబారాసులై (కుప్పలు తెప్పలై) సంపదలు, లంపటాలు (సంబంధబాంధవ్యాలూ), యింపులు( ఇష్టాయిష్టాలు)... పీకలలోతుకు కూరుకొని పోయాడీ జీవి. ఇకమరి వీడికి దిక్కెవరు? మీరు శ్రీవేంకటేశ్వరుని దాసులైతే బేరం సాగినంత కాలమూ మంచి సరకు కొంటుంటారు. లాభాలు గడిస్తుంటారు. బేరం సాగిపోతూనే వుంటుంది. ఆ నామాలవాడి దయవున్నంత కాలం సంతోషంగానే వుంటాడు ఈ జీవి). ఓ ప్రాణులారా! ఇదింతే కాబట్టి రండి....త్వరగా రండి.

**6-58**

## మున్నుడి

నేడు దీపావళి పర్వదినము. ఈ రోజు ఈ కీర్తనకు మున్నుడి భావామృతం వ్రాయడం నా అదృష్టంగా భావిస్తున్నాను. అన్నమాచార్యులవారి ఈ కీర్తన సత్యభామ, రుక్మిణీ దేవి, శ్రీదేవి అలమేల్మంగ అందరూ హరి హృదయేశ్వరి రూపాలే అంటున్నారు. పట్టుబట్టి శ్రీ కృష్ణునితో పాటు నరకాసురుని పై యుద్ధానికి వెళ్ళి, శ్రీకృష్ణుడు మూర్ఛిల్లినాడని ఆగ్రహించి ధనస్సుబట్టి నరకుని నరికిన తరుణి సత్యభామ. ఆమె ఎవరో కాదు, వాడు తన కొడుకు అని తెలియని భూదేవి అవతారమే. హరిమాయచే తల్లే కొడుకుని చంపింది.

**ఆ.వె॥ సత్యభామ నెరపు సరసపు నగవులు**
**నిత్యము హరిమదిని నెలవు ఆయె**
**అన్నమయ్య అనెను అలమేలుమంగమ్మ**
**తిరుమలయ్య మనసు మురియజేసె.**

**రాగం :**

సత్యభామ సరసపు నగవు
నిత్యము హరిమదిని నెలవాయె ॥సత్యభామ॥

రుకిమిణిదేవికి రూపయౌవనికి
సకల విభవముల సమ్మెతలు
చికురాంబరమున చెదరిన అలుకలు
హితజాత్యముఖము వేయి వేలాయె ॥సత్యభామ॥

తొడవుల శ్రీసతి తొలమెఱుగులవె
నడవుల మురిపెపు నగుమోము
తడయక వారిధి తచ్చిన హరికి
బడలిక వాసెను పరమంబాయె ॥సత్యభామ॥





అనుదినమును నీ అలమేల్మంగ
కనుగవ చలికిన గరువములు
దినదినమును అల తిరువేంకటపతి
చనవుల సొబగుల సంపదలాయె ॥సత్యభామ॥

**భావామృతం :**

సత్యభామ యొక్క మనోజ్ఞమైన నవ్వు 'హరిమదిని' (శ్రీకృష్ణుని హృదయమున) నిత్యమూ ప్రతిష్ఠింపబడియున్నది. ఆమె ఆయన హృదయాధీశ్వరి.

నందనందనుని వలచి, రాయబారము నడిపి వలపించుకొని పరిణయమాడిన రూపయౌవని (చక్కటి రూపము గల జవ్వని) రుక్మిణీదేవి ఆయన అష్ట భార్యలలో అగ్రస్థానముననున్నది. ఆమె చికురాంబరమున (నల్లని ఆకాశమువంటి కేశపాశమున) చెదరిన అలుకలు (వెంద్రుకలు....లేక ....ముంగురులు), హితజాత్యముఖము (ప్రీతిని కలిగించు వదనము) వేయివేలాయె (అనేక విధముల ఆయనను అలరించుచున్నది).

అవే శ్రీసతి (లక్ష్మీదేవి) యొక్క తొడవుల (దివ్యమైన ఆభరణముల) తొలమెరుగులు(అతిశయించిన తళతళలు). ఆమె యొక్క మురిపెపు నడవుల (మురిపించు ప్రవర్తన), నగుమోము (చిరునవ్వులు చిందించు వదనము)....తడయక (ఏ మాత్రము జాప్యము చేయక ) వారిధి తచ్చిన (క్షీరసాగర మధనముగావించిన) హరికి(నారాయణునికి) కలిగిన బడలిక వాసెను (అలసటతొలగిపోయెను). ఆయనకది పరమంబాయె (అన్నిటికంటే యెక్కువైయున్నది).

ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ కలియుగంలో నీవు వైకుంఠము వదలిన శ్రీహరివై మానవులని రక్షించుటకు వెలసినావు. నీ హృదయేశ్వరి పద్మావతియై నిన్ను చేరినది. నీవు అనుదినము (నిత్యమూ) ఆ దేవి రెండుకళ్లలోను తొణికిసలాడెడి గరువములు (గౌరవ భావములతో) అలరింపబడుచున్నావు. ప్రతిదినము ఆమె సొగసుల ఆప్యాయతల వైభవములు నీ సంపదలైనవి.

## 6-59

## మున్నుడి

భరతవర్షంలో రామకథ తెలియని నరుడు, రామాలయంలేని వూరు వుండవని ప్రతీతి. శ్రీరామచంద్రుడు విష్ణువు అవతారమే కాక పరబ్రహ్మ స్వరూపుడు అని చెబుతున్నారు అన్నమాచార్యులవారు. తను వినిపిస్తున్న ఈ కీర్తనయే రామకథయట. ఇది సర్వపుణ్యములయొక్క ఫలము అంటున్నారు. 'శతకోటి విస్తరము' అంటే అనేక ప్రదేశములకు విస్తరించి వెల్లివిరిసినదని అర్థము. అన్నమయ్య కీర్తనలలో పల్లవి అర్థమవటం బహుకష్టమైన పని. కామించు విభీషణు లంకకు పట్టము గట్టె... అంటే...?

**కం॥ విదితమగు పరబ్రహ్మట**
**ఇదియే శ్రీరామగాథ ఈ అన్నయనెన్**
**పదికోట్ల విస్తరంబగు**
**కొదలేనీ పుణ్యఫలము కొలువుడిత నిన్**

*** విస్తరంబు = వెల్లివిరిసినది**

**రాగం :** బౌళి రామక్రియ

ఇతడే పరబ్రహ్మ మిదియే రామకథ
శతకోటి విస్తరము సర్వపుణ్యఫలము ॥ఇదియే॥

ధరలో రాముడు పుట్టె ధరణిజ బెండ్లాడె
అరణ్యవాసులకెల్లా నభయమిచ్చె
సొరిది ముక్కు జెవులు చుప్పనాతికి గోసె
ఖరదూషణులను ఖండించి వేసె ॥ఇదియే॥

కినిసి వాలి జంపి కిష్కింధ సుగ్రీవుకిచ్చె
వనధి బంధించి దాటె వానరులతో
కలసి రావణ కుంభకర్ణాదులను జంపి
వనిత జేకొని మళ్లి వచ్చె నయోధ్యకును ॥ఇదియే॥





సౌమిత్రియు భరతుడు శత్రుఘ్నులు గొలువగ
భూమియేలే కుశలవ పుత్రుల గాంచె
శ్రీమంతుడై నిలిచె శ్రీవేంకటాద్రిమీద
కామించు విభీషణు లంకకు బట్టముగట్టె ॥ఇదియే॥

**భావామృతం :**

ఓ జనులారా! ఇతడే (ఈ శ్రీరామచంద్రుడే) పరబ్రహ్మ(భగవంతుడు). కేవలం విష్ణువు కాదు. ఇదియే (ఈ కీర్తనలో చెప్పెడి సారాంశమే) రామకథ (రామాయణం). ఈ రామాయణం శతకోటి విస్తరము (లెక్కకు మిక్కుటమైనట్లు వెల్లివిరిసినది). దీనిని గానం చేస్తే సర్వపుణ్యములయొక్క ఫలము సంప్రాప్తిస్తుంది. దీనిని గానం చేసి తరించండి.

ఈ భూమిమీద భగవంతుడు రామునిగా జన్మించాడు. భూమిజ అయిన సీతాదేవిని పెండ్లాడినాడు. అరణ్యవాసులైన మునులు, యోగులు, భిల్లులకు అభయమునిచ్చాడు. చుప్పనాతి అని పిలువబడే శూర్పణకు ముక్కుచెవులు సొరిది (వరుసగా) కోసె (తెగవేయించినాడు). ఖరుదు దూషణుదు మొదలైన పదివేలమంది రాక్షసులను ఒంటరిగా సంహరించాడు. అందుకే ఆయన పరబ్రహ్మ.

తన తమ్ముని భార్యను బలవంతాన భర్తనుండి అపహరించాడని, కినిసి (ఆగ్రహించి) వానరరాజైన వాలిని సంహరించి సుగ్రీవునికి భార్యతో బాటు, కిష్కింధ రాజ్యాన్ని కూడా ఇప్పించాడు. వనధి (సాగరమును) బంధించి వారధి కట్టించి వానరసైన్యంతోబాటు సముద్రాన్ని దాటినాడు. వారితో కలిసి రావణ కుంభకర్ణాది రాక్షసులను జంపి తన భార్య సీతను తీసికొని తన అయోధ్యానగరమునకు మరలి వచ్చాడు.

పట్టాభిషిక్తుడై తన సోదరులైన లక్ష్మణ, భరత,శత్రుఘ్నులు తనను సేవించుచుండగా, భూమిని పరిపాలించినాడు. కవలలైన కుశ లవులను పుత్రులను బొంది తన తదనంతరం రాజ్యం వారికి పంచి ఇచ్చాడు. ఆ భగవంతుడు కలియుగంలో మనబోంట్లను తరింపజేయుటకు వేంకటాద్రిమీద శ్రీవేంకటేశ్వరునిగా అవతరించి కోరిన వరాలిస్తున్నాడు. ఎందుకంటే... ఆనాడు, కామించిన (తన అన్నరాజ్యం తనకి వస్తే బాగుండునని ఆశించిన) విభీషణునికి అతని కష్టాలకు పరిహారంగా సువర్ణలంకకు ఏలికను చేసినాడు. అందుకే ఆయనయే పరమాత్మ.

**6-60**

## మున్నుడి

చక్కటి తత్త్వబోధను చేస్తున్న అన్నమాచార్యులవారిని ఆలకించండి. 'వననిధి' అంటే, ఏదో వనము, అంటే అడవి అని ఊహించుకొంటే పొరబాటు. వనధిలేక వననిధి అంటే సముద్రము. సముద్రం మీద కురిసిన వాన నిష్ప్రయోజనం కదా! ఆలోచించకుండా చేసే పనులు నిరుపయోగమే కాక భారంకూడా అవుతాయి. నరులంతా చూపించే మమతానురాగాలన్నియును దూరపు కొండల నున్నదనమువలె సత్యముగా కనిపించు అసత్యము. అడవిగాచిన వెన్నెలవలె హరిని పూజించని జీవితములన్నియు నిరుపయోగములంటున్నారు.

**చం॥ వననిధి మెండుగా గురియు వానలు యెవ్విధి మేలుజేయురా?**
**పనులవి భారమౌ మతిని బాగుగ యోచనలేక జేసినన్**
**వనములగాయువెన్నెలలు వ్యర్థము, దూరపు కొండ నున్నమా?**
**కొని, యనె అన్నమయ్య హరిగొల్వనిచో నడిచే శవంబులే.**

**రాగం : బేహాగ్**

వననిధి గురిసిన వానలవి మతి-
పనిలేని పనుల భారములు ॥వననిధి॥

అడవుల వెన్నెల లారిడి బదుకులు
తడతాకుల పరితాపములు
వొడలొసగిన హరి నొల్లక యితరుల
బడిబడి దిరిగిన బంధములు ॥వననిధి॥

కొండలనునుపులు కొనకొన మమతలు
అండలకేగిన నదవదలు
పండినపంటలు పరమాత్ము విడిచి
బండలు తిరిగిన బడలికలు ॥వననిధి॥





బచ్చ రూపులు పచ్చల కొలపులు
నిచ్చలనిచ్చల నెయ్యములు
రచ్చల వేంకటరమణుని గొలువక
చచ్చియు జావని జన్మములు ॥వననిధి॥

**భావామృతం :**

ఓ నరులారా! శ్రీహరిని ఆశ్రయించని నరజన్మలు వ్యర్థమైనవి. వననిధి (సముద్రము) లో కురిసిన వాన ఎవరికి ఉపయోగపడుతుంది? 'మతి పనిలేని పనులు' (బాగుగా ఆలోచించి చేయని పనులు) భారములు (భారమైనవి) నిరుపయోగమైనవని భావము.

ఆరడి బ్రతుకులు (నిరుపయోగమైన నరజన్మలు) అడవిగాచిన వెన్నెల వలె వ్యర్థమైనవి. అవి తడతాక పరితాపములు (బాగుగా బాధించు మనోవ్యథలను) కలిగించును. ఒడలొసగిన హరిని (మానవ జన్మనిచ్చిన శ్రీహరిని) ఒల్లక (అంగీకరించక), ఇతరుల బడిబడి (వెంబడి) తిరిగినచో వారితో బంధములు కలిగి జీవితమంతా వ్యర్థమైపోతుంది.

కొనకొన మమతలు (తెచ్చి పెట్టుకొన్న ఆప్యాయతలు) కొండల నునుపులు (దూరపు కొండల నున్నదనమువలె, ఉన్నట్లు భ్రమ కలిగించు లేనివి). ఇతరుల, అండలకేగిన (ఆశ్రయమునాశించిన) కలుగునవి మేళ్లుకాదు. అదనదలు (కలతలు) మాత్రమే. బాగుగా పండిన పంటవంటి పరమాత్మని కాదని, బండలు తిరిగిన (వ్యర్థుల వెంట తిరిగితే) ఏమిలాభం? ఉత్తబడలిక (శ్రమ) మాత్రమే మిగులుతుంది.

నిచ్చనిచ్చనెయ్యములు (దినదినము మన స్నేహములన్నీ) బచ్చన రూపులు (పై పూతలవలె అసలైనవి కావు). పచ్చలకొలుపులు (బంగారు కాంతులు నిజమైనవి కావు). బహిరంగంగా శ్రీవేంకటేశ్వరుని కొలువనివారి జన్మలు నిరుపయోగం. అవి చచ్చినా బ్రతికున్నట్లు కనిపించే జన్మలు.

**6-61**

## మున్నుడి

ప్రభూ! నీవు దేవ శిఖామణివి (దేవతలందరికీ తలమానికము వంటివాడవు). దిష్టదైవమవు (భాగ్యప్రదాతవు). మరినేనో ఇటు నీబంటను (దాసుడను). ఇంక నాకు యెదురు చెప్పగలవారెవరు" – అంటున్నారు అన్నమాచార్యులవారు. అధికారి యెంత శక్తిమంతుడైతే, ఆయన బంట్రోతు కూడా అంత దర్పం ప్రదర్శిస్తాడు కదా! అదీ సంగతి... తన అధికారి యెంత 'గొప్పవాడో' ఈ బంటు మనని హెచ్చరిస్తున్నాడు. జగములో తనకు కొఱత (తక్కువ) అనేదే లేదు పొమ్మంటున్నారు. కులశేఖర అళ్వార్ అన్నారు కదా! నేను నీ బంటుకు, బంటుకు, బంటుకు, బంటుకు, బంటుకు దాసుడిని... అని. అదీ దాసభక్తి అంటే.

**ఆ.వె॥ దిష్టదైవమీవు దేవశిఖామణీ!**
**నీదు బంట నేను యెదురు లేదు**
**కారణాలు తెలిపె ఘనుడన్నమార్యుండు**
**ఏమి కీర్తనంబు!! హితవు వినుడు.**

**రాగం : బౌళి**

దేవ శిఖామణివి దిష్టదైవమవు నీవు
యీవల నీబంట నాకు నెదురింక నేది ॥దేవ॥

కామధేనువు పిదుకగల కోరికలివెల్ల
కామధేనువులు పెక్కు గానే కృష్ణుడవట
కామించి నీబంటునట కమ్మి నిన్ను దలచితి
ఏమి మాకు గడవయ్య యిందిరారమణా ॥దేవ॥

యెంచ కల్పవృక్షమును యిచ్చు సిరులెల్లాను
నించి కల్పవృక్షముల నీడల కృష్ణుడవట
అంచల నీబంటునట ఆత్మలో నిన్ను నమ్మితి
వంచించ కడమ యేది వసుధాధీశ! ॥దేవ॥





తగనొక్క చింతామణి తలచినట్ల చేసు
మిగుల కౌస్తుభమణి మించిన కృష్ణుడవట
పగటు శ్రీవేంకటేశ భక్తుడ నీకట నేను
జగములో కొఱతేది జగదేక విభుడా ॥దేవ॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు దేవశిఖామణివి (దేవతలందరికి తలమానికము వంటి వాడవు). దిష్టదైవతువు (భాగ్యప్రదాతవు). ఈవల (ఇటుపై) నేను నీబంటను (దాసుడను). ఇంకన్ యెదురు యేదినాకు?

ఓ ఇందిరారమణా! (శ్రీమహాలక్ష్మీపతీ!) కామధేనువును పిదుక (పిదికితే) కోరికలెల్లా ఫలిస్తాయి కదా! అటువంటి యెన్నో కామధేనువులను నీవు కృష్ణయ్యగా గాచినావు. నీ బంటునై నేనేవో చిన్న చిన్న కోరికలు కోరుకుంటే మాకు కడవు (కొఱత) వుంటుందటయ్యా! అందునా... క్రమ్మి (అతిశయించి) నిన్ను తలచిన వారికి మరింకే కొఱత వుంటుంది?

ఓ భూవల్లభా! కల్పవృక్షాన్ని యెంచ (ఆశ్రయిస్తే), యెల్ల సిరులను నించును. నీవేమో ఆనాడు బృందావనం కృష్ణయ్యగా విశ్రమించిన చెట్లన్నీ కల్పవృక్షాలే. మేమేమో నీకు ఆత్మలో నమ్మిన బంటులము. అంచల (నీ పక్కనే) వుంటుంటాము. మాకు వంచించ కడమయేదీ? (మాకు ఇంకొకరిని మోసం చేసి యేవో పొందవలసిన అగత్యమేమున్నదయ్యా!

ఓ జగదేకవిభుడా! (జగన్నాథా) ఒక్క 'చింతామణి' అను దివ్యరత్నం, తగున్ (చాలును). అది తలచినట్లు చేసు(చేస్తుంది). దానిని మించిన కౌస్తుభమణిని కంఠసీమలో ధరించి తిరిగే ద్వారకానగరాధిపతివి నీవు. శ్రీకృష్ణమూర్తివి. నేటి కలియుగంలో నీవే పగటు (లావణ్యమూర్తి) శ్రీవేంకటేశ్వరుడవు. నేనేమో నీకు అటు (అక్కడ) భక్తుడను. ఇంకా నాకు ప్రపంచంలో ఏమన్నా కడమ(లోటు) వుంటుందా తండ్రీ! ఒక్కనాటికీ వుండదు.

6-62

## మున్నుడి

చక్కటి జ్ఞానబోధను చేస్తున్న అన్నమాచార్యుల వారి కీర్తన నాస్వాదించండి. స్త్రీలకు విజ్ఞప్తి యేమంటే ఆచార్యులవారి వైరాగ్య కీర్తనలలోను, వేమన పద్యాలలోను కనబడే స్త్రీ విమర్శ అందరు స్త్రీలపై కాదు. విశృంఖలంగా ఉండే వారవనితలపైననే ఆ విమర్శలు. మాతృమూర్తియైన స్త్రీని ఆచార్యులవారు యెప్పుడూ గౌరవించారు. ఈ కీర్తన ప్రత్యేకత యేమంటే అర్థమయినట్లుండే, అర్థంకాని కీర్తన. అసలు పల్లవి కూడా సరిగా అర్థంకాదు. "నానా విధాల నివి నమ్మేరు సుండి"... అంటే? ఇవి... అంటే, ఇంతుల పెదవులు, కాంతల నవ్వులు, కామినులు మాటలు నానా విధాలుగా ఉంటాయి. వాటిని నమ్మేరు సుండి (సుమా!). జాగ్రత్త... చెడిపోతారు.

**ఉ॥ జ్ఞానుల యోగులన్ సకల సంగ విరక్తుల బిల్చి చెప్పెరా**
**కానరొ సత్యమున్ పలురకంబుల నమ్ముదురింతులందరిన్**
**మానిని తీపులౌ పెదవి మత్తుల జత్తురు కాలకూటమౌ**
**పూనుచు వేంకటేశ్వరుని పూర్తిగ నమ్ముదు అన్నమయ్యనెన్.**

**రాగం : వసంతం**

జ్ఞానులాల యోగులాల సకల విరక్తులాల
నానా విధాల నివి నమ్మేరు సుండి ॥జ్ఞాను॥

ఆలరి యింతుల యధరామృతము వివియెల్ల
కాలకూట విషముల కరము సుండి
శీలముతో వీరల చెట్టలు వట్టుట లెల్ల
బాలగానాల దొడికి పట్టుట సుండి ॥జ్ఞాను॥

కాంతలు నవ్వుచునైనా గనుల జూచిన చూపు
పంతమున నలుగుల పాతర సుండి
బంతుల నెదుటనున్న పడతుల చన్నులివి
కంతల నొడ్డిన బండిగండ్లు సుండి ॥జ్ఞాను॥





జవ్వనపు గామినుల సరసపు మాటలెల్లా
మవ్వమైన యట్టి చొక్కు మంత్రాలు సుండి
యివ్వలను శ్రీవేంకటేశ్వరు దాసులకివి
చివ్వన జెప్పినట్లు చేసేవి సుండి ॥జ్ఞాను॥

**భావామృతం :**

ఓ జ్ఞానులారా! యోగులారా! అన్ని విధములుగ విరక్తిని పొందిన సిద్ధులారా! నానా విధాలన్ (పలురకములైన), ఇవి (స్త్రీల సంగతులను) నమ్మేరు సుండి (విశ్వసించేరు సుమా!)... జాగ్రత్త... అట్లు చేసి చెడిపోవద్దు. (నా మాట వినండి).

ఆలరి యింతుల (చిలిపి స్త్రీల యొక) అధరామృతములు (తీపి పెదవులు) ఉన్నాయి చూశారా... ఇవి యెల్ల ఘోరమైన కాలకూట విషములే సుండి (సుమా!) శీలముతో (మీ స్వభావమునకు తగినట్లు) వారి చెట్టులు పట్టుటయెల్లన్ (పాణిగ్రహణము) పాలగానాలను (ముతకవడ్ల అన్నం) తొడికి పట్టుట (ఆత్రంగా తినటమే.. సుమా!)

కాంతలు నవ్వుతోనైనా, సోగకన్నులతో చూచినచో...అది శత్రువుల "పంతము పట్టిన అలుగుల పాతర సుండి" (గోతిలో కప్పివేయుట వంటిదే సుమా!). బంతుల నెదుటనున్న (విశృంఖలలైనటువంటి) పడతుల చన్నులివి (స్త్రీల స్తనములు ఇవియే) కంతుల నొడ్డిన బండికండ్లు (విడివడి బయటకు వచ్చేసిన బండి చక్రాలే... సుమా!). ఆలోచించండి. ఆకర్షణ 'ఆ బండి చక్రాల'లో వున్నదా, లేక కామవాంఛ కలిగించే భ్రమా? వాంఛయే కదా!

యౌవనులైన కామినుల సరస సంభాషణములు మువ్వయైన యట్టి (కోమలమైన లేక సరళమైన ) చొక్కు మంత్రాలు సుండి (చేతబడి మంత్రములే సుమా!) అయితే... ఇవన్నీ కామపీడితులైన వ్యసనపరులకు మాత్రమే అని తెలుసుకోండి. ఇవ్వల (ఇటువైపున) శ్రీవేంకటేశ్వరుని దాసులకి మాత్రం, చెప్పినట్లు వినునట్టి భార్యలే కాని భోగ స్త్రీలు కాదు.

**6-63**

## మున్నుడి

శ్రీ వేంకటేశ్వరుని అభిషేక మహోత్సవాన్ని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. పరాశక్తిని ముగురమ్మల మూలపుటమ్మగా పెద్దలు కీర్తించారు. అదేవిధంగా ముగురయ్యలు (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు) వారిమూలము, పరమాత్మ. ఈతడు (ఈ తిరుమలేశుడు) వారికి 'మూలము' అంటున్నారు. జిగిమీరెన్ (కాంతులను విరజిమ్ముచున్నాడు). ఈయనను సేవించరో, అని చెబుతున్నారు. స్వామి నిమజ్జన వైభవాన్ని వర్ణిస్తున్నారు. స్వామి కులికి పుణ్యాల కెల్లా గురియైనవాడు... అంటున్నారు. అంటే?

**చం॥ "ముగురు మహానుభావులకు మూలపుదైవము వేంకటేశుడే**
**జిగియది మీరె కట్టెదుట, సేవలు జేయరొ" అన్నమయ్యనెన్**
**తగు విధి మజ్జనంబవల తప్పక మెత్తరొ పచ్చ కప్పురం**
**బెగువను వేంకటేశ్వరుడు యేలెజగంబుల దాసులందరిన్.**

**రాగం : బౌళి**

ముగురు వేలుపులకు మూల మీతడు
జిగి మీరి నెదుటను సేవించరే ॥ముగురు॥

అంచెల బన్నీటి బిందెలందుకొని యిందరును
నించి మజ్జనము దేవునికి జేయగా
వంచి సముద్రము మీద వానలు గురిసినట్లు
పొంచి యన్నిటాను ఉప్పొంగుచున్నాడు ॥ముగురు॥

పచ్చకప్పురము మేన బలుమారు మెత్తగాను
తచ్చి పున్నమి చంద్రుడే తానైవున్నాడు
అచ్చపు దట్టి పుణుగు ఆ మీద బుయ్యగాను
నిచ్చ కల్పకతరువు నీడయై వున్నాడు ॥ముగురు॥





అలమేలుమంగతోడ నన్ని సొమ్ములు నించగా
పలుపంచవన్నెల సంపదయైనాడు
యెలమి శ్రీవేంకటేశు డిన్నిటా బ్రతాపించి
కులికి పుణ్యాలకెల్లా గురియైనాడు ॥ముగురు॥

**భావామృతం :**

ఓ జనులారా! ఈతడు (ఈ శ్రీవేంకటేశ్వరుడు) ముగురు వేల్పులకు (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అనిపిలువబడే ముగ్గురు దేవుళ్లకు) మూలము (కారణభూతుడైన తల్లివేఱు). జిగిమీరె నెదుటను (మన కనులముందు కాంతులీనుచున్నాడు). ఇతనిని సేవించండయ్యా.

అంచెల (ఒకరి తర్వాత ఒకరు అందుకొంటూ) పన్నీటి బిందెలు అందుకొని, ఇందరును (ఇంతమందీ) దేవునికి నించి (అతిశయించి) మజ్జనము (మంగళ స్నానము) చేయగా అదెట్లున్నదంటే అనంతమైన నల్లని సముద్రముమీద వానజల్లు వంచి కురిసినట్లున్నది. (ఒక్కటిగా కురిసినట్లున్నది). ఆ చన్నీటి స్నానం వలన ఆయన ఉత్సాహవంతుడై అన్ని విధములా ఉప్పొంగుచున్నాడు.

స్వామి వంటిమీద అటు పిమ్మట పచ్చ కర్పూరం పలుమారులు, మెత్తినారు. తెల్లని ఆ కర్పూరం వలన స్వామి, తానే తచ్చిపున్నమి చంద్రుడైనాడు. (క్షీరసాగరమధనంలో పుట్టిన నిండు చంద్రునివలె శోభిల్లుచున్నాడు) ఆపైన, అచ్చపు దట్టుపుణుగు బుయ్యగాను (స్వచ్ఛమైన సుగంధ ద్రవ్యము తట్టుపుణుగును మెత్తినారు). పునుగుపిల్లి నుంచి వచ్చిన ఆ సుగంధ ద్రవ్యం వలన స్వామి, కల్పవృక్షము యొక్క నీడవలె మనోహరంగా ఉన్నాడు.

ఆ తరువాత, అలమేలు మంగా సమేతుడైన స్వామికి, అన్ని సొమ్ములు (దివ్యాభరణములనన్నింటినీ) నించగా (అలంకరించగా) పలుపంచ వన్నెలు (రంగు రంగుల దివ్యరత్నముల వలన) సంపదయైనాడు (ఐశ్వర్యము అవతరించినట్లున్నాడు). ఇన్నిటాను (ఇన్నివిధములుగా) శ్రీవేంకటేశ్వరుడు యెలమి ప్రతాపించగా (సంతోషంతో ప్రతాపము చూపిస్తుంటే), కులికి పుణ్యాలకెల్లా (వెదజల్లబడిన పుణ్యములన్నింటికీ గురియైనాడు. (లక్ష్యము తానె అయినాడు).

**6-64**

## మున్నుడి

అన్నమాచార్యుల వారి సుపుత్రుడు పెదతిరుమలయ్య చెప్పిన చక్కటి కీర్తన నాస్వాదించండి. "ఓ శ్రీహరీ! నీ చేతలు (పనులు) ఆనందకరములైనవి. అవి సురులకు (దేవతలకు) నరులకు (మానవులకు) శుభమును కలిగించినవి. జగత్తున ఎందరో దుష్టులను గెలిచి, శిష్టరక్షణ చేసినావు. నీవా దుష్టులపై గెలిచిన గెలుపులే భారత, భాగవత కథలై, వేదములై పురాణములై మాకు నీ మహిమల నెరింగించినవి. ఓ శ్రీవేంకటేశ్వరా! కోరిన వారికి వైభవముల నొసగి నీవందరినీ జయించావు" అంటున్నారు.

**కం॥ సురులకు నరులకు శుభమై**
**హరి! నీ చేతలును జగతి కానందములై**
**తరగని గెలుపులు కథలౌ**
**విరివిగ, తాజెప్పె నిటుల పెద తిరుమలయున్**

**రాగం : ఆనందభైరవి**

సురలకు నరులకు శుభమాయె
హరి నీ చేతలు ఆనందమాయె ॥సురులకు॥

కినిసి రావణుని గెలిచిన గెలుపులు
చెనకి బాణుని గెలిచిన గెలుపులు
పొనిగి హేమ కశిపుని గెలిచిన గెలుపులు
వెనక ముందరికి వేదములాయె ॥సురులకు॥

కలన కంసునటు గెలిచిన గెలుపులు
చెలగి బలిని గెలిచిన గెలుపు
అల శిశుపాలుని గెలిచిన గెలుపులు
బలు పుణ్యకథా భారతమాయె ॥సురలకు॥





కెరలి యసురులను గెలిచిన గెలుపులు
సిరుల నందరిని గెలిచిన గెలుపు
యిరవగు శ్రీవేంకటేశ నీ మహిమలు
సరవితో పురాణము లాయె ॥సురలకు॥

**భావామృతం :**

ఓ శ్రీహరీ! నీ చేతలు (పనులు లేక లీలలు), ఇటు దేవతలకు అటు మానవులకు కూడ శుభములాయె (శుభము కలిగించునవై యున్నవి) ఆనందకరములై యున్నవి.

(ఆ చేతలను వివరిస్తాను వినవయ్యా!) శ్రీరామచంద్రుడవై నీవు త్రేతాయుగంలో నీ భార్య సీతనపహరించాడని కినిసి (ఆగ్రహించి), రావణునితో యుద్ధం చేసి గెలిచి దుష్టశిక్షణ చేశావు. అట్లే ద్వాపరయుగంలో నీవు శ్రీకృష్ణుడవై బాణాసురుని చెనకి (ఎదిరించి) రణంలో గెలిచినా ఆ గెలుపు భాగవత కథ అయింది. నీవు కృతయుగంలో, నరసింహుడవై, పొనిగి (నిశ్చేష్టుని చేసి) హేమకశిపుని (కశ్యప సుతుడైన హిరణ్యకశిపుని) గెలిచితివి. ఆ గెలుపు ప్రహ్లాదుని చరిత్రయై ప్రసిద్ధి చెందినది. ఆ కథలన్నీ వెనక ముందరికి (ఇదివరకునున్న వారికి, భావితరాలవారికీ) వేదములాయెను (మంచి నడత యెట్లుండవలెనో చెప్పే వేద ప్రమాణములైనవి).

ఓ ప్రభూ! ఆనాడు, కలన (అందరికీ తెలియునట్లు) శ్రీకృష్ణుడవై, కంసుని సంహరించి గెలిచితివి. చెలగి (విజృంభించి) నీ పాదములతో లోకములన్నియు కొలిచి బలిని అణచి, అతని సత్ప్రవర్తనకు మెచ్చి వాని కావలివానివైతివి. దానవుల హృదయములను కూడ గెలిచితివి. అల (ఆనాడు) శిశుపాలుని నిందలు హద్దు దాటగనే చక్రముతో తల ఖండించి గెలిచితివి. ఆ పుణ్యకథలే మహాభారత గాథ అని కీర్తింపబడినది.

దేవా! ప్రతియుగములోను, కెరలి (దుష్టులపై ఆగ్రహించి) అసురులను (రాక్షసులను) రూపుమాపి గెలుచుచునే యున్నావు. నేడు సిరులన్ (కోరిన సంపదలు నొసగి) మమ్ము అందరిని గెలిచినావు. ఇరవగు శ్రీవేంకటేశ్వరా! (ఈ తిరుమలలో స్థానమైన ఓ శ్రీనివాసా!) నీ దివ్యమహిమలన్నీ సరవితో (క్రమముగా) పురాణములై మా చెవులకు అమృతమునందించినవి.

**6-65**

## మున్నుడి

"ఓ శ్రీ వేంకటేశ్వరా! ఎంత తెంపరివయ్యా! స్త్రీ పొందులోని సుఖం తెలుసును అంటావు. భోగించడం తెలిసిన రసికుడనంటావు. నీకు ఎన్ని వేలమంది భామినులున్నారు? నీకు ఆకు మడిచి ఇవ్వటానికి (తాంబూలమివ్వటానికి) సిద్ధముగా ఎంతమంది వున్నారు?" - అంటున్నారు అన్నమాచార్యులవారు. "ఈడులేని తిరువేంకటేశ" అంటే (అనాదివైన శ్రీవేంకటేశ్వర) అని అర్థం. "వాడుచు నీతోడ నేను వాసి చూపగలనా?" - అంటే అర్థమేమిటి? ఆలోచించండి... నా భావన నాలకించండి. అన్నమయ్య కూడా స్వామి ప్రియురాలే అయి వాపోతున్నారు.

**మత్తకోకిల:**

> **పొందెఱుంగుదు నందువే, తగు భోగినందువు శ్రీహరీ!**
> **ఇందరుండగ నీకు భామలు యెందు కాసలు నాపయిన్?**
> **సందడిన్ మడిచిట్లు 'ఆకును' చక్కగా అందియ్యానా**
> **అందుకోమని? యేమిదుస్థితి? అన్నమార్యుడుపాడెరా.**

**రాగం : మిశ్రశుద్ధధన్యాసి**

పొందెఱుగుదు నందవు భోగినందువు నీ
యందరు సతులకు నేనాకు మడిచి ఇత్తునా ॥పొందె॥

ఎవ్వతెకైనా చనవిచ్చేవు మెచ్చేవు నీ
నవ్వులకైనాను మన్ననజూ చేవు
అవ్వలియివ్వలి నీ యంగనల వొద్దను
పవ్వళించి యుండగా నే పాదము లొత్తుదునా ॥పొందె॥

ఏపున నెక్కడికైనా నేగేవు దాగేవు నీ
కోపాన నాతోనైనా మేకులు సేసేవు
వైపున నీ వెందుండైనా వచ్చిన నేనంతలో
నోపిక నప్పుడు నీకూడిగాలు సేతునా ॥పొందె॥





వేడుక లెందైనా పారవేసేవు నీ
వాడిక చేత లెన్నైనా వన్నె వెట్టేవు
ఈడులేని తిరువేంకటేశ కూడితివి నన్ను
వాడుచు నీతోడ నేను వాసి చూపగలనా ॥పొందె॥

**భావామృతం :**

ఇదేమి చోద్యమయ్యా! ఒక పక్క పొందెఱుగుదును (స్త్రీ సాంగత్యమెట్టిదో తెలుసును) అంటావు. భోగిని (రసికుడను)అంటావు. ఇంతా చేసి నీ భార్యలందరికీ నన్ను ఆకుమడిచి ఇవ్వమంటావు. నాగతి అంతేనా స్వామీ!

నీ పద్ధతి చూద్దామంటే వింతగావుంది. నీతో పరిచయమున్న ఎవ్వతెకైనా చనువునిస్తావు. దాన్నిమెచ్చుకొంటావు. నవ్వులతో మన్నన (గౌరవం) ఇస్తావు. అక్కడా ఇక్కడా అని చూడక నీ కామినులైన స్త్రీలతో నీవు పడుకొంటే నన్ను మీ పాదాలు ఒత్తమని అంటావా? ఇది నీకు న్యాయంగా వున్నదా స్వామీ!

గొప్పగా యెక్కడికిష్టమైతే అక్కడికిపోతావు. ఎవత్తె దగ్గరనైనా సరే దాగియుండెదవు. నీ కోపతాపాలు నా మీద చూపించి, మేకులు సేసేవు (సమ్మతింప చేస్తావు). నీ వెక్కడెక్కడో తిరిగి వస్తే నేను ఓపికగా నిరీక్షించి, అప్పుడు నీకు వూడిగాలు చేయమంటావా?ఇదేమి న్యాయం స్వామీ! నా గతి ఆవిడకు వూడిగాలు చేయటమా?

ప్రభూ! నీ విలాసములెందైనా పారవేసెదవు (నీ ఇచ్చవచ్చిన చోట వేడుకలతో గడిపేవు). నీ కలవాటైనా చేష్టలనెన్నైనా నిగ్గు చూపేవు. ఈడులేని తిరువేంకటేశా!(అనాదివైన శ్రీవేంకటేశ్వరా!) నన్ను నీవు కూడితివి. నీ కూటములతో నన్ను వాడిపోవునట్లు జేసితివి. నేను నిన్ను అధిగమించగలనా ప్రభూ!నేనెంతదానను?

**6-66**

## మున్నుడి

అన్నమయ్య కీర్తన అద్భుతమైన సీస పద్యంగా మార్చటం, అతి తేలిక అని, అనేక మార్లు అనీ అనీ అలిసిపోయాను. సకల జీవులకు సంజీవిని వంటి దివ్యౌషధం అందిస్తున్నారు ఆచార్యులవారు. ఈ మందు సులభమైనదే....కాని కీర్తన అంత సులభమైనది కాదు. ఎందుకో చదివి తెలుసుకోండి.

**సీ॥ సకల జీవులకెల్ల సంజీవి నీ మందు**
**వెకలులై జనులు సేవించు మందు**
**శేషాద్రిపైన అశేషమౌ యీ మందు**
**నల్లని కాంతుల నయపుమందు**
**ఏకాంత కోరిన ఆ కాంతకౌమందు**
**అంజనా గిరిపైన అలరుమందు**
**బలు శంఖచక్రాల బదనిక యీమందు**
**బ్రహ్మరుద్రాదులు బడయు మందు**
**ఆ.వె॥ వేంకటాద్రి మీద వెలుగు జిమ్మెడి మందు**
**తలచిన వారికి తత్త్వ మందు**
**అన్నమయ్య పాడి అందించెనీ మందు**
**మించి నన్ను ఉద్ధరించు మందు.**

**రాగం :సంజీవి**

సకల జీవులకెల్ల సంజీవి యీ మందు
వెకలులై యందరు సేవించరో యీ మందు ॥సకల॥

మూడులోకములొక్కట ముంచి పెరిగినది
పోడిమి నల్లని కాంతి బొదలినది
వేడుక కొమ్మలు నాల్గు పెనచి చేయివారినది
నాడే శేషగిరి మీద నాటుకొన్న మందు ॥సకల॥





పడిగెలు వేయింటి పాము గాచుకున్నది
కడువేద శాస్త్రముల గబ్బు వేసేది
యెడయక వొకకాంత యెక్కుక వుండినది
కడలేని యంజనాద్రి గారుడపు మందు ॥సకల॥

బలు శంఖ చక్రముల బదనికెలున్నది
తలచినవారికెల్ల తత్వమైనది
అలరిన బ్రహ్మరుద్రాదుల బుట్టించినది
వెలుగు తోడుత శ్రీ వేంకటాద్రిమందు ॥సకల॥

**భావామృతం :**

ఓ జనులారా! మీరు సేవించబోతున్న ఈ మందు సకల జీవులకు సంజీవిని వంటి దివ్యమైన ఔషధం. ఇందరూ(వీళ్ళంతా) వెకలమై (అశక్తులై) సేవించరో (తీసికొనుడయ్యా!) ఈ మందు తప్ప, మీకు మరొక దిక్కులేదు.

మూడులోకములను ఒక్కటిగా మించి పెరిగిపోయిన మందండీ ఇది (త్రివిక్రముడైన వామనమూర్తి). పోడిమి (ఒప్పయిన) నల్లని కాంతితోన్, పొదలినది (వర్ధిల్లినది). వెల్లివిరిసి నాలుగు కొమ్మలు భాఖోపంశాఖలైవిస్తరించినది (చతుర్వేదములు మూర్తీభవించిన వేదమూర్తియైన శ్రీమన్నారాయణుడే) ఈ మందు. నాడే (అనాదియై) శేషాచలము మీద నాటుకొని స్థిరపడిన మందు. త్వరత్వరగా సేవించండయ్యా!

పడిగలవేయింటి పాము గాచుకొన్నమందు (సహస్రఫణియైన ఆదిశేషుడు రక్షించే మందు) ఇదే. “కడువేదశాస్త్రముల గబ్బువేసేది”.....(వేదములనుంచి జనించిన ఆరుశాస్త్రముల ఈమందు, సేవించిన వారికి, గబ్బువేస్తాయి....అంటే గర్వం తెప్పిస్తాయి). ఆ నాడు ద్వారకానగరంలో విడువక ఒక్కొక్క భామ దగ్గర ఒక్కొక్క రకంగా వున్న మందు ఇదేనండీ...మరి నేడు ఈ అంజనాద్రి, గరుడాద్రులపై నెలకొన్న మందు ఇదేనండీ.

ఈ మందుకి శంఖచక్రములు చెట్టుకొమ్మల్లా (బదనికలై) వ్రేలాడుచున్నవి. దీనిని ధ్యానించిన వారికి తత్త్వసిద్ధిని కూడా కలిగిస్తుంది. అంతెందుకు సృష్టి, లయ వ్యాపారములను నిర్వహించుచున్న బ్రహ్మగారిని, రుద్రుని పుట్టించింది కూడా ఈ మందేనండీ... నేడు కాంతులు చిమ్ముతూ శ్రీవేంకటాద్రి మీద దొరుకుతున్న సంజీవి ఇదే. రారండి ఈ మందు సేవించి తరించండి.

6-67

## మున్నుడి

అజ్ఞానులంతా భ్రమలో సంసారమును మకరందంతో పోల్చి అదే గొప్ప సుఖం అని చెబుతుంటారు. కాని నిజానికి దాంట్లో ఏ సుఖమూ లేదు. పైగా ఇతరులకుండే సౌలభ్యాలు కాని, నిర్విచారం కాని, ఈ సంసారికుండే అవకాశమే లేదంటున్నారు అన్నమాచార్యులవారు. ఈ సంసారంలో తట్టువడుటే కాని (బాధలు పడుట తప్ప) ఒడ్డుకు చేరే అవకాశమే లేదు పొమ్మంటున్నారు. సంసారిగా ఉన్నంతకాలము శ్రీవేంకటేశ్వరుని యెఱుగలేదు. పైగా తన కర్మలకు ఆయనను నిందిస్తాడు. చచ్చేదాకా ఈ అజ్ఞానంలోనే ఏడుస్తాడు.

**తే॥ ఇలను సంసారికిని లేదు యెట్టి సుఖము**
**తట్టువడు కాని చేరడే దరి నతండు**
**అన్నమార్యుడు వినిపించె నద్భుతముగ**
**వేంకటపతికీ కీర్తన విరతి తోడ.**

**రాగం : ఆహిరి**

ఇట్టె సంసారి-కేదియు లేదాయ
తట్టువడుటేకాని-దరిచేరలేదు ॥ఇట్టె॥

ములిగి భారపు మోపు-మోచేటి వాడు
అలసి దించుకొను-నాడాడను
అలరు సంసారికి-నదియు లేదాయ
తొలగని భారమెం-దును దించలేదు ॥ఇట్టె॥

తడని వేపచేదు-త్రావెడి వాడు
ఎడయెడ దిను దీ-పేమైనను
అడరు సంసారికి-నదియు లేదాయ
కడు జేదె కాని యె-క్కడ దీపు లేదు ॥ఇట్టె॥





దొరకొని హేయమే-తోడేటి వాడు
పరిరవించును మేన-బరిమళము
అరిది సంసారికి-నదియు లేదాయ
ఇరవు వెంకటపతి-నెఱుగ లేదు ॥ఇట్టె॥

**భావామృతం :**

ఓ మానవులారా! ఇట్టె సంసారికేదియులేదు. (ఇటువంటి సంసారములోనున్న అజ్ఞానికి ఎటువంటి సుఖమూ లేదు). తట్టుపడుటే కాని (దేనికో ఒకదానికి బాధపడుట తప్ప) దరి చేరలేదు (ఈ సంసారసాగర తీరానికి మాత్రం చేరుకోలేదు).

పెద్ద పెద్ద బరువులు మోసి జీవించే వానికి, అలిసిపోతే యెక్కడో ఒక చోట ఆగి, కాసేపు బరువు దించుకొని, సేదదీరే అవకాశం వున్నది కదా! కాని సంసారికి ఆ అవకాశం లేనే లేదాయె. ఆ బరువును ఎక్కడాదించలేదు.

తడని (పొరబాటున) వేప చేదు రుచిచూస్తే, తప్పుగ్రహించి యెడయక (వదలకుండా) ఏమైనా తీపి పదార్థం తిని ఆ ఇబ్బంది నుంచి బయటపడవచ్చును. అడరు (యాతనలు పడుతూ చేదు అనుభవాలను పొందుతున్న) సంసారికి అదియులేదు (తన పొరబాటు దిద్దుకొనే అవకాశం వున్నదా? అది లేనే లేదు) వాడికి విపరీతమైన చేదే కాని తీపి అనేది వుండనేవుండదు.

దొరకొని (అదే వుద్యోగము అవుట చేత)హేయమును (అశుద్ధమును) తోడేటివాడు (యెత్తిపారేసి బాగుచేసేవాడు) తరువాత చక్కగా స్నానం చేసి పరిమళద్రవ్యాలు వాడి మేను (శరీరాన్ని) బాగుచేసికొనవచ్చును కాని, ఆరిది (దుర్గమమై) సంసారికి ఆ అవకాశం లేనే లేదు. వాడు ఆ సంసారయావు వున్నంతకాలము శ్రీవేంకటేశ్వరుని యెఱుగలేదు. (అంటే తిరుమల చూడడని కాదు ఆ తిరుమలయ్య వాడిని చూడడని అర్థం).

## 6-68

## మున్నుడి

ఇది దశావతార వర్ణన అని తేలికగానే అర్ధమవుతున్నది కానీ, అన్నమాచార్యులవారు యెవరినుద్దేశించి ఈ కీర్తన చెబుతున్నారో అంతతేలికగా బోధపడదు. మెదట అమ్మవారినుద్దేశించి అనుకున్నప్పటికీ, “కలికియాయె నీ సంగతి కొరకే” అనగానే....కాదనిపించింది. ఆ పైన “శైలమెత్తె నీ కుచములెత్తే కొరకే” అనగానే మళ్ళీ అవుననిపించింది. కానీ ఆలోచిస్తే హరి పది మాత్రమేనా యెన్ని అవతారాలెత్తాడు!!...దేని కొరకు? ధర్మం కొరకు. వామనుడయింది అమ్మవారి కోసం కాదు....‘అరి’ని యాచించాడు ‘హరి’.....నీకొరకే అంటే ధర్మం కొరకే అని భావించాను, నేను.

**కం॥ “ఇందుకె చేతలు జేసెను**
**పొందుగ కన్నులని పొద్దుపుచ్చెను కదవే!”**
**పొందెను పది రూపులు ‘హరి’**
**అందించగ ధర్మమనెను అన్నయ్య భళా!!**

**రాగం : భూపాలం**

ఇన్ని చేతలును జేసె నిందుకొరకే వీడు
కన్నులని పొద్దుపుచ్చీ గదవె నీ కొరకే ॥ఇన్ని॥

మీనమాయె జెమట ల మేను ముంచు కొరకే
తానే కమఠము నాయె దాగు కొరకే
ఆనుకొని కిటియాయె నదలించు కొరకే
మానడు కంబము చాటు మారుమెము కొరకే ॥ఇన్ని॥

కాలుచాచె నేలమీద గమనించు కొరకే
జాలిబెట్టె చేతులనే చంపు కొరకే
యేలికాయె విరహుల నేపెడి కొరకే
శైలమెత్తె నీ కుచములెత్తే కొరకే ॥ఇన్ని॥





కలవెల్ల నిరసించె గదవే నీ కొరకే
కలికియాయెను నీ సంగతి కొరకే
వలపుల వేంకటేశ్వరుడు లోకమున
చెలువముతో మెరసెను నీ కొరకే ॥ఇన్ని॥

**భావామృతం :**

ఓ ధర్మదేవతా! బ్రహ్మసృష్టిని, రుద్రుడు ‘లయ’ కార్యమును నిర్వహిస్తున్నప్పటికీ బహుకష్టతరమైన ‘స్థితి’ బాధ్యతను శ్రీహరి నిర్వహిస్తున్నాడు లోకాలు సురక్షతో వుండాలంటే..ధర్మం చక్కగా రక్షించబడాలి. ధర్మ విఘాతకులైన దుర్మార్గులను తుదముట్టించాలి. ధర్మదేవతకి అండకావాలి. ఇందుకే వీడు (ఈ శ్రీహరి) ఇన్ని చేతలు (పనులు) చేసెను. కన్నులని పొద్దుపుచ్చె కదవే నీకొరకే (జన్మలనెత్తాడు కదటే నీ కోసం...అంటే నిన్ను సుస్థిరంగావుంచటం కోసమే కదమ్మా!)

“మీనమాయె... (మత్స్యావతారం యెత్తి) మేను చెమటలముంచెను” (కష్టించి...వేదములనే కాక,ఋషులను సన్మార్గులను ప్రళయంనుంచి రక్షించాడు)” “తానేకమఠమునాయె దాగు కొరకే” (తానే తాబేలుగా అవతరించి మంధర పర్వతం క్రింద దాగికొని దానిని రక్షించాడు. “ఆనుకొని కిటియాయె నదలించుకొరకే” (ఆనుకొని అంటే, ధరించి...వరాహమైనది, అదలించు కొరకే దనుజులను బెదిరించుటకే). “కంబము చాటుమానడు,మారుమోము కొరకే), “కంబము చాటు మానడు, మారుమెము కొరకే” (స్తంభములో మరొక ముఖముతో దీని కొరకే వున్నాడు...అంటే నరసింహుడై ధర్మరక్షకొరకే దాగి హిరణ్యకశిపుని చంపాడు).

“కాలు చాచె నేల మీద గమనించు కొరకే” (నేల....మీద కాలు చాచి భువనాలన్నీ నింపివేసిన త్రివిక్రముడైనాడు.... దేనికి? గమనించు కొరకు...బలిని పోగొట్టుటకు). “జాలిబెట్టె చేతలనే చంపుకొరకే” (తన బ్రాహ్మణ కర్తవ్యాన్నే త్యజించాడు.....దుష్టులను చంపుకొరకే...పరశురాముడు). “యేలికాయె విరహుల నేపెడి కొరకె” (చక్రవర్తి అయ్యాడు విరహంతో పరితపించుటకే శ్రీరాముడు). “శైలమెత్తె నీ కుచములెత్తే కొరకే” (కొండనెత్తాడు నిన్ను పులకరింపచేయుటకు.....శ్రీకృష్ణుడు)

“కలవెల్ల నిరసించె గదవే నీకొరకే” (నీ కోసం చేయకూడని పనులను కూడా చేశాడు కదా!.... బుద్ధావతారం) “కలికియాయె నీ సంగతి కొరకే” (నీకోసం.. అంటే ధర్మంకోసం కలికి అవతారం యెత్తాడు). ఈ కలియుగంలో నీ కొసమే ప్రేమలుపంచే “శ్రీవేంకటేశ్వరుడై” స్నేహంతో లోకములలో మెరసె..వెలుగులు జిమ్ముచున్నాడు.

6-69

## మున్నుడి

తిరుపతిలో వెలసిన గోవిందరాజ స్వామివారిపై సరస శృంగార కీర్తనను చెబుతున్నారు అన్నమాచార్యుల వారు. శ్రీదేవి, భూదేవి ఆయన పాదాలు ఒత్తి సేదతీరుస్తుంటే, శంఖ చక్రాలు ధరించిన ఆ స్వామి ఒక చేయి తలక్రింద ఉంచుకొని ఠీవిగా పవళించి యుంటాడు. స్త్రీలందరు బారులు తీరి స్వామిని సేవించడానికి ఆయన కొలువుకు చేరుకుంటున్నారు. వారిలో తాను కూడా ఒకతెయై అన్నమయ్య కీర్తన నాలాపిస్తున్నారు. 'సంకె లేక, వువిదల గూడినాడు లోలోన, వారిలో ముచ్చట వినరే' అని విడదీసికోనిదే కీర్తన భావం అర్థం కాదు.

**ఆ.వె॥కొలువు దీరినాడు గోవిందరాజులు**
**చేరి మ్రొక్క వలదె? చెలుల మిపుడు**
**సతులు సేవజేయ సంకు చక్రాలతో**
**అలరినాడు యనెను అన్నమయ్య**

**రాగం : శంకరాభరణం**

కొలువూ జేయించు కొనీ గోవిందరాజు
చెలులము యీడ నుండే చేరి మొక్కరే ॥కొలువూ॥

పవళించి వున్నవాడు పాదాలు చాచుకున్నాడు
జవళి దన యిద్దరు సతులు మీద
రవళి గోవిందరాజు రవ్వగా నవ్వులు నవ్వీ
తివిరి యీ భావము తెలుసుకోరే ॥కొలువూ॥

చేయిచాచుకున్నవాడు శిరసెత్తుకున్నాడు
చాయల గోవిందరాజు సన్నసేసీని
ఆయములు సోకించి అంగనల గరగించీ
కాయపు టిచ్చల నూడిగము సేయరే ॥కొలువూ॥





సంకు జక్రముల వాడు చల్లుచున్నాడు వలపు
కొంకక శ్రీవేంకటాద్రి గోవిందరాజు
వుంకువగా లోలోనే వువిదల గూడినాడు
సంకెలేక వారిలో ముచ్చట వినరే ॥కొలువూ॥

**భావామృతం :**

ఓ వనితల్లారా! గోవిందరాజ స్వామి తన ముద్దు సతులతో కొలువుదీరి యున్నాడు. వారు ఆయనకు ఏకాంత సేవ చేయుచున్నారు. చేరి ఆ స్వామికి చెలలమందరమూ యీడనుండే (ఇక్కడి నుంచే) మొక్కెదము, తరలి రండు.

ఈ స్వామి తన పాదాలను ఠీవిగా చాచుకొని తన ముద్దు సతుల ఒడిలో పాదాలు ఉంచుకొని ఆ ఇద్దరూ, జవళి (జంటగా) తనపాదాలు ఒత్తుచుండగా పవ్వళించి యున్నాడు. ఈ గోవిందరాజు రవళి, రవ్వగా నవ్వులు నవ్వీ (నర్మగర్భంగా కొద్దిగా శబ్దం వచ్చేట్లు నవ్వులు చిలుకరిస్తున్నాడు). ఈ నవ్వుల భావమేమిటో, తివిరి (ప్రయత్నించి) మీరు తెలుసుకోరే (తెలుసుకోండే). వారికి అందుకనే దూరంనుంచే నమస్కరించండి.

ఈ చాయల గోవిందరాజు (కాంతుల జిమ్ము గోవిందరాజు) శిరస్సును ఒకచేత యెత్తి యుంచి, ఇంకొక చేయి చాచుకొని ఉన్నాడు. చాచినచేతితో తన భార్యలకు సన్నలు సేసీని (సైగలు చేస్తున్నాడు). ఆయములు సోకించి (మర్మస్థానములంటి) అంగనలను (తన భార్యలను) కరిగించి (పరవశింప చేయుచున్నాడు). వారికి, కాయపుటిచ్చల(అంతులేని కోరికలు దీరునట్లు) వూడిగము సేయరే (సేవలు చేయండే!)

శంఖ చక్రాలు ధరించియున్న ఈ గోవిందరాజు, కొంకక (భయములేక... అంటే... బిడియము లేక) వలపులు(తన ప్రేమను) వెదజల్లుచున్నాడు. తన ఉవిదల (భార్యలను) గూడినాడు (కలిసియున్నాడు). సంకెలేక లోలోనే ఉంకువగా నున్నాడు (లోపల్లోపలే, యేవేవో అంతులేని ముచ్చటలాడుతున్నాడు). ఓ అమ్మలారా! వారిలో ముచ్చట్లు (రహస్యాలు) వినరే (వినండమ్మా! మీదే అదృష్టం... అంటే)

## 6-70

## మున్నుడి

గొప్ప ఆధ్యాత్మిక కీర్తనను వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఆనాటి కడపజిల్లా తెలుగు మాండలికాలతో ఈ కీర్తన విని తీరాల్సిందే. "మెడవట్టి నూకటం", "వాయెత్త నీయకపోవటం" ఆనాడు విస్తృతంగా వాడబడిన రాయలసీమ మాండలికాలు. పరమాత్మ నిర్ణయం ప్రకారం దైవికంగా కొన్ని మన జీవితంలో జరిగిపోతూనే ఉంటాయి. వాటిని ఆపే శక్తి ఎవ్వరికీ లేదు. జీవుడెంతటివాడు? చిత్తము (మనస్సు) యెంతటిది? శ్రీవేంకటేశ్వరుడు తలుచుకోకపోతే మనగతేమిటి? మనవల్ల యేమవుతుంది చెప్పండి?

**ఉ॥ ఎంతటివాడు జీవుడును యెంతటి దాతని చిత్తమెంచగా**
**ఎంతటి వాడు తానయిన నెవ్విధి దైవికమున్ జయించు శ్రీ**
**మంతుడు వేంకటేశ్వరుని మన్ననగానక నెగ్గజాలునే?**
**ఇంతటి గొప్పకీర్తనము నెవ్విధి జెప్పెనొ! అన్నమార్యుడున్.**

**రాగం : దేశి**

జీవుడెంతటివాడు చిత్తమెంతటిది తన-
దైవికము గడవ నెంతటి వాడు దాను ॥జీవు॥

విడిచి పోవని యాస విజ్ఞానవాసనల
గడచి మున్నాడె నెక్కడి వివేకములు
వుడుగనియ్యని మోహముబ్బి పరమార్థముల
మెడవట్టి నూకె నేమిటికింక నెరుక ॥జీవు॥

పాయనియ్యని మహాబంధ మధ్యాత్మతో
రాయడికి దొడగె సైరణలేల కలుగు
మాయనియ్యని కోపమహిమ కరుణామతిని
వాయెత్తనియ్య దెవ్వరికి జెప్పెదము ॥జీవు॥



భావయామి వేంకటేశం

సరిలేనియాత్మ చంచల మంతరాత్మకు ని-
నెరగనివ్వదు దనకు నేటి పరిణత(తు)లు
తిరువేంకటాచలాధిపుని మన్ననగాని
వెరసి యిన్నిటి గెలువ వెరవు మఱి లేదు ॥జీవు॥

**భావామృతం :**

ఓ మానవులారా! ఆలోచించండి. మనలో ఉన్న జీవుడు యేపాటి సామర్థ్యం ఉన్నవాడు? పాదరసం వలె అతి చంచలమైన వాడి 'చిత్తము' (మనస్సు) యేపాటి సామర్థ్యం ఉన్నది? దైవికముగా (పరమాత్మ నిర్ణయం ప్రకారం) జరిగే వాటిని ఆపగల శక్తి మనిషికి ఉంటుందా? (అసంభవం).

మనలో విజ్ఞానపు వాసన (భగవత్తత్వ జ్ఞానము యొక్క అనుభూతిని కలిగించు 'స్మృతి') వలన వివేకము కలుగుతుంది. కాని విడిచిపెట్టలేని ఆశ అనే భ్రమ, ఎంత వివేకాన్నయినా అణగించి ఉడుగనియ్యని (కృశింపనియ్యని) మోహము కలుగుతుంటుంది. అది, వుబ్బిన (సమృద్ధిగానున్న) పరమార్థమును (మోక్షజ్ఞానమును) 'మెడపట్టి నూకుతుంది' (ఇంట్లోంచి మెడపట్టి గెంటేస్తుంది). ఏమిటి కింక నెరుక? (ఇక జ్ఞానమనేది ఎలా కలుగుతుంది?)

మహా బంధము (మమతానురాగాల వల్ల కలిగే "బాంధవ్యాలు" పాయనియ్యనివి (అతిక్రమించలేనివి). ఆ బంధాలలో కట్టుబడిన 'రాయడి' కి (ధనికుడికి) తొడగె సైరణ లేల కలుగు? (మొదటినుంచి 'సహనం' యెలా అబ్బుతుంది?) వాడిలో ఏదో ఒకమూల మనస్సులో కరుణ ఉన్నా, వాడికి 'ధనమదం' వల్ల మాయనియ్యని (అణచలేని) కోపము యొక్క మహిమ, ఆ కరుణామతిని వాయెత్త నియ్యదు (నోరు విప్పనివ్వదు). ఎవ్వరికి చెప్పెదము? (మనం ఎవరికేమి చెప్పగలము?).

సరిలేని ఆత్మ (ఇంకొక దానితో పోల్చలేని ఆత్మ) మహా చంచలమైనది. మన అంతరాత్మ, పరమాత్ముని అంశ అయిననూ అది నినెరగనివ్వదు (తనెవరో తెలుసుకోనివ్వదు). ఇక 'తనకున్ యేటి పరిణతులు?' (తనలో మార్పు ఎలా కలుగుతుంది? అసాధ్యం. కానీ తిరుమలాధిపుడు, శ్రీవేంకటేశ్వరుని మన్ననన్ కొని (ఆదరణ కలిగితే) వీటన్నిటిని వెరసిగెలిచి (చివరికి జయించి) వర్ధిల్లుతాడు. ఇక వాడికి భయములేదు.

6-71

## మున్నుడి

తిరుమలలో స్వామివారి ఉద్యానవనంలో పూచిన పూలతో పుష్పయాగం నిర్వహిస్తారు. రకరకాలైన పుష్పాలతో స్వామిని నిలువెత్తునా అలంకరిస్తారు. నయనానందకరమైన ఆ సంప్రదాయం నేటికీ అలా కొనసాగుతూనే ఉన్నది. అన్నమాచార్యులవారు ఒకనాటి పుష్పయాగం సందర్భంగా గానం చేసిన మధురమైన కీర్తన ఇది. స్వామికి పురాణకాలంలో జరిగిన 'పుష్పయాగాలను' కూడా వివరిస్తున్నారు. నాటి భారతయుద్ధంలో పార్థసారథి 'యైన స్వామిపై భీష్ములవారు వేసిన శరపరంపరలే అర్జునుడు చేసిన పుష్పయాగం అంటున్నారు.

**కం॥ అందరు జేసే పూజలు**
**అందంబగు "విరుల పూజ"లన్నయ్యనెరా**
**పొందుగ కిరీటి రణమున**
**విందుగ 'శర విరుల' పూజ వెలయించె ననెన్.**

**రాగం : హంసనాదం**

పూజలందరు జేసేదే పుష్పయాగము
అజి నర్జునుడు చేసినది పుష్పయాగము ॥పూజ॥

మొదట శ్రీసతి చేతి మోహన కమలమే
పొదల నీకెపుడును పుష్పయాగము
గుదిగొని మిమ్మిద్దరిని గూడించే మరు విరులు
పొదిగి పూజించిన పుష్పయాగము ॥పూజ॥

మాలాకారుడిచ్చిన మధురలో పూదండ
పోలింప నీకునదె పుష్పయాగము
కేలితో నారదుడొసగిన పారిజాతము
భూలోకమున నీకు పుష్పయాగము ॥పూజ॥





తొరలి అలమేల్మంగ తురుమున విరులే నీకు
పొరలి నీవురముపై పుష్పయాగము
సిరులతో మునులెల్ల శ్రీవేంకటాద్రిశ నీకు
పొరిపొరి జేసేరు పుష్పయాగము ॥పూజ॥

**భావామృతం :**

ఓ దేవదేవా! అందరూ నీకు ప్రీతి కలుగుటకు యజ్ఞమూర్తివైన నీకు అనేక యాగాలు చేస్తుంటారు. అందులో పుష్పయాగం ఒకటి. ఈ సంప్రదాయం నేటికి కాదు. ఆనాడు 'అజిన్' (భారతయుద్ధంలో) అర్జునుడు చేసినది కూడా శర పరంపరల పుష్పయాగమే.

మొట్టమొదట క్షీరసాగర సంజనితయైన శ్రీలక్ష్మి చేతనున్న మోహన కమలమే నిన్ను స్పృశించి, నీకెప్పుడు ఒక పుష్పయాగము వలె పొదలినది (వర్ధిల్లినది) ఆదిదంపతులైన మీ ఇద్దరినీ, గుదిగొని (అతిశయించి) కూడించే (జతయగునట్లు చేయు) మరు విరులే (మన్మథ బాణములే) పొదిగి (సామూహికముగా) పూజించిన పుష్పయాగము.

అలనాడు నీ శ్రీకృష్ణావతారములో నీవు కంసుని మధురానగరం సందర్శించినప్పుడు, ఒక మాలాకారుడు (పూలదండలు చేయువాడు) భక్తితో నీకు ఒక పూదండ సమర్పించినాడు. పోలింప(పోల్చి చూడగా) నీకు భక్తితో వేసిన ఒక చిన్న పూదండయే పుష్పయాగం వలె నిన్నానందపరచినది. కేలితో (తన స్వహస్తాలతో) నారదుడు ఆనాడు ద్వారకలో నీకు పారిజాత పుష్పం ఇచ్చి సత్యభామ గర్వభంగమను నీ కృష్ణలీల ప్రదర్శింపచేసినవైనమే భూలోకంలో ఆ ముని నీకు నిర్వహించిన పుష్పయాగము.

ఓ శ్రీనివాసా! ఈనాడు కలియుగంలో తిరుమలలో అలమేలుమంగమ్మ తురుమున (కొప్పులో) తొరలిన (ఉన్నటువంటి) విరులే (పూవులే) నీ వురముపై నిర్వహించబడిన పుష్పయాగం (ఆచార్యులవారి ఈ మాటకు అర్థం తిరుమలేశునికి తెలుసు) సరే, అవన్నీ నీ లీలలే. కాని తిరుమలపై అదృశ్యరూపులైన మునీశ్వరులంతా పొరిపొరి (మాటిమాటికీ) పుష్పయాగం చేస్తే పుష్పాలు రాలి మాకు పూలవర్షంలా కనిపిస్తోంది. అదికూడా నీ లీలయే తండ్రీ!

## 6-72

## మున్నుడి

శ్రీహరినామ సంకీర్తన యొక్క మహిమను వివరిస్తున్నారు అన్నమాచార్యులవారు. శ్రీమన్నారాయణుని నామము బుద్ధిని (వివేకము నాసించే మనస్సును) చేరినా (దగ్గరైనా) చాలును. దానితో పోలిస్తే, సిరులేమి 'బాఁతి' అంటున్నారు. అంటే ఈ సంపదలు వైభవాలు యేమి "ఎక్కువ?" అని ప్రశ్నిస్తున్నారు. 'బా' తరువాత 'c' (అరసున్న) వుండితీరాలి. ఈ కీర్తనలోని చాలా తెలుగు మాటలు నేడు వాడుకలో లేవలీవీ. నిఘంటువులన్నీ తిరగవేయకపోతే లాభంలేదు.

**మ॥ నరుడా! నామము చాలదా, మదిని ఓ నారాయణా యన్నచో**
**వరమై బుద్ధిని జేరినా, సరికదా! పాపాలు తెంచున్ కదా!**
**సిరులింకేటికి? 'బాఁతి' యౌనె! అనెరాచేబూని అన్నయ్యయున్**
**హరి! నీ ప్రేరణ, 'భావమున్' తెలిపితిన్ ఆరాధనే నీకిదై.**

**రాగం : సామంతం**

నారాయణ నీ నామము బుద్ధి-
జేరినా జాలు సిరు లేమి "బాఁతి" ॥నారాయణ॥

ననుపైన శ్రీ విష్ణునామము పేరు-
కొనగానే తేకువమీరగా
ఘనమైన పుణ్యాలు గలుగగా తమ-
కనయము బర మది యేమి "బాఁతి" ॥నారాయణ॥

నలుపైన శ్రీహరి నామము మతి-
దలచిన నా బంధము లూడగా
యెలమి దీని బఠియించినా యీ-
కలుషము లేల కలుగు నెవ్వరికి ॥నారాయణ॥





వేంకటపతి నామవిభవము కర్మ-
పంకములెల్ల బరిమార్పగా
బింకమై తలపెడి ప్రియులకు, యెందు-
నింక నీ సుఖమిది యేమి 'బ్రాఁతి' ॥నారాయణ॥

**భావామృతం :**

ఓ నారాయణమూర్తీ! నీ నామము మా బుద్ధిని (వివేకమునాసించు మనస్సును) జేరినా (దగ్గరైతే) చాలును. మాకు సిరులేమి "బాఁతి" (యెక్కువ)? అంతకన్నా అదృష్టమేమున్నది?

నను పైన (ఇంపైన) 'విష్ణుమూర్తి' నామమును పేరుకొనగానే (ఉచ్చరించగానే) తేకువ మీరుతుంది. (ధైర్యము కలుగుతుంది). ఘనమైన పుణ్యములు కలుగుతాయి. ఇది సత్యం. దానితో పోల్చిచూస్తే, "తమకు అనయమున్ పరము అదియేమి బాఁతి" (మీకు అవశ్యముగా పైనున్న స్వర్గం లభిస్తే అది ఏమి ఎక్కువ?)

నలుపైన శ్రీహరి నామము (అంటే... నల్లని శ్రీహరి అనికాదు. సామర్థ్యముగల విష్ణునామము, అని అర్థం) ఆ నామాన్ని మనస్సులో స్మరిస్తే చాలును. బంధములన్నీ (పీకులాటలన్నీ) తొలగిపోతాయి. దీనిని యెలమి( సంతోషంతో) పఠించినా (పలికినా) చాలును. అలా చేస్తే ఎవ్వరికైనా కలుషములు (పాపములు) యేల కలుగును?

ఈ దుస్సహమైన కలియుగంలో వేంకటేశ్వరుని "ఓం నమో వేంకటేశాయ" అని అంటే చాలును. ఆ నామ వైభవము కర్మపంకమును (దుష్కర్మల వల్ల అంటిన బురదను) పరిమార్చగా (కడిగివేస్తుంది) కదా! ఇక, బింకమై తలపెడి ప్రియములకు (గర్వమును పెంపొందింప జేసే కోరికలు) సిద్ధించినా దానివల్ల కలిగే సుఖములు యేమి బ్రాఁతి? (ఏమి యెక్కువ?) ఆ సుఖాలు రేపు దుఃఖాలవుతాయి. వాటివల్ల ఏమి ఉపయోగమూ లేదు.

## 6-73

## మున్నుడి

దేవి అలమేలుమంగ మీద మధురమైన కీర్తననందిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఆమె చెక్కిళ్లు మెరిసిపోతున్నాయట. "తరి తొడి రతులను దైవారవమ్మా" అంటున్నారు. నీ స్వామికి చేరువై క్రీడించి అతిశయించవమ్మా అని జగన్మాతకు సలహా ఇవ్వగల సత్తా ఒక్క ఆచార్యులవారికే ఉన్నది. "మరి హరి మురిసి కరిగిపోడా"!.. అని నాకూ అనిపించింది. కీర్తన ఆఖరి చరణాలలో నాకు ఒక మెలిక కనిపించింది. అదేమిటో తెలియాలంటే భావామృతం చదవక తప్పదు, మరి. ఆచార్యులవారు దేవి చెలికత్తె! అయ్యారు.

**తే॥ మెరుగు చెక్కుల వో అలమేలుమంగ!**
**రతుల దైవారవమ్మ! శ్రీరమణుతోడ**
**సరస శృంగార గీతి శ్రీసతికి పాడె**
**అన్నమార్యుడు తనివార హరి మురిసెను.**

**రాగం : బిందుమాలిని**

మెరుగు చెక్కుల అలమేలమంగా
తరి తోడి రతులను దైవారవమ్మా ॥మెరుగు॥

చనవులు నీకిచ్చి చక్కని వదనమెత్తి
పెనగీనాతడు నిన్ను బ్రేమతోడను
కనువిచ్చి చూడవమ్మ కందువల నవ్వవమ్మ
మనసిచ్చి యాతనితో మాటలాడవమ్మా ॥మెరుగు॥

పొందులు నీతో నెరపి పూచి నీపై చేయివేసి
చిందీ నీపై నతడు చిఱుచెమటలు
విందుల మోవియ్యవమ్మ వేడుకలు చూపవమ్మ
అందుకుని ఆకుమడిచాతని కీయవమ్మా ॥మెరుగు॥





గక్కునను గాగిలించి కరుణ నీపై నించి
ఇక్కువ గూడె శ్రీవేంకటేశుడు నిన్ను
వక్కణ లడుగవమ్మ వన్నెలెల్లా జూపవమ్మ
నిక్కుచు నురముమీద నిండుకొనవమ్మా ॥మెరుగు॥

**భావామృతం :**

తల్లీ! అలమేలుమంగా! నీవు మెరిసిపోతున్న చెక్కిళ్ళుగల దేవివమ్మా! శ్రీరమణుడు నీకు తఱితోడ (చేరువయై) రతులతో దైవారవమ్మా! (అతిశయించవమ్మా!)

ఓ దేవీ! చనవులు (అనురాగము) నీకిచ్చిన స్వామి నీ చక్కని ముఖమును చేతితో పైకెత్తి ప్రేమతో పెనగినాడు. అరవిందాక్షులను విప్పారించి నీ విభుని వీక్షించవమ్మా! కందువల (ఏకాంత స్థలమైనందున) మనస్ఫూర్తిగా నవ్వవమ్మా! మనస్సు విప్పి మాట్లాడవమ్మా!

నిన్ను పొందిన నీ స్వామి తన చేతులు నీపై వేసినాడు. స్వామి చెమటలు నీపై చిందినవి. ఇక విందైన నీ అధరమా అందాల స్వామికి అందియ్యవమ్మా! నీ సంతోషము ప్రకటించవమ్మా! ఆయనకు అందుకుని (తీసికొని) నీ చేతితో సాదరంగా, ఆకుమడి చాతనికి అందియ్యవమ్మా! (తాంబూలం అందియ్యవమ్మా!)

ఓ దేవీ! ఆ శ్రీవేంకటేశుడు గక్కున (హఠాత్తుగా) నిన్ను పరిష్వంగము చేసికొని, నీపై కరుణ జూపి నిన్ను కూడినాడు. నీవు అంతలోనే మైమరచిపోవద్దు. వన్నెలు జూపవమ్మా (నీ చాతుర్యమును చూపి) స్వామిని, ఇక్కువ వక్కణ లడుగవమ్మా! (ఇప్పటిదాకా ఎక్కడ ఉన్నాడో ఈ ఆలస్యానికి కారణమేమిటో, వ్యాఖ్యానించమని అడుగవమ్మా!) ఆ తరువాత నిక్కుచు (గర్వముతో) ఆయన వురము నెక్కవమ్మా! (స్వామి హృదయ పీఠికనధిష్టించవమ్మా! నీదే భాగ్యమంటే).

**6-74**

## మున్నుడి

పరమాత్మను యోగులు, మునులు నిరాకార నిర్గుణ పరబ్రహ్మగా గుర్తించి ధ్యానంలో, తమ చిత్తము లగ్నం చేసి మోక్షం పొందారు. కొంతమంది సాకారుడైన శ్రీహరిగా చింతించి ఆయన శరణాగతిని బొంది నిరంతరం కీర్తించి ముక్తిని పొందారు. అన్నమాచార్యులవారు రెండవ మార్గం యెన్నుకొని 32 వేలు పైగా కీర్తనలు రచించి హరి సాయుజ్యం పొందారు. ఆ పద్మాక్షుని నామ సంకీర్తనము, శరణాగతి, కీర్తనము, పూజనము భక్తివలన తరించానంటున్నారు. తిరుమలేశుడు పట్టినవారికి బలువగు కొమ్ము అంటున్నారు. అంటే...

**కం॥ ఓహో! నిలిచిన దొకటిదె**
**శ్రీహరి సాకారరూప చింతనము భళా!!**
**ఈహితము దీర్చగలదనె**
**ఆహా! అన్నయ్యపొగిడె హరిచింతనమున్**

* ఈహితము = కోరబడినది (కోరిక)

**రాగం : శ్రీరాగం**

ఓహో నిలిచిన దొకటిది యే
శ్రీహరి సాకార చింతనము ॥ఓహో॥

పంచమ వేదపు పద్మాక్ష నామము
అంచెపాపహర మౌషధము
పంచల పీతాంబరు శరణాగతి
ముంచిన అజ్ఞానమునకు దీపము ॥ఓహో॥

విందుల కుడుపులు విష్ణుకీర్తనము
చందపు వైకుంఠ సంబళము
పొందుగ నచ్యుతు పూజించు పూజలు
కిందట గొనకెక్కెడి నిచ్చెనలు ॥ఓహో॥



భావయామి వేంకటేశం

కట్టిన ముడుపగు ఘనకృష్ణభక్తి
ముట్టిన పాపవిమోచనము
యిట్టి శ్రీ వేంకటేశ్వరుని కృప యిది
పట్టిన వారికి బలువగు కొమ్ము ॥ఓహో॥

**భావామృతం :**

ఓహో! (ప్రజలారా) ఈ ప్రపంచంలో స్థిరముగానిలిచియున్నది యొక్కటియే సుమా! తక్కినవన్నీ అశాశ్వతమైనా, నేటికీ శ్రీహరి యొక్క సాకారచింతనము (ఒక రూపమువున్న వాడను భావన) నిలిచియున్నది (వర్ధిల్లుతూనే వున్నది).

శ్రీమన్నారాయణుడు పంచమవేదముగా కీర్తించబడుతున్న మహాభారతములోని నాయకుడు. ఈ పద్మనయనుని నామ పారాయణము, అంచపాపహరము (అంచెలంచెలుగా హరించును). అట్లు హరించుటకు ఆ దేవుదేవుని నామము దివ్యౌషధము వలె పనిచేయును. పీతాంబరుని (పసుపు పచ్చ రంగుగల పట్టు వస్త్రము ధరించు స్వామి) పంచల శరణాగతి (సర్వశ్రేష్ఠమైన శరణాగతి, అధికమైన అజ్ఞానాంధకారమును పోద్రోలు దీపము.

విష్ణుదేవుని కీర్తనము, విందుల కుడుపులు (విందు భోజనమై) వైకుంఠ సమారాధన వలె అందరినీ తృప్తి పరచును. అచ్యుతునికి చేయు పూజలు పొందుగ (చక్కగా) గొనకెక్కు (మోక్షపథము చేరగల) నిచ్చెనలు. (మెట్లు కావు కాబట్టి, జాగ్రత్తగా ఎక్కాలి. ఎంత ఎక్కువ కెక్కితే అంత పడిపోయే ప్రమాదం ఉన్నది).

ఘనుడైన కృష్ణపరమాత్మపై అచంచల భక్తితో ముడుపులు (మ్రొక్కుబడులు) కడితే, అవి ముట్టిన (అంటుకొనిన) పాపములను నిర్మూలిస్తాయి. ఇదేవిధంగా శ్రీవేంకటేశ్వరుని కరుణను పొందితే యిది పట్టినవారికి బలువగు కొమ్ము (బలిష్టమైన కొమ్ము). సంసారసాగరంలో పడి దిక్కు తెలియక కొట్టుకుపోతుంటే... ఆ కొమ్ము దొరికిందంటే దాన్ని పట్టుకొని రక్షించుకోవచ్చును).

## 6-75

### మున్నుడి

తిరుమలపై శ్రీ వేంకటేశ్వరుని రథోత్సవంలో పాల్గొన్న అన్నమాచార్యులవారు తిరువీధులలో ఊరేగింపుని కీర్తిస్తున్నారు. ప్రతివీధిలోను శ్రీవేంకటేశ్వరుడు తన ఇద్దరు సతులైన శ్రీదేవి, భూదేవి రథముపై కూర్చుండగా ఊరేగుతున్నాడు. ఓ జనులారా! మీరంతా సంతోషంతో మొక్కండి. గోవిందా! గోవిందా! అని స్వామి నామము ఘోషగా వినపడుతోంది. అప్సరసలు నర్తిస్తున్నారు, గంధర్వప్రముఖులు మధురంగా గానం చేస్తున్నారు. ఆ కమనీయ దృశ్యాన్ని మనోనేత్రంతో వీక్షించండి.

**ఆ.వె॥ విభుడు తానదేగె వీధి వీధులలోన**
**మొక్కరయ్య! జనులు ముదముతోడ**
**హరిని సన్నుతించె ఆ నాడు ఊరేగ,**
**అద్భుతముగ పాడి అన్నమయ్య.**

**రాగం : శుద్ధసావేరి**

వీధుల వీధుల విభుడేగీనిదె
మోదము తోడుత మొక్కరో జనులు ॥వీధుల॥

గరుడధ్వజమదె కనక రథంబదె
అరదముపై హరి అలవాడే
ఇరుదెసలనున్నారు ఇందిరయు భువియు
పరగె పగ్గములు పట్టరో జనులు ॥వీధుల॥

ఆడేరదివో అచ్చరలెల్లరు
పాడేరు గంధర్వ పతులెల్ల
వేడుకతో వీడె విష్వక్సేనుడు
కూడి యిందరును కొలువరో జనులు ॥వీధుల॥





శ్రీవేంకట గిరి శిఖరము చాయదె
భావింప బహువైభవములవె
గోవింద నామపు ఘోషణవిలిడుచును
దైవంబితడని తలవరో జనులు ॥వీధుల॥

**భావామృతం :**

ఓ జనులారా! విభుడు (జగన్నాథుడైన శ్రీవేంకటేశ్వరుడు), వీధుల వీధుల నేగీ (ప్రతి వీధిలోను ఊరేగుచున్నాడు). ఇదె (ఇదిగో) మోదముతోడుత (సంతోషముతో) మొక్కండి.

ఓ జనులారా! అదిగో అల్లదే గరుడధ్వజము. అదే దేవుడు అధిరోహించిన కనకరథము (బంగారు రథము). అరదముపై (రథముపై) శ్రీహరి అలరియున్నాడు. స్వామికి ఇరువైపులా శ్రీలక్ష్మి, భూకాంత పెండ్లి కూతుళ్ళై శోభిల్లుచున్నారు. రథములాగుటకు కావలసిన పగ్గాలు (త్రాళ్లను) పట్టుకొనుడు.

ఓ జనులారా! అదిగో అదే అచ్చరలు (అప్సరసలు) సంతోషముతో నర్తించుచున్నారు. గంధర్వపతులెల్ల అదే పాడేరు (గానము చేయుచున్నారు). ఇదిగో వీడే విష్వక్సేనుడు. శ్రీహరి సేనాధిపతి అగుటచేత ఇతగాడు మిక్కిలి వేడుకతో నున్నాడు. మీరింతమంది కూడి స్వామిని కొలిచి తరించండి.

ఓ జనులారా! శ్రీవేంకటశైల శిఖరము యొక్క చాయ (నీడ) అదిగో. మీరు భావించుటకై (ఊహించుటకు) అనేక వైభవములు స్వామికి అమరియున్నవి. భక్తులు గోవిందా! గో...విందా! అని నినాదములు చేయుచున్నారు. ఆ ఘోషణ వినండి. ఈ శ్రీవేంకటేశ్వరుడే దైవమని గ్రహించి, స్వామిని తలవరో (ధ్యానించుడు).

## మున్నుడి

ఏడుకొండలవాడి కళ్యాణమహోత్సవం జరుగుతోంది. పరవశించి అన్నమాచార్యులవారు పాడుతున్నారు. ఆయన మనోనేత్రానికి శ్రీనివాసుడు పద్మావతీదేవి వరుడు వధువుల స్థానంలో కనిపిస్తున్నారు. ఆ నవవధూవరుల తమకాన్ని వర్ణిస్తున్నారు. వారు నేడు వధూవరులే కానీ నిజానికి కంతుని (మన్మథుని) వోజలు (తల్లిదండ్రులు). నేడు ఈ పెండ్లి కలిగెగా (జరుగుతోంది కదా!) దీన్ని చూచే మహద్భాగ్యం దక్కినది. మాకు ఇది ఇంత చాలదా? అంటున్నారు. "చెంతల మీకిట్టి పెండ్లి చెల్లెగా"... అంటే... చదవండి.

**కం॥ కంతుని వోజల పెండ్లిన్**
**అంతయు నా అన్నమయ్య ఆలాపించెన్**
**ఇంతటి భాగ్యము చాలదె!!**
**చెంతల మీకిట్టి పెండ్లి చెల్లెను అనెబో.**

**రాగం : కాంబోది**

ఇంత చాలదా మాకు నిది నేడు
కంతుని వోజల పెండ్లి గలిగెగా నేడు ॥ఇంత॥

కాంతకును నీకును కనురెప్పలె తెర
దంతపు నవ్వులే మీకు తలబాలు
రంతుల వూరువులె రవళి సోబనాలు
చెంతల మీకీపెండ్లి చెల్లెగా నేడు ॥ఇంత॥

ముదితకు నీకును మోవులే బువ్వములు
కదియు సిగ్గులె మంచి కమ్మగందాలు
సదరపు సరసాలె చట్ట వెద వీడేలు
యెదురెదురనె పెండ్లి యెసగెగా నేడు ॥ఇంత॥





వుంచపు గోరితాకులె వుంకువ సొమ్ములు
ముంచన పలు సోకులె ముయికి ముయి
యెంచగ శ్రీవేంకటేశ యిందిర నీకూటములు
కంచపు బెండ్లి మీకు గలిగెగా నేడు ॥ఇంత॥

**భావామృతం :**

ఓ దేవదేవా! ఏడుకొండలవాడా! ఇంత ఇది (అదృష్టం) చాలదా మాకు? స్వయంగా కంతుని (మన్మధుని) వోజల పెండ్లి (తల్లిదండ్రుల పెండ్లి) వీక్షించే భాగ్యం దక్కింది. ఇది ఏనాటి పుణ్యమో!!

ప్రభూ! నీవూ నీ వధువూ రెప్పవాల్చక చూసుకుంటున్నా సిగ్గుతో, ఒక్కసారి ఇద్దరూ కళ్ళుమూసుకొనినారు. అదే మీకు 'తెరచాటు' అనే పెండ్లి తంతు అయింది. ఒకరిని చూచి ఒకరు పలువరుస కనబడేట్లు నవ్వుకొంటున్నారు. ఆ దంతపు నవ్వులే ఒకరిపై ఇంకొకరు పోసే ముత్యాల తలంబ్రాలవలె నున్నవి. రంతుల వూరువులే, రవళి సోబనాలు (ఈ సయ్యాటలలో "ఆయాసం" తో మీరిద్దరూ తీసికొనే దీర్ఘ ఉచ్ఛ్వాస నిస్వాసములే పెండ్లిలో మంగళగీతముల వలెనున్నవి). చెంతల మీకీ పెండ్లి చెల్లెగా నేడు (ఒకరికొకరు బాగా దగ్గరయిన మీ ఇద్దరికి ఈ పెండ్లి నేడు చెల్లెగా (ఈరోజు అయిపోయింది కదా!)

ముదితకు నీకును మధురాధరాస్వాదనమే, బువ్వములు (పెండ్లిలో తమ బంధువులతో కలిసి వధూవరులు చేయు పెండ్లి భోజనం). మీ ఇద్దరి నును సిగ్గులే కమ్మటి మంచి గంధము. సమానస్థాయిలో ఆడపెళ్ళివారు మగపెళ్ళివారు ఆడుకొనే సరసోక్తులే ఒకరికొకరు ఇచ్చుకొనే తాంబూలముగా భాసిల్లినవి. మీ ఇద్దరూ ఒకరి యెదురుగా ఇంకొకరు పెండ్లియాడినారు.

అటు పిమ్మట మీ కేళీ విలాసములలో, మీ ఇద్దరి నఖక్షతములే మనోహరమైన ఆభరణాల వలె తోచినవి. మీ పరస్పర స్పర్శలే, ముయికిములు (ఒకరికొకరు ఇచ్చుకొను "బదులుకు బదులు"). మనోనేత్రంతో ఆ దృశ్యం యెంచగలిగిన వారికి, ఓ శ్రీవేంకటేశ్వరా! నీవూ ఇందిర ఈ విధంగా కలియగా నీ కూటములు, నేడు మీకు కంచపు పెండ్లి కలిగెగా... (గొప్ప పెండ్లి మీ ఇద్దరికీ జరిగింది).

## 6-77

## మున్నుడి

నరసింహస్వామిపై చక్కటి కీర్తన నాలపిస్తున్నారు అన్నమాచార్యులవారు. స్వామి సుగ్రీవనారసింహుడట. అంటే సొగసైన కంఠముగల నారసింహుడట. స్వామి మెడ బహు అందముగా ఉంటుందట. వాడే ఆ సుగ్రీవనారసింహుడు చూడండయ్యా! వాడు అగ్రపూజ గొన్నవాడు (సర్వశ్రేష్ఠుడని పూజలందుకొన్నాడు). వాడు అనాదియైన సింహము. శ్రీవేంకటాద్రి మీదనున్న బుధులెల్లా (బుద్ధిమంతులందరూ) పూనుకొని ఈ మానవ సింహాన్ని కొలువుడయ్యా! అంటున్నారు.

**ఆ.వె॥చూడరో! ఇతండు సుగ్రీవ నరసింహు**
**డాదిసింహమందె నగ్రపూజ**
**పూని వేంకటాద్రి బుధులెల్ల గొల్వుడీ**
**అన్నమయ్య పాడెనమృతగీతి.**

**రాగం : లతాంగి**

సుగ్రీవ నారసింహుని చూడరో వాడె
అగ్రపూజగొన్నవాడు ఆదిసింహము ॥సుగ్రీవ॥

దేవతలు జయవెట్టి దీవినుండి పొగడగ
దేవులతో కూడున్నాడు దివ్యసింహము
భావింప నెట్ట నెదుట ప్రహ్లాదుడుండగాను
వేవేలు నవ్వులు నవ్వీ విజయసింహము ॥సుగ్రీవ॥

అసురులను గెలిచి అదె సింహాసనముపై
వెస కొలువున్నాడు వీరసింహము
పసిడి వర్ణముతోడ బహుదివ్యాయుధాలతో
దెసల వెలుగొందీని ధీరసింహము ॥సుగ్రీవ॥





నానాభరణాలు వెట్టి నమ్మిన దాసుల నెల్ల
ఆనుకొని రక్షించీ ప్రత్యక్షసింహము
పూని శ్రీవేంకటాద్రిని బుధులెల్లా కొలువగా
నానావరము లొసగీ మానవసింహము ॥సుగ్రీవ॥

**భావామృతం :**

ఓ ప్రజలారా! ఈ నరసింహుడు, సుగ్రీవ (మంచి కంఠము గలవాడు). చక్కటి ఈ స్వామి ఆదిసింహము (ఎన్నడో కృతయుగంనాటి వాడు). దేవతలు, మునులు, నరులు అందరిచేత ప్రథమపూజలందుకొనినవాడు.

నింగినుండి, సకల దేవతలు ఈయనకు జయ జయధ్వానములు చేయుచుండగా దివ్యుడైన ఈ సింహము దివ్యశోభలీనుచున్నాడు. తనయెట్టెదురుగా ప్రహ్లాదుడు భావించి సన్నుతించగా ఈ విజయవంతమైన సింహము విస్తృతంగా నవ్వులొలికిస్తూ శోభిల్లుతున్నాడు. ఈయనకు మొక్కండి.

ఇదిగో, ఈ వీరసింహము హిరణ్యకశిపుడు వాని రాక్షస అనుచరులందరిని గెలిచి విజయగర్వంతో సింహాసనం మీద కొలువు దీరియున్నాడు. బంగారు వర్ణముగల దేహచ్ఛాయతో అనేక దివ్యాయుధములతో ఈ ధీరసింహము దిక్కులన్నిటిలోను కాంతులు విరజిమ్ముచున్నాడు.

అనేక రకములైన దివ్యాభరణములను ధరించిన ఈ నరసింహుడు తనను నమ్మిన దాసులను విడువకుండా అనుగ్రహించుటకై ఆనుకొని (దగ్గరయై) ప్రత్యక్షముగా రక్షించుచున్నాడు. శ్రీవేంకటాద్రిపైనున్న బుద్ధిమంతులందరూ పూనుకొని కొలువగా అనేక వరముల నొసగేటి ఈ నరసింహుని శరణు వేడండి.

**6-78**

## మున్నుడి

బాలకృష్ణునిపై సరస శృంగార కీర్తన చెబుతున్నారు అన్నమాచార్యులవారు. గోపికలు యశోదకు కొంటెకృష్ణుని ఆకతాయితనాన్ని వివరిస్తున్నారు. ఏమి చెప్పమంటావమ్మా! ఈ గామిడి బాలుడు (దుష్టుడైన పిల్లాడు) వుట్లు పగులకొడతాడు. కన్నె గోపికల అధరామృతం వదలడు, వాడిధైర్యం యేమని చెప్పము? ఆడపిల్లలతో పరాచికాలాడతాడట. ఇంతా చేసి ఈ చిన్ని బుడ్డోడు యెవరనుకున్నారు? అఖండ ప్రేమాస్పదుడైన శ్రీవేంకటేశ్వరుడే నంటున్నారు.

**ఉ॥ ఏమిటి సేతుమమ్మ యిక నీతని మేము యశోద చెప్పవే**
**గామిడి బాలుడీతడటు గట్టిగ వుట్లను కొట్టి త్రెంచునే**
**దీమసమేమి జెప్పెదము తీపుల కన్నెల మోవిగ్రోలునే**
**ప్రేమల జూపు ఈ బుడత వేంకటనాథుడు అన్నమయ్యనెన్.**

* **దీమసము = ధైర్యము**

**రాగం : దేశాక్షి**

ఏమి సేతుమమ్మ నేము యెశోదమ్మ
గామిడితనములనే కడగీ బాలుడు ॥ఏమి॥

అందెలు మువ్వలు ఘల్లురనగ వీదివీదుల-
నందుక వుట్లుగొట్టీనదె బాలుడు
గొందినున్న బోనీక కోలలు చాచిచాచి
పొందుగ దొండ్లువోవ బొడిచీ మీ బాలుడు ॥ఏమి॥

చుంగుల కాశతోడ సొరిది బాలులతోడ
ముంగిటి వుట్లు గొట్టీ ముద్దుబాలుడు
అంగలించి గొల్లెతలు అడ్డములు రాగానే
యెంగిలి సేసీ మోవులు యిదిగో మీ బాలుడు ॥ఏమి॥





చొల్లెపు జెడ వీపున సోయగమై వేలగాను
చిల్లరవుట్లు గొట్టీ జిన్ని బాలుడు
మెల్లనె సతులు దాను మేలములాడుకొంటా
ఇల్లిదె శ్రీవేంకటాద్రి యెక్కెను మీ బాలుడు ॥ఏమి॥

**భావామృతం :**

ఓ యశోదమ్మా! నేము (మేము) మీ పిల్లవాణ్ణి ఏమి చేయగలమమ్మా? మీ బాలుడు, కడగీ గామిడి తనముల (దుర్మార్గము) వున్న కుఱ్ఱవాడు.

మీ బాలుడు, తనకాలి అందెలు ఘల్లుఘల్లుమని ధ్వనిస్తుంటే వీధులలో పోయి వుట్లలో కట్టిన పాలు వెన్నలను అందుకొని పాడుచేస్తాడు. వాటిని గొందినున్న బోనీక (దాచుకొన్నా వదలక) తన ముల్లుగఱ్ఱ చాచి చాచి కుండలకు చిల్లులు పడునట్లు పొడిచి మీ బాలుడు మా పాలు నేలపాలు చేస్తాడు. వాని ఆకతాయితనము నేమని చెప్పమమ్మా!

ఓ యశోదా! మీ ముద్దుబాలుడు కుచ్చిళ్లుపోసి కట్టుకొన్న వస్త్రముతోనున్న తన ఈడు కుఱ్ఱవాళ్లతో కలిసి మా ముంగిటింట్లో వుట్లను పగులకొడతాడు. అంగలించి (నానా తిప్పలు పడి) గొల్లభామలు అడ్డము వస్తే వాళ్లకు యెంగిలి ముద్దులు పెడతాడు. ఇదిగో ఇక మీ బాలుని మేము భరింపలేమమ్మా.

ఓ యశోదా! వీడు చొల్లెపు జడతోడ (ముడివేసి చుట్టుచుట్టి కొప్పులాగ కట్టిన జడ) తన వీపుపై సోయగమై (సొగసుగా) వ్రేలాడుతుంటే చిల్లరవుట్లను (చిన్న చిన్న ముంతలున్న వుట్లను) పగలగొడతాడు. దొంగలాగ మెల్లగా అమ్మాయిల దగ్గర చేరి మేలమాడుకొంటూ (సరసాలాడుతూ) వుంటాడు. అదేమిటని గదమాయిస్తే, ఇల్లిదే (ఇదిగో) మీ పిల్లాడు ఈ వేంకటాద్రి యెక్కి కూచున్నాడు. ఈ తిరుమలయ్యని యేమనగలమమ్మా.

**6-79**

## మున్నుడి

అన్నమాచార్యులవారు కైవల్య పదమునకు దగ్గర దారి కనుక్కొన్నారు. ఆయన గురువు శ్రీరామానుజుల వలె ఆయన ఆ ఉపాయాన్ని యెలుగెత్తి బట్టబయలు చేస్తున్నారు. కలకాలమూ శ్రీహరి కథాశ్రవణము, శ్రీపతి కీర్తనమూ, శ్రీనాథుని నిజకైంకర్యము, శ్రీవేంకటేశ్వరుని శరణాగతి, పద్మనాభుని పావన నిత్యస్తోత్రం – ఇవి ఆ కైవల్య మార్గం చేరటానికి దగ్గర దారులు. ఇవన్నీ మనకు సత్ఫలితాన్ని ఇచ్చేవేనంటున్నారు. ఆయన శరణాగతి "కలితం" అంటున్నారు. అంటే.. ఇందులో చాలామాటలకి సరియైన అర్థం మనకు తెలీదు.

**కం॥ కలిగెను మాకిది కనుడీ**
**కలకాలము కలిగి యుండు కైవల్యమహో!!**
**కలితము శ్రీపతి శరణము**
**ఫలదంబని అన్నమయ్య పాడెను వినుడీ!**

**రాగం : బసంత్ బహార్**

కలిగె మాకునిది కైవల్యం
కలకాలము హరికథా శ్రవణం ॥కలిగె॥

అచింత్య మద్భుత మానందం
ప్రచురం దివ్యం పావనం
సుచరిత్రం శ్రుతి శోభితం
అచలం బిదివో హరికీర్తనం ॥కలిగె॥

నిరతం నిత్యం నిఖిల శుభకరం
దురితం హర భవదూరం
పరమ మంగళం భావాతీతం
కరివరదం నిజకైంకర్యం ॥కలిగె॥





సులభం సుకరం శోకనాశనం
ఫలదం లలితం భయహరణం
కలితం శ్రీవేంకటపతి శరణం
జలజోదర నిచ్చ స్తోత్రం ॥కలిగె॥

**భావామృతం :**

ఓ జనులారా! ఇదే (ఇదిగో) మాకు కైవల్యం (ముక్తిమార్గము) కలిగినది (దక్కినది). అన్ని వేళలా శ్రీహరి కథలను మనసారా వింటే తప్పక మోక్షం సిద్ధిస్తుంది.

ఓ ప్రజలారా! ఈ శ్రీహరి కీర్తనం వున్నది చూచినారా, ఇది అచింత్యం (ఏమాత్రమూ చింత కలిగించనిది) ; అద్భుతమైనది; ఆనందదాయకమైనది; పుణ్యప్రదమైనది; సుచరిత్రం (ఎప్పుడూ క్రొత్తగా వుండేది); శ్రుతిశోభితం (వేదసారము) యైనది; అచలం (సుస్థిరమైనది). ఇన్ని సుగుణములున్న ఈ మహానుభావుని కీర్తనమును విడనాడవచ్చునా?

ఓ అయ్యలారా! కరివరదం (గజేంద్ర వరదుడైన) ఈ దేవదేవునికి నిజకైంకర్యం (ఆత్మనివేదన) చేసికొండి. అది నిరతం (మిక్కిలి ఆసక్తికరమైనది); నిత్యమైనది; నిఖిల శుభకరం (ఎల్లవేళలా శుభప్రదమైనది); హర దురితం (పాపములను హరించునది); భవదూరం (సంసార వ్యామోహమును దూరము చేయునది); పరమ మంగళకరమైనది; భావాతీతం (భావించుటకు వీలులేనిది). ఇక దీనిని మానవచ్చునా?

ఓ భక్తులారా! ఈ శ్రీవేంకటేశ్వరుని శరణాగతి సులభం (అతి సులువైనది); సుకరం (చక్కగా ఆచరింపతగినది); శోకమును తొలగించునది; ఫలదం (సత్ఫలితములనిచ్చునది); లలితం (శోభస్కరమైనది); భయమును నివారించునది. కలితం (పొందబడినది... అనగా... మనందరికీ దొరికినది); ఈ జలజోదరుని (పద్మనాభుని) నిచ్చస్తోత్రం (నిత్యమూ స్తుతించిన) మీకు ముక్తి లభిస్తుంది.

## 6-80

## మున్నుడి

మధురాతిమధురమైన భజన గీర్వాణిలో వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. పిట్టకొంచెం కూత ఘనం అనే తెలుగు సామెత ఈ కీర్తనకి అతికినట్లు సరిపోతుంది. దీన్ని కంఠస్తం చేసి అనంతమైన పుణ్యం, శ్రీవేంకటేశ్వరుని కటాక్ష వీక్షణం కూడా సంపాదించండి. ఎక్కువ వివరణ అవసరం లేని కీర్తన ఇది. అయినా తెలిసినట్లుండీ తేలికగా తెలియని పదాలకి నాకు తెలిసిన అర్థం తెలుగులో తెలుపుతున్నాను. సరేనా?

**తే॥ హరి! హరీ! పరమాత్మ! హే ఆదిదేవ!**
**వేదవేదాంత వేద్య! మా వినుతి గొనుము**
**అని నమోవాకములనిడె నన్నమయ్య**
**భజన కాదిది జనులార! భవవినాశి.**

**రాగం : సింధు భైరవి**

ఆదిదేవ పరమాత్మా
వేదవేదాంత వేద్య నమో నమో ॥ఆదిదేవ॥

పరాత్పరా భక్త భవభంజన చరా-
చరలోకజనక నమో నమో ॥ఆదిదేవ॥

గదాధరా శ్రీవేంకటగిరి నిలయ
సదానంద ప్రసన్న నమో నమో ॥ఆదిదేవ॥





**భావామృతం :**

ఓ ఆదిదేవా! పరమాత్మా! శ్రీహరీ! వేదవేదాంతములచేత మాత్రమే తెలుపబడిన మహానుభావా! నీకు నా నమోవాకములు.

ఓ పరాత్పరా! (సర్వశ్రేష్ఠుడా!) భక్తభవభంజనా! (నీ భక్తుల పాపములను తుత్తునియలు చేయువాడా!), చరాచర లోకములను పుట్టించిన (సృజించిన) దేవదేవా! నీకువందనములు.

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు కౌమోదకి అనబడు గదను ధరించువాడవు. వేంకటగిరిపై నివాసముండెడివాడవు. సదా ఆనంద స్వరూపుడవు, ప్రసన్నుడవు సంతోషమునిచ్చువాడవు. అట్టి నీకు అనేక వందనములు.



**6-81**

## మున్నుడి

అద్భుతమైన ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు శ్రీలక్ష్మికి ఆ వన్నెచిన్నెలన్నీ యెందుకు వచ్చాయో చెబుతున్నారు. పురుషులు ధరించే వస్త్రాన్ని చీర అనేవారు అన్నమయ్య కాలంలో. స్వామి పీతాంబరధరుడు కదా! పాలసముద్రాన్ని దచ్చిన (చిలికిన) వాడు కదా! అందుకని బంగారు వన్నెగల భామ(లక్ష్మి) నీ పాణిగ్రహణం చేసిందయ్యా అంటున్నారు. ఆవిడకు చంద్రవదనం, తళతళ లాడే దంతాలు, గజగమనము, చిగురు పాదములు, పద్మనయనములు యెందుకు వచ్చాయో తమాషాగా చెబుతున్నారు.

**చం॥ పసిడిది చీరగట్టితివి పాలను దచ్చితివయ్య! శ్రీహరీ!**
**పసిడిని బోలు శ్రీసతిని బాగుగ పెండిలినాడినావుగా**
**పసగల తోడబుట్టువుల వన్నెలు కూడెను నీదు భామకున్**
**వెస మన అన్నమయ్య గొని వేంకటనాయక! పాడె కీర్తనన్.**

*** వెస = శీఘ్రముగా**

**రాగం : శుద్ధ సావేరి**

పసిడి చీరవాడవు పాలుదచ్చితివి గాన
పసిడి పోలినది చేపట్టెను నీకరము ॥పసిడి॥

తొలుతనే చందురుని తోడబుట్టు గనుక
పొలుపు చందురు మోము పోలికైనది
కళల చింతామణి కందువ చెల్లెలు గాన
తళుకు మానికపు దంతముల పోలినది ॥పసిడి॥

మంచియైరావతముతో మగువ సైదోడుగాన
ముంచన కరిగమనము పోలినది
పంచల పారిజాతపు భావపు సోదరి గాన
యెంచగ చిగురు పోలె నీకె పాదములు ॥పసిడి॥





తామెర తొట్టెలలోన తగలి తానుందు గాన
తామెర కన్నుల బోలి తనరినది
యీమేర నిన్నిటా బోలి ఇన్ని లక్షణములతో
నీమేన శ్రీవేంకటేశ నెలవై నిల్చినది ॥పసిడి॥

**భావామృతం :**

ఓ శ్రీ వేంకటేశ్వరా! నీవు పసిడి చీరవాడవు (పీతాంబరధరుడవు), పాలుదచ్చితివి (క్షీరసాగరాన్ని కూర్మరూపుడవై చిలికించావు). అందువలననే కాబోలు నీచేతిని, పసిడి కాంతుల మీగడ వన్నెగల లక్ష్మీదేవి పట్టుకొని పరిణయమాడినది.

మొట్టమొదట ఆమె చంద్రునికి తోడబుట్టిన చెల్లెలు కదా! అందుకే పొలుపు (ఒప్పయిన) చంద్రుని ముఖము ఆమెకు వచ్చినది. చింతామణి అను మాణిక్యమునకు ప్రియ సోదరి కనుక ఆమెకు తళతళ మెరయు దంతములున్నవి.

మంచి తెల్లని రంగుగల ఐరావతము అను యేనుగు కూడా క్షీరసాగరమథనమున ఆమెకు సైదోడు (తోబుట్టువు) వలె బుట్టినది. అందుకే కాబోలు ఆ పోలికవచ్చి నీ భార్య నడక కూడా మత్తకరీంద్రపు నడకవలెనున్నది. పంచల పారిజాతము (సమీపమున నున్న పారిజాత వృక్షము)తో కూడి పుట్టిన భావపు సోదరి (భావించిన చెల్లెలు) కనుక ఆమె పాదములు లేచిగురులవలె మెత్తగా నున్నవి. (పారిజాత వృక్షం యేనాటికీ వాడిపోదు. కోమలంగా నవ్యనూతనంగా అద్భుతమైన సువాసనలు వెదజల్లుతుంటుంది. ఈ శ్రీలక్ష్మి దాని చెల్లెలు కనుక ఈమెకు ఆ పోలికే వచ్చినది అని భావము).

ఈ దేవి జన్మించిన తొట్టె (ఉయ్యాల) తామరపుష్పమే. అందువలననే కాబోలు ఈమెవి తామరకన్నులు. ఈమేర (ఈ క్రమములో) ఇన్నిటిని బోలి (ఇన్ని లక్షణములు కల) సౌందర్యరాశి కాబట్టే ఓ శ్రీవేంకటేశ్వరా! ఈమె నీ మేన (నీ శరీరంలో... అంటే.. నీ హృదయంలో) నెలవై (స్థానమై) నిలిచిపోయినది, తండ్రీ!

**6-82**

## మున్నుడి

శ్రీ వేంకటేశ్వరుడొక్కడే పరబ్రహ్మ. అతడే లోకాల అధినాయకుడు. ఎవ్వరూ అతనికంటే గొప్పకాదు అంటున్నారు అన్నమాచార్యులవారు. అలా అనటానికి గల కారణాలను కూడా వివరిస్తున్నారు. వేరే యెవ్వరికైనా లక్ష్మీదేవి వున్నదా? బ్రహ్మతో కూడిన నాభికమలమున్నదా? వసుంధరయైన భూమి వున్నదా? పాదములనుద్భవించిన భాగీరథి (గంగానది) వున్నదా? ఆయనలాగా అభయం ఇవ్వగలరా? శరణమిచ్చి రక్షించగలరా? ఈ వేంకటాద్రి దేవుని వంటివారున్నారా? అంటున్నారు.

**మ॥ అతడేరా పరబ్రహ్మలోకములకున్ ఆతండె తానేలికౌ**
**అతనిన్ మించినవాడు తానెవడురా అన్నయ్య శ్లాఘించెబో**
**జతవేరెవ్వడు పద్మనాభుకనియెన్ చక్కంగ గీర్తించుచున్**
**ఇతడే తచ్చిన వేంకటేశుడనెరా ఇందీవరశ్యాముడున్.**

**రాగం : దర్బారు**

అతడే పరబ్రహ్మమతడే లోక నాయకుడు
అతనికంటే మరి అధికులు వేరయ్యా ॥అతడే॥

కమలవాసిని లక్ష్మికలదా యెవ్వరికైనా
కమలనాభునికి ఒక్కనికే కాక
కమలజుడైన బ్రహ్మకలదా యెవ్వని నాభి
నమరవంద్యుడు మా హరికే కాక ॥అతడే॥

అందరునుండెడి భూమి అన్యులకు గలదా
అందపు గోవిందునికే ఆలాయగాక
చెందిన బాగీరథి శ్రీపాదాల గలదా
మందరధరుడయిన మాధవునికి గాక ॥అతడే॥





నిచ్చలు అభయమిచ్చే నేరుపుయెందు గలదా
అచ్చుగ నారాయణుని యందేకాక
రచ్చల శరణాగత రక్షణమెందు గలదా
తచ్చిన శ్రీవేంకటాద్రి దైవానికే కాక ॥అతడే॥

**భావామృతం :**

ఓ జనులారా! అతడే (వేంకటేశ్వరుడే) పరబ్రహ్మము. అతడే లోకనాయకుడు. అతనికంటే అధికుడైన వాడు ఇంకా ఎవరయ్యా!

పద్మనివాసినియైన లక్ష్మీదేవి ఎవరివద్దనైనా స్థిరంగా వుంటుందా? ఈ కమలనాభుని వద్దనేకదా! ఆమె వుండేది? పద్మసంభవుడైన బ్రహ్మదేవుడు యెవ్వని నాభికమలము నుంచి పుట్టాడో, వాడే ఈ శ్రీహరి. ఈయన అమరవంద్యుడు (దేవతలచేత నుతించబడువాడు).

ఇంతమంది నివసించు భూమి (భార్యవలె) యెవరికైన నున్నదా? అందమైన గోవిందునికే ఆలాయగాక! (పాత్రమైనది అవుగాక!) ఇంకెవరికి కలదు? భాగీరథి అని పిలువబడు గంగానది ఎవ్వని పాదములనుండి ప్రవహించుచున్నది. మందర పర్వతమును కూర్మరూపుడై యెత్తిన మాధవునికి కాక ఈ వైభవము లింకెవ్వరి కైనను గలవా?

నిత్యము తన నాశ్రయించువారికి అభయము నిచ్చే నేర్పు ఎవ్వరియందు గలదు? అచ్చముగా ఒక్క నారాయణుని యందుగాక ఈ గుణము లెవ్వరియందు గలవు? బాహాటముగా శరణాగతులకు రక్షణ నెవ్వరీయగలరు? తచ్చిన (పరిహాసము చేయు) శ్రీవేంకటాద్రి ఈ దేవదేవునికి గాక, అంత శక్తి యెవ్వరికున్నది? లేనే లేదు.

## 6-83

## మున్నుడి

అనేక శృంగార, భక్తి కీర్తనలతో శ్రీపతిని మురిపించిన అన్నమాచార్యులవారు వైష్ణవ వ్యాప్తిలో అనేక సామెతలు, చాటువులు చెప్పారు. పండుగల నిర్వహణలో పదాల సొంపు నింపారు. వృద్ధులై వైరాగ్యంలో మరెన్నో కీర్తనలు చెప్పారు. చివరి దశలో ఆత్మావలోకనావశిష్ఠులైనారు. ఆత్మజ్ఞానులై మానవగమ్య అంతిమ పథంలో ఇటువంటి కీర్తనలు పుంఖానుపుంఖాలుగా చెప్పారు. ఆత్మయెక్కడో బయట వెతికితే కనబడుతుందా? ఆత్మావలోకనం ద్వారాగాని అది సాధ్యంకాదు. ఆత్మావలోకనం అభ్యాసం చేస్తేగాని రాదు. పైగా ఒక్కనాటితో రాదు. జీవితకాలంలో వస్తుందో రాదో తెలియదు.

**కం॥ వెలుపల వెదకిన గనునా?**
**పలుమార్లిల నభ్యసించవలెనిది యనెరా,**
**'చలి వేడి' యొక్కటవ వలె**
**తెలియన్ హరినన్నమయ్య తెలిపెను "ఆత్మన్"**

**రాగం : ముఖారి**

వెలుపల వెదకితే - వెసనాత్మ గనునా
పలుమారు నిదే య - భ్యాసము గావలెను ॥వెలుపల॥

ఇన్ని చింతలు మఱచి -యింద్రియాల గుదియించి
పన్నియుండిన హృదయ - పద్మమందును
ఎన్న నంగుష్ఠమాత్రపు - టీశ్వరు పాదాల కింద
తన్ను నణుమాత్రముగ - దలచగవలెను ॥వెలుపల॥

పలు దేహపు గాళ్ళ-బరువులు వారక
బలు దేహపు టింటిలో - పలచొచ్చి
చలివేడి బొరలకే - సర్వేశు పాదాల కింద
తలకొన్న తన్నుదానే - తలచగ వలెను ॥వెలుపల॥



భావయామి వేంకటేశం

కైకొన్న భక్తితో ని-క్కపు శరణాగతితో
చేకొని విన్నపములు - చేసుకొంటాను
ఏకాంతాన శ్రీవేంక-టేశ్వరు పాదాల కింద
దాకొని తన్నుదానే - తలచగ వలెను ॥వెలుపల॥

**భావామృతం :**

ఆత్మ, మన శరీరంపై వెలుపల శీఘ్రముగా కనబడుతుందా? పోనీ ప్రపంచంలో యెక్కడనైనా దొరుకుతుందా? లేదే... మరెలా? అభ్యాసం వలన అదీ పలుమార్లు ప్రయత్నిస్తే గానీ ఆత్మావలోకనము సాధ్యంకాదు.

ఇన్ని దిగుళ్లను మరచి, ఇంద్రియముల నిగ్రహించి, పన్నియుండిన (వికసించిన) హృదయ కమలంలో అంగుష్ఠమాత్రమే (చేతి బొటనవేలి ప్రమాణంలోనే) వున్న ప్రకాశ రూపుడైన పరమాత్మ పాదములక్రింద అణు స్వరూపంలో వున్న వానిగా తనను తానే భావించుకోవలెను. అప్పుడు మాత్రమే ఆత్మావలోకనం సాధ్యమవుతుంది.

అనేక జన్మలెత్తాలి. అనేక శరీరాలు ధరించాలి. వాటికి చెందిన అనేక కాళ్లతో పరుగులు తీస్తూనే వుండాలి. ఏదో ఒక జన్మలో, అంతర్ముఖుడయ్యే శక్తి ఈశ్వర కృపవలన లభిస్తుంది. అప్పుడు పరమేశ్వరుడిచ్చిన ఈ దేహం, ఆత్మకి ఒక 'ఇల్లు' అని భావించి, ఇంటిలోనికి ప్రవేశించానని తలచి, శీతోష్ణములు, సుఖదుఃఖములు, ప్రియాప్రియములు అనే విరుద్ధ ద్వంద్వ భావములను సమానముగా చూచే స్థితికి చేరాలి. సర్వేశ్వరుడు, అంతర్గతంగా తన ఆత్మలోనే వున్నాడని... ఆయన చరణాల క్రింద జీవాత్మ రూపంలో తానే సదా వున్నట్లు భావించాలి.

ఇది అయిన తరువాత 'భక్తి' అనే సాధనము గైకొని, నిజమైన శరణాగతిని పొందవలెను. తాను నిమిత్త మాత్రుడనని తను చేయుచున్న పనులన్నీ ఈశ్వరేచ్ఛయని, తనవలన జరిగిన పొరబాట్లనన్నింటినీ క్షమించవలెనని పదే పదే అర్థించవలెను. ఏకాంతములో (ఒంటరిగా జీవిస్తూ భావిస్తూ) శ్రీవేంకటేశ్వరుని పాదపద్మముల క్రింద మరుగుపడివున్న తన స్వరూపమును తానే గుర్తించవలెను. వారే జీవన్ముక్తులు. వారికి శరీరం వున్నా లేకపోయినా తేడా వుండదు.

## 6-84

### మున్నుడి

ఈ కీర్తనలో అమ్మవారు తన అభిజాత్యాన్ని (తనే గొప్ప అనే భావాన్ని) ప్రదర్శిస్తున్నది. అన్నమాచార్యుల వారికి ఇటువంటి భావ సౌందర్యం వున్న కీర్తనలు చెప్పటం వెన్నతో పెట్టిన విద్య. ఇందిరాదేవి తన చెలికత్తె (అన్నమయ్యే...) తో ఇలా అంటోంది. వెఱపేల (భయమెందుకు?) స్వామిని రమ్మనవే. తాను నాకు వింతవాడా (కొత్తవాడా?) యేమిటే? ఆకాశంలో మెఱుపు మెరిస్తే అది ఒక్కరి స్వంతం అవుతుందా? అందరూ ఆ "మెరుపు" చూసి ఆనందిస్తారు. నేను తలలో ముడిచిన పూలదండను ఇంకెవత్తో తన సిగలో పెట్టుకుంటే నాకేమిటి అంటున్నది. ఔరా!!

**ఉ॥ ఎందుకు భీతి? రమ్మనవె, యెంచగ నాతడు వింతవాడొకో!**
**విందుగ దిక్కులన్ మెఱయ వెల్గులు మించవె చూడనెల్లరున్?**
**యెందరి గూడినా విభుడు యేమగు? రేతిరి నన్ను జేరడా?**
**ఇందిర ఆభిజాత్యమును యింపుగ పాడెను అన్నమార్యుడున్.**

**రాగం : గౌళ**

వెఱపేల రమ్మనవే వింతవాడా తానాకు
మెఱుగు మెరిచితేను మించదా దిక్కులను ॥వెఱపేల॥

అందుకే తా నన్ను నాదరించె నింతలోనె
యెందఱి గూడి వచ్చినా నేమాయనే
ముందు నన్ను గూడెను ముడిచివేసిన పువ్వు
పొందుగా వీధి నుండితే బుగంధించకుండునా ॥వెఱపేల॥

కడమయేదే తానుగైకొని నన్ను మెచ్చె
యెడసి యెందుండినాను యేమాయనే
కడగి నాతో నవ్వే గరచి వేసిన బూరె
అడరి యెక్కడ గన్నా నట్టె నోరూరదా ॥వెఱపేల॥





ఇన్నీనేలే శ్రీవేంకటేశుడిట్టె నన్ను నేలె
యెన్ని పెండ్లిండ్లాడినా నేమాయనే
వున్నాడు నా కౌగిటను వొద్దికైన నా కంచము
కన్నవారెల్లా బొత్తుగలయక వుందురా ॥వెఱపేల॥

**భావామృతం :**

ఓ చెలియా! వెఱపేల (ఆ స్వామికి భయమెందుకు?) తాను నాకు వింతవాడా (కొత్తవాడా) యేమి? ఆయనను కావలెనంటే నావద్దకు రమ్మనవే. ఆకాశంలో మెఱుపు మెరిస్తే ఆ మెరుపు దిక్కులను మించదా (వెల్లివిరియునట్లు చేయదా?) ఆయన వస్తే చూసి అందరూ ఆనందిస్తారు. అలాగే కానిమ్ము నాకేమి?

అందుకేమే? (దానికేంలేవే) ఇంతలోనె (ఇప్పటిదాకా) స్వామి నన్ను ఆదరించినాడు కదా! ఆయనను అందరూ కోరుకునేవారే. అందుకని ఆయన యెందరిని గూడి వచ్చినా నాకేమవుతుంది? ఆయన మొట్టమొదట దగ్గరకు తీసికొనేది నన్నే. నా తరువాత ఆయన యెందరిని కూడితే నాకేమే? నేను తలలో ముడుచుకొని వీధిలో పారవేసిన పూలదండను యెవ్వతో బుగంధించకుండునా (వాసన చూడకుండా వుంటుందా?) నాకేమి నష్టం?

చివరికి ఆయన నేనిచ్చిందే తీసికొని నన్ను మెచ్చుకుంటాడు. ఇక ఆయన యెడసి యెందుండినా యేమవుతుంది. చివరికి నాతోనే నవ్వుతాడు. తిని పారవేసిన బూరె ఎవ్వరికంట పడినా, వారి నోరు ఊరకుండా వుంటుందా?అట్లాగే అందగాడైన ఆయనను చూచి కొందరు ఆశపడితే నా సొమ్మేం పోయింది?

ఇన్నీనేలే ఈ విశ్వంలో అందరినీ పాలించే శ్రీవేంకటేశ్వరుడు నన్ను ఈ విధముగా ఏలినాడు. ఆయనను కాంక్షించని వారెవరు? ఆయన యెన్ని పెండ్లిండ్లు చేసికొంటే నేమి? ఆయన ఒదిగి నా కౌగిట నిమిడి పోయాడు. మరి నేను తింటున్న కంచమును చూచిన వారెవరైనా, నాతో పొత్తుగా కూర్చొని అదే కంచంలో తినకుండా వుంటారా? అది అసాధ్యం కదా!

# 6-85

## మున్నుడి

నల్లటిరంగు, తెల్లటి కళ్ళు, నవ్వుల చూపులున్న దేవదేవుని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఈయన యెవరు? తిరుపుకైదువవాడు, తెరువు చూపినవాడు, తేటపరచినవాడు, తీటవాపినవాడు, తెరచి రాజన్నవాడు. అంతేకాదు గురుతువెట్టగరాని గుణముల వేంకటేశ్వరుడు అంటున్నారు. పైన చెప్పిన చాలామాటలు తెలిసినట్లే వుండి తెలియని మాటలే కదా!

**సీ॥ నల్లని మేనితో నగవుల దేవుండు**
**తెల్లని కన్నుల దేవుడితడు**
**బిరుదైన దనుజుల పీచమణచువాడు**
**తిరుపుకైదువతోటి దేవుడితడు**
**నీటగలిసినట్టి నిండిన చదువుల**
**తేటపరచినట్టి దేవుడితడు**
**పాటిమాలినయట్టి ప్రాణుల దురితంపు**
**తీటవాపినయట్టి దేవుడితడు**

**ఆ.వె॥ గురుతువెట్టరాని గుణములు నెలకొన్న**
**వేంకటాద్రివాసి శంకయేల?**
**దివ్యపదము నిచ్చి దీవించె ధ్రువునెన్ని**
**తెలిపె నన్నమయ్య "తెరచిరాజు"**

**రాగం : పూర్వికల్యాణి**

నల్లని మేని నగవు చూపులవాడు
తెల్లని కన్నుల దేవుడు ॥నల్లని॥

బిరుదైన దనుజుల పీచమణచినట్టి
తిరుపు కైదువతోడి దేవుడు
సరిబడ్డజగమెల్ల చక్కచాయకు తెచ్చి
తెరువు చూపినట్టి దేవుడు ॥నల్లని॥





నీటకలసినట్టి నిండిన చదువులు
తేటపరచినట్టి దేవుడు
పాటిమాలినట్టి ప్రాణుల దురితపు
తీటవాపినట్టి దేవుడు ॥నల్లని॥

గురుతు వెట్టగరాని గుణముల నెలకొన్న
తిరువేంకటాద్రిపై దేవుడు
తిరముగ ధ్రువునికి దివ్యపదం బిచ్చి
తెరచి రాజన్నట్టి దేవుడు ॥నల్లని॥

**భావామృతం :**

తెల్లని కన్నులు గల ఈ దేవదేవుని చూచినారా? ఈయన నల్లని శరీరం కలవాడు. ఈ స్వామి నగవు చూపులవాడు. (నవ్వులొలికిస్తూ కనిపించుచున్న దేవుడు). శరణంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా! అని మొక్కండి. ఎందుకంటే...

ఈయన బిరుదైన దనుజుల (శూరులైన రాక్షసుల) ను పీచమణచినట్టి (సంహరించిన) తిరుపుకైదువ (గిరగిర తిరిగే చక్రాయుధముగల) దేవుడు. సరిబడ్డ జగముల (సమానముగా పైన ఏడు మరియు క్రింద ఏడులోకములుండగా) వానిని చక్కగా చాయలకు తెచ్చి (రక్షించి) తెరువు చూపిన (దారి చూపి నడిపించిన) దేవుడు. ఈయనను ఆశ్రయించండి.

ఈ స్వామి నీరధిలోనికి తీసికొని పోబడిన నిండిన చదువులను (అన్ని వేదములను) తేటపరచిన (విశదపరచిన... అంటే...లోకములకు అందించిన) దేవుడు. ఈయన పాటిమాలిన (ధర్మమును విడనాడిన) జీవుల పాపముల తీట వాపినట్టి (దురద వదలగొట్టిన) దేవుడు. అనగా అధర్మవర్తనులను తగు విధముగా శిక్షించి వారి దుర్బుద్ధిని పోగొట్టు వాడు అని భావము.

ఈ మహానుభావుని గుణములను విశద పరచుట సాధ్యము కాని పని. అన్ని సుగుణములుగల శ్రీవేంకటపతి అయిన దేవుడితడు. ఈయన మాటకు తిరుగులేదు. ముక్కుపచ్చలారని బాలుడు అయిన ధ్రువునికి తిరముగ (స్థిరమైన) దివ్యపదం (ధ్రువతార అయ్యే భాగ్యము) నొసగి, "తెఱచి రాజు" (చెక్‌మేట్) అని జీవన చదరంగంలో తన మాటకు తిరుగులేదన్నాడు. అందుకని ఇప్పటికైనా ఆయనే దిక్కని గుర్తించండి, శరణనండి, మొక్కండి.

## 6-86

## మున్నుడి

"దట్టపు జడునకు (అవివేకము పుష్కలంగా వున్న వానికి) దైవంతో పనియేముంది? వాడికి పట్టినదెల్లా (ఏది పడితే అదే) బ్రహ్మము" అంటున్నారు అన్నమాచార్యులవారు. రాగిరేకులమీద వ్రాసేవారి పొరపాటేమో కాని, ఈ కీర్తనలో ఘనయాచకునకు, తరువలికి వంటి మాటలు వున్నాయి. వాటిని నేను సబబుగా భావించినట్లు అర్థము చెప్పాను. తన శరీరము వుండాలని చావబోయే వాడికే కదా! కాంక్ష? అందుకని 'తరువలికి' అంటే "ఉత్తరువు ద్వారా శిరఃఖండన శిక్ష విధించబడిన వానికి" అని భావించాను. ఆచార్యుల భావం అవగతం అంతవరకే అయింది.

**కం॥ పట్టిన దెల్లా బ్రహ్మము**
**దట్టపు జడుడైన వాన్కి దైవంబేలా?**
**యెట్టిదొ బ్రహ్మము యెవరికి,**
**దిట్టముగా అన్నమయ్య తెలిపెను వినుడీ.**

**రాగం : లలిత**

పట్టినదెల్లా బ్రహ్మము
దట్టపు జడునికి దైవంబేలా ॥పట్టిన॥

క(ఘ)న యాచకునకు కనకమే బ్రహ్మము
తనువే బ్రహ్మము తరువలికి
యెనయ కాముకున కింతులే బ్రహ్మము
తనలో వెలిగేటి తత్వంబేలా ॥పట్టిన॥

ఆకటి వానికి నన్నమే బ్రహ్మము
లోకమే బ్రహ్మము లోలునికి
కైకొని కర్మికి కాలమే బ్రహ్మము
శ్రీకాంతునిపై జింతదియేలా ॥పట్టిన॥





భువి సంసారికి పుత్రులె బ్రహ్మము
నవ మిందరికిది నడచేది
యివలను శ్రీవేంకటేశు దాసులకు
భవ మతని కృపే బ్రహ్మము ॥పట్టిన॥

**భావామృతం :**

(ఓ ప్రజలారా! తా మునిగింది గంగ, తా వలచినది రంభయను చందమున 'బ్రహ్మము' అని పిలువబడు పరబ్రహ్మ వేర్వేరు జనులకు, వేర్వేరుగా తోచుచున్నది). దట్టపు జడునికి (మిక్కుటముగా అవివేకము కలవానికి) దైవమెందులకు? వాడికి పట్టినదెల్లా (ఏది పడితే అదే) బ్రహ్మము. ఎందుకంటే వాడు మూర్ఖుడు కదా!

కన (పరిశీలించి చూస్తే) యాచకునికి (దేహి అంటూ అడుక్కొనే వాడికి) బంగారమే బ్రహ్మము. అట్లే తరువలికి (ఉత్తరువు ద్వారా శిరఃచ్ఛేదన శిక్ష పొందినవానికి) బ్రతికుంటే చాలు అని వుంటుంది కాబట్టి తనువే (శరీరమే) బ్రహ్మము. ఎనయ (సరిపోల్చి చూస్తే) కామపీడితునికి స్త్రీలే బ్రహ్మము. అటువంటి వానికి తనలో ప్రకాశించే తత్త్వ జ్ఞానంతో పనేమున్నది?

బాగుగా ఆకలితో వున్నవానికి పట్టెడు అన్నం దొరికితే అదే బ్రహ్మము. లోలునకు (అది కావాలి, ఇది కావాలి అనే కోరికలున్నవానికి) ఈ ప్రపంచమే బ్రహ్మము. కైకొని (చేబూని) యేవేవో యజ్ఞ, యాగాలవంటి కర్మకాండనాచరించువానికి, ఎంత సమయమూ సరిపోదు కాబట్టి వాడికి కాలమే బ్రహ్మము. అటువంటి వారికి శ్రీనాథుడైన ఆ దేవదేవుని గురించి ఆలోచించే సమయమేది?

ఈ లోకంలో సంసార తాపత్రయం వున్నవాడికి తన కొడుకులే బ్రహ్మము. నవము - ఇందరికి - నడచు... యేదీ? (ఇందులో కొత్తగా చూడాల్సిందేముంది?) అయితే... ఇవలను (ఈలోకంలో) శ్రీవేంకటేశుని దాసులకు మాత్రము, భవమతనికి కృపయే (ప్రాప్తించిన అతని "దయ" యే) బ్రహ్మము. ఇంక దేనితోను పనిలేదు.

6-87

## మున్నుడి

శ్రీవేంకటేశ్వరుని దివ్య మంగళ విగ్రహం చూచి పులకితగాత్రుడైన అన్నమాచార్యులవారు చక్కటి కీర్తన నాలపిస్తున్నారు. "విస్తరించిన ఈ లోకాలన్నీ వెదకి చూచినా నీవంటి దేవుళ్లు యెక్కడున్నారయ్యా! ఇటు ఈ భూలోకంలోగాని అటు ఆ చతుర్దశ భువనాలలో గాని యెందు పోల్చి చూచినా మాకు ఇంకెవ్వరూ కనబడుట లేదు" అంటున్నారు. తను అలా అనటానికి కారణాలను వివరిస్తున్నారు. ఎంత అద్భుతంగా వాదిస్తున్నారో గమనించండి.

**మత్తకోకిల॥**

**నిన్ను బోలిన దైవమెవ్వడు నిండు లోకములందునన్**
**యెన్న నీవల నావలైనను యెందునైనను నీవెరా**
**అన్నమార్యుడు కీర్తనంబుల నాలపించెను వేలలో**
**వెన్నుడా తిరువేంకటేశ్వర! పేర్మి జెప్పితి మున్నుడిన్.**

**రాగం : కళ్యాణి**

నీవంటి దైవాలు వేరే నిఖిల లోకములందు
యీవల నావల నెందు నెంచి చూడమాకును ॥నీవంటి॥

తగిలి నీమోము చక్కదనమెంచి చూచితిమా
తగిన మరుని గన్నతండ్రివి నీవు
అగపడ్డ నీగుణములవియెంచి చూచితిమా
నిగిడి కళ్యాణ గుణనిధివనీ శృతులు ॥నీవంటి॥

గుట్టు నీ పెద్దతనము కులమెంచి చూచితిమా
అట్టె బ్రహ్మకులము నీ యందు బుట్టెను
దట్టపు నీపనుల వర్తనమెంచి చూచితిమా
ముట్టి సర్వరక్షకత్వమున వెలసితివి ॥నీవంటి॥





బెడిదమైన నీ బిరుదెంచి చూచితిమా
వడి శరణాగత వత్సలుండవు
కడగి శ్రీవేంకటేశ కంటిమి నీ మహిమలు
బడి నిన్నే సేవించి బ్రతికితి మిదివో ॥నీవంటి॥

**భావామృతం :**

ఓ దేవదేవా! పదునాల్గు లోకములనన్నింటినీ వెదకి చూచినా, నీవంటి దేవుళ్ల యెక్కడున్నారు? ఈవల (ఈ భూలోకంలో గాని) ఆవల (దీని బయట లోకాలలో గాని) మాకు యెంచి చూడగా యెందునైనా కనిపిస్తారా? అది అసాధ్యం. కనిపించరు.

పోనీ, ముఖ సౌందర్యం చూద్దాంలే, అనుకొంటే మాకు మన్మథుని కన్నతండ్రి కంటే అందగాడెక్కడ కనిపిస్తాడు? మాకు తెలిసిన నీ గుణములను చూద్దామా అనుకొంటే సకల కల్యాణ గుణాభిరాముడు అని వేదములన్నీ నిన్ను కీర్తిస్తున్నాయి కదా!

సరే, కులగోత్రాలు చూచి నీ పెద్దరికం గుట్టు రట్టు చేద్దామంటే నీకు బ్రహ్మ ఆయననుంచి సప్తఋషులు, మనువులు, ప్రజాపతులూ అంతా పుట్టారు కదా! పోనీ నీవు చేసే పనులనుంచి నీ సత్తా కనుక్కొందామంటే సర్వులను రక్షించుటయే నీపని.

స్వామీ! బెడిదమైన (అధికమైన) నీ బిరుదు (సామర్థ్యపు గొప్పతనం) చూద్దామా అంటే, నీవు శరణన్న వారిని రక్షించే దీక్షాదక్షుడవు. కడగి (యత్నించి), ఓ శ్రీ వేంకటేశ్వరా! నీ దివ్యమహిమలను చూచిన మేము, బడి (వెంటనే) నిన్ను సేవించి, ఆపై ఇదిగో ఇట్లా బ్రతికి పోయాం, తండ్రీ!

## 6-88

## మున్నుడి

గజవాహనముపై ఊరేగుతున్నారు. తిరుమలనాథుడు ఆయన దేవేరులు. పరవశించిన అన్నమాచార్యులవారు చక్కటి కీర్తననందుకున్నారు. తీవ్ర ప్రయత్నంతో మాత్రమే దీని భావామృత వివరణ సాధ్యమయింది అంటే నమ్మండి. "చొల్లెపు జుట్టు తోడి చుంగుల రాజసముతో, వెల్లవిరిగా నేడు వెలదుల గొలువ" అంటే ఇదమిద్ధంగా తెలియలేదు. ఈ వివరణ నాకు సమంజసంగా తోచి నా ప్రయత్నం నేను చేశాను. అంక వన్నెలు చేయటమంటే? అసలు అంగవించడమంటే? ఏతుల నెరపులు అంటే? భావామృతం చదవాల్సిందే, మరి.

**ఆ.వె॥వెల్లవిరిసియేగె వెలదులు గొలువంగ**
**చొల్లెమైన జుట్టు శోభలీన**
**రాజసంపు రీవి రాజిల్ల యేన్గుపై**
**హరి వెడలుట పాడె నన్నమయ్య**

**రాగం : సాళంగనాట**

చొల్లెపు జుట్టుతోడి చుంగుల రాజసముతో
వెల్లివిరిగా నేగీ వెలదులు గొలువ ॥చొల్లెపు॥

వీపున గుచాలు మోపి వెలది కౌగిలించగా
నేపున నేనుగ నెక్కె నిదె దేవుడు
చేవట్టి యాపె చేతులు చేతుల బిగ్గె బట్టుక
పైపై వీధుల వెంట బరువు దోలీని ॥చొల్లెపు॥

అంగనకు దన పాదాలంక వన్నెలు సేసుక
రంగుగా దొడదొడయు రాయగాను
సింగారపు సొమ్ములతో చెంగావి ముసుగుతోడ
అంగవించి యాపె దన కాసలు రేచగను ॥చొల్లెపు॥





కలకల నవ్వుతోడ కస్తూరి నామము తోడ
అలమేలు మంగ దన్ను నట్టె మెచ్చగా
యెలమి శ్రీవేంకటేశుడేతులు నెరపుతాను
బలిమి నంకుశమున బట్టి వొత్తీ నదివో ॥చొల్లెపు॥

**భావామృతం :**

ఇదిగో ఈ ఊరేగింపు చూడండి. శ్రీవేంకటేశ్వరుడు తన ఇద్దరు ముద్దు సతులైన శ్రీదేవి, భూదేవితో గజవాహనముపై తరలిపోవుచున్నాడు. స్వామి చొల్లెపు జుట్టుతోడి వున్నాడు (విసిగిపోవునంత అధికంగా వున్న జుట్టుతో వున్నాడు). చుంగుల రాజసముతో శోభిల్లుతున్నాడు (కుచ్చెళ్ళు పోసినట్లు దట్టించిన రాచఠీవితో శోభాయమానంగా వున్నాడు. తన వెలదులైన (భార్యలైన) శ్రీదేవి భూదేవీ తనను కొలువగా, స్వామి వెల్లివిరిగా (ప్రకటితమగుచూ) నేగీ (వూరేగుచున్నాడు).

ఏనుగుమీద వూరేగుటవలన, గజగమనము ననుసరించి శ్రీదేవి కౌగలించగా స్వామి వీపు అమ్మవారి కుచాగ్రములు గుచ్చుకొనుచున్నవి. ఆమె భయముతో తన చేతులతో ఆయన చేతులు బిగించి పట్టుకొన్నది. అయినా స్వామి వున్నాడనే ధైర్యంతో, పైపై వీధులవెంట (వీధి తరువాత వీధి చొప్పున), పరువు దోలీని (గజమును పరుగులెత్తిస్తున్నది). ఈ రమణీయ దృశ్యం చూచి తరించండి.

ఈ స్వామి యేమిచేయుచున్నాడో చూడండి. అంగనకు (భూదేవికి) తన పాదాలను, అంకవన్నెలు సేసుక వున్నాడు. (పాదాలతో పాదాలను మెలికవేసుకొని వున్నాడు) రంగుగా (అందముగా) తొడలను రాపాడించినాడు. సింగారించుకొన్న ఆభరణములతోను, చెంగాలి ముసుగుతోను భూదేవి వున్నది (మనోజ్ఞమైన ఎఱుపురంగు ముసుగుతోనూ వున్నది). ఆపె (ఆమె) అంగవించి (ఉత్సాహముతో) తన కాసలు రేచగా (స్వామికి మధురమైన ఆశలను రేపుచుండగా) ఈ గజవాహనము ఊరేగింపు సాగుచున్నది.

అలమేల్మంగమ్మ తనను మెచ్చు కొంటుండగా, స్వామి గలగలా నవ్వుతున్నాడు. కస్తూరీ తిలకము ఆయన నుదుటిపై మనోహరంగా వున్నది. ఎలమి (వికాసముతో) శ్రీవేంకటేశ్వరుడు, "ఏతుల నెరపుతాను" (ఉధృతిని ప్రదర్శించుచూ), బలిమి నంకుశము బట్టి వొత్తీను (బలంగా అంకుశమును పట్టుకొని ఏనుగును పొడుచుచున్నాడు). అదిగో చూచి మీ జన్మతరింప చేసికొనుడు.

**6-89**

## మున్నుడి

కరుణ రసాత్మకమైన కీర్తన చెబుతున్నారు అన్నమాచార్యులవారు. మనిషి శరీరం ధరించి ఇలా యెంతకాలం గడపాలిరా భగవంతుడా! దీనివల్ల నాకు వొరిగినదేముంది? చింతలు, చిక్కులు, పరంపరగా (ఒకదాని వెనుక ఇంకొకటిగా) వస్తూనే ఉన్నాయి. గర్భవాస నరకం అనుభవించాను. కాంతల కౌగిలి సుఖంలో కళ్లు తెరవలేకపోయాను. అనుక్షణం ఆపదలలో తగిలే దేహము మోయవలసి వచ్చింది. భ్రాంతితో బ్రదుకవలసొచ్చింది. వేంకటేశుని కొలవక నరక కూపాన బడ్డాను. దారీ తెన్నూ లేక తిరుగులాడాను... అంటున్నారు.

**ఉ॥ ఎంతటి కాలమో పనిచి ఈ నర జన్మపు దేహ ధారణల్**
**చింతల నంచెలంచెలుగ చిక్కులలో బడి నీల్గగా వలెన్**
**కాంతల గర్భవాసముల కౌగిలి భ్రాంతుల "దిడ్డిదూరితిన్"**
**అంతమునందునైన 'హరిహస్తము' బట్టనె! అన్నమయ్యనెన్.**

***దిడ్డి దూరితిన్ = చిన్న వాకిళ్లలోంచి దూరవలసిన అగత్యం వచ్చింది.**

**రాగం : శ్రీరాగం**

ఎంత కాలమొ కదా యీ దేహధారణము
చింతా పరంపరల చిక్కు వడవలసె ॥ఎంత॥

వడిగొన్న మోహంబు వలల తగులై కదా
కడలేని గర్భనరకము లీదవలసె
నడిమి సుఖములచేత ననుపు సేయక కదా
తొడరి హేయపు దిడ్డి దూరాడ వలసె ॥ఎంత॥

పాపపుంజములచే పట్టువడగా కదా
ఆపదలతోడి దేహము మోవ వలసె
చూపులకు లోనైన సుఖము గానక కదా
దీపన భ్రాంతిచే దిరిగాడ వలసె ॥ఎంత॥





హితుడైన తిరువేంకటేశు కొలువక కదా
ప్రతిలేని నరక కూపమున బడవలసె
అతని కరుణామృతం బబ్బకుండక కదా
బతిమాలి నలుగడల పొరాడవలసె ॥ఎంత॥

**భావామృతం :**

అయ్యో! హతవిధీ! ఈ దేహధారణము (మానవ శరీరంతో బ్రతుకు నీడ్చుటతో యెంత కాలము గడుపవలెనో కదా! దీనివలన నాకు ఒరిగినదేమిటి? చింతల యొక్క పరంపరతో (వరుసతో) బ్రతుకును చిక్కులు వడుతూ (ఇబ్బందులకు లోనవుతూ) నెట్టుకు రావలసి వచ్చింది.

వడిగొన్న (మెలిబెట్టునట్టి) మోహము వలలో చిక్కుబడుట చేతనే కదా! అంతులేని గర్భనరకంలో పడి ఆ దుర్గంధంలో ఈదులాడవలసి వచ్చింది. నడమంత్రపు సుఖములతో అతిశయింప బడకుండ పోవుట చేతనే కదా! తొడలి (అనుసరించి) హేయపు (నీచమైన) దిడ్డి దూరాడవలసె (చిన్న చిన్న సందుల గుండా దూరి చరించ వలసి వచ్చింది). అనగా, నేను అమిత సుఖముల నాసించుట చేతనే జీవితంలో రకరకముల లొంగుబాట్లు పొందాను... అని అర్థం.

పాపములనెడి త్రాళ్లతో పట్టుబడుటచేతనే కదా! అనుక్షణం ఆపదలకు లోనయ్యే దేహమును ధరించవలసి వచ్చింది. చూపులకు వశమై లొంగిపోయే సుఖము నాసించుట చేతనే కదా! దీపన భ్రాంతి (గొప్ప భ్రమ)తో దిరుగాడ వలసి వచ్చింది.

మేలు కలిగించు శ్రీవేంకటేశుని కొలువక పోవుట చేతనే కదా! ప్రతిలేని (మారులేని) నరక కూపమున బడి నలిగిపోవలసి వచ్చింది. ఆ దేవదేవుని కరుణామృతము లభించకపోవుట చేతనే కదా! వారినీ వీరినీ బ్రతిమిలాడుచు బ్రతుకు నీడ్చుటకు పాకులాడవలసి వచ్చింది.

## 6-90

## మున్నుడి

భవబంధాలలో తగులుటవలన నేను, నాది, నావాళ్లు అనే పీకులాటలో, పడి, సుఖదుఃఖాలనుభవిస్తుంటాడు జీవుడు. ఇవి విచిత్రమైన బంధాలు. ఎంత వదిలించుకుందామంటే అంత బిగుసుకుంటాయి. కామ క్రోధములు మొదలైన అరిషడ్వర్గాల ప్రాబల్యం వల్ల సత్యము నెరుగలేక తనే శక్తిశాలినని విఱ్ఱవీగి భగవంతుడే లేడంటాడు నరుడు. ఈ రోగానికి మందులేదు. పోనీ మంత్రం చదివించి ఈ పీడనుంచి వదిలించాలంటే ఏమంత్రమూ పనిచేయదు. ఆ మందూ మంత్రమూ కూడా మీ మనస్సులోనే వున్నాయి. ఆ మందేమిటో వివరిస్తున్నారు, అన్నమాచార్యులవారు. ఇది చదివి తెలియండి.

**తే॥ మందులేదురా దీనికి మంత్రమైన,**
**మందు మంత్రము కలవురా మనసులోనె**
**తలపులందున శ్రీపతిన్ నిలుపవలెను**
**'అలతి' గొనుడు ఈ మందనె అన్నమయ్య**

**రాగం : నాట**

మందులేదు దీనికి మంత్రమేమియు లేదు
మందు మంత్రము తన మతిలోనె కలదు ॥మందు॥

కదలకుండ తన్ను కట్టివేసిన కట్టు
వదలించుకొన కొంత వలదా
వదిలించబోయిన వడిగొని పైపైనే
కదియుగాని తన్ను వదలదేమియును ॥మందు॥

మనసు లోపల నుండి మరి మీదట తానుండి
ఎనసిన తిరువేంకటేశుని
తనరిన తలపున తలపు దుష్కృతములు
తనకు తానే వీడు తలక వలదు గాన ॥మందు॥





**భావామృతం :**

ఓ జనులారా! దీనికి (ఈ భవరోగానికి) మందు లేదు. పోనీ ఈ పీడ వదిలిద్దామంటే దీన్ని ఏ మంత్రము చదివినా పోగొట్టలేము. ఆ మందూ మంత్రమూ కూడా తన (మానవుని) మతిలోనె (మనస్సులోనె) కలవు. ఇది గ్రహించండి.

ఆ భవబంధము కదలకుండా ఆ మానవుని కట్టి వేసెడి కట్టు (బంధము). అటువంటప్పుడు మానవ ప్రయత్నం చేసి కొంతన్నా వదలించుకోవాలా? వద్దా? అలాగని వదిలించ బోతే, వడిగొని (మెలిపెట్టి), పైపైనె కదియును (సులభముగా సమీపించును గాని తనను ఒక్కటి కూడా వదలదు.

మరి, తాను (ఆయన) మీదట (తిరుమలపైన) ఎనసిన (వున్న) తిరువేంకటేశుని (శ్రీవేంకట రమణునివలె) మనసులోపలనుండి, తనరిన (అతిశయించినట్లు చేసినచో) తలపున తలపు (ఆలోచనలలో కలుగు) దుష్కృతములు (పాపములు) తనకు తానే (తమంతట తామే) వీడు (విడిచిపోతాయి). గాన (కాబట్టి) తలక వలదు (భయపడవద్దు).



## 6-91

## మున్నుడి

అలమేలుమంగపై చక్కటి సరస శృంగార కీర్తన చెబుతున్నారు అన్నమాచార్యులవారు. ఇటువంటి కీర్తనలలో అన్నమయ తనని తాను అమ్మవారి చెలికత్తెగా భావించుకొని అమ్మవారికి కీర్తన వినిపిస్తుంటారు. ఇది వలపులు మరియు సొలపులు (పరవశించి పోవుటలు) కలిగిన వసంత ఋతువు, చల్లని వేళ అయినా వంటినిండా చెమరించీని (చెమటలు పట్టినవి). ఈ అవస్థ చూచి నీవు సెలవి నవ్వకువే (చిరునవ్వులు చిందించబోకే). అని అమ్మవారితో అంటున్నారు. (అన్నమయ్య రాజుగారి ఆ స్థానంలో చెప్పి వుంటారీ కీర్తన).

**ఆ.వె॥ సెలవినవ్వబోకు చెమరించు నీ మేను**
**సొలపులును వలపులు సొంపుమీరె**
**చక్కనైనదిది వసంత వేళనినాడు**
**అన్నమయ్య, మురియ హరియు రమయు.**

**రాగం : మోహన**

వలపుల సొలపుల వసంతవేళ యిది
సెలవి నవ్వకువే చెమరించీ మేను ॥వలపుల॥

శిరసు వంచకువే సిగ్గులు వడకువే
పరగ నిన్నతడు తప్పక చూచీని
విరులు దులుపకువే వెసదప్పించుకోకువే
సిరుల నీ విభుడిట్టే సేసవెట్టీని ॥వలపుల॥

చేయెత్తి యొడ్డుకోకువే చేరి యాన పెట్టకువే
చాయల నాతడు నీ చన్నులంటీని
ఆయములు దాచకువే అట్టే వెరగందకువే
మోయనాడీ సరసము మోహాన నీ విభుడు ॥వలపుల॥





పెనగులాడకువే బిగువు చూపకువే
ఘన శ్రీవేంకటేశుడు కౌగిలించీని
అనుమానించకువే అలమేల్మంగవు నీవు
చనవిచ్చి నిన్నునేలె సమ్మతించీ యాతడు ॥వలపుల॥

**భావామృతం :**

(అలమేలు మంగమ్మ చెలికత్తె అంటోంది. "ఓ చెలీ! నీ ప్రియుని సమాగమవేళ ఇది). నీవు సెలవి నవ్వకువే (నీ పెదవులను వోరగా వంచి, నవ్వబోకే)... చెమరించకువే (చెమటతో చిత్తడి అయిపోవద్దే). ఎందుకంటే... ఇది వలపుల వసంతవేళ. సొలపుల (పరవశముల) శోభన వేళ.

(ఓ చెలీ! ఇప్పుడు నీవు చేయకూడని పనులు చెబుతాను వినుము). నీ తల, మరీ అంత క్రిందకి వంచుకోకు. అపరిమితమైన సిగ్గు అసలు పనికిరాదు. అప్పుడే నిన్నతడు బాగుగా చూడగలడు. విరులు దులుపుకువే (నీతలలో పూలు రాలిపోవునంతగా తల కదలించకు). నిన్నతడు పట్టుకోవాలని ప్రయత్నిస్తే తొందరగా తప్పించుకోవద్దు. ఆయన నీ విభుడు (నీ భర్త). ఇట్టే సేసవెట్టీని, పైగా ఇప్పుడు పెండ్లి కూడా చేసికొనినాడు. (ఆయనను అడ్డే వారెవరు?)

ఓ సఖీ! నీ చేతిని యెత్తి ఆయనను అడ్డుకోకు. అట్లా చేయవద్దు. ఇట్లా చేయవద్దు అని ఆంక్షలు పెట్టకూడదు. చాయల (నీడలో... అంటే.. రహస్యంగా) నాతడు నీ వక్షోజ స్పర్శ చేస్తాడు. ఆయములు దాచకువే. (మర్మస్థానములనంతగా దాచుకోకూడదు సుమా!) అట్టే వెరగందకువే (మరీ అంత భయపడిపోవద్దు). నీ విభుడు మోహాన (మోహపరవశుడై) సరసము మోయనాడీ (భరించలేక పోతున్నాడు).

(ఓ దేవీ! ప్రియ సమాగమవేళ... ఆయన నీ పరిష్వంగము నాసిస్తే...) మరీ అంత పెనగులాడకువే (తప్పించుకోకూడదు). బిగువు (బెట్టుసరి) చూపకూడదు. నిన్ను కౌగలించుచున్న దెవరు? స్వయంగా జగదేక పతియైన శ్రీవేంకటేశ్వరుడు. నీవు సాధారణ స్త్రీవి కావు. జగన్మాతయైన అలమేలు మంగవు. ఇక నీవు అనుమానించవద్దు. అందుకే ఆతడు నిన్ను సమ్మతించి, నీకు చనవిచ్చి (స్వాతంత్ర్యం) ఇచ్చి యేలీని (నిన్ను యేలుకొనినాడు).

**6-92**

## మున్నుడి

అభిషేకానంతరం అద్భుతమైన కీర్తన నాలపిస్తున్నారు అన్నమాచార్యులవారు. జనులారా ఈ శ్రీవేంకటేశ్వరుడు ఇంతమందికి భాగ్యమువలెనున్నాడు. ఈయనను భావించండి, సేవించండి. అందరూ చేరుకొని ఆయనకు మొక్కండి అంటున్నారు. జలకములాడి, కర్పూర ధూళిమెత్తుకొని, తట్టుపుణుగు అలదుకొని, ముందటి మాదిరిగానే సొమ్ములు పెట్టుకొని అలమేల్మంగను 'మెడకు కట్టుకొని' బంగారు పద్మంవలె ఆయన కొలువుదీరి దాసులకు నిధానమై వున్నాడట.

**చం॥ హరికిని మొక్కరో జనులు ఆతని సేవలు చేయరో వెసన్**
**సరిగల భావమొప్పగను చక్కగ నుండెను భాగ్యదాతయై**
**వరుడలమేలుమంగకును వల్లభుడాయెను వేంకటేశుడై**
**మురియుచు అన్నమార్యుడనె ముక్తియు భృత్యుల భుక్తి శ్రీహరే**

**రాగం : హిందోళం**

సేవించరో జనులాల చేరి మొక్కరో
భావింపనున్నాడిందరి భాగ్యము వలెను ॥సేవించ॥

జలకమాడివున్నాడు సర్వేశ్వరుడు నిగ్గు
గలిగిన మంచి నల్లకలువ వలెను
ఎలమి కప్పురకాపు ఇదె చాతుకున్నవాడు
వెలలేని యట్టి పెద్ద వెండి కొండవలెను ॥సేవించ॥

అందముగా తట్టుపుణుగు అలదుక నున్నవాడు
కందువ ఇంద్రనీలాల గనివలెను
ముందటి వలెనె తాసొమ్ములు నించుకున్నవాడు
పొందిన సంపదలకు పుట్టినిల్లువలెను ॥సేవించ॥





మించి అలమేల్మంగ మెడగట్టు కొన్నవాడు
మంచి బంగారు తామరపువ్వు వలెను
ఎంచగ శ్రీవేంకటేశుడిదే కొలువైవున్నవాడు
నించిన దాసుల పాలి నిధానము వలెను ॥సేవించ॥

**భావామృతం :**

ఓ జనులారా! ఈ దేవదేవుని సేవించండయ్యా! ఈయన సన్నిధికి వచ్చి మొక్కండి. ఈ స్వామి మనందరి భాగ్యమువలె భావించుటకై దర్శనమీయుచున్నాడు.

ఈ సర్వేశ్వరుడు, ఇప్పుడే జలకమాడియున్నాడు. (స్నానం చేసినాడు). నిగ్గున్ కలిగిన (శోభిల్లుచున్న) మంచి నల్లకలువ వలెవున్నాడు. వికాసముతో కర్పూర ధూళిని ఈ స్వామి కాపుగా చాతుకున్నాడు (ధరించినాడు). గణనకు సాధ్యము గాని విలువైన పెద్ద వెండి కొండవలె వున్నాడు.

ఈ స్వామి సువాసన కోసం తన దేహానికి తట్టుపునుగు (పునుగు పిల్లినుంచి వచ్చిన సుగంధ ద్రవ్యము) అలదుకొనినాడు (అద్దుకున్నాడు). చమత్కారముగా ఈ స్వామి ఇంద్రనీల మణుల గనివలె వున్నాడు. ముందటి వలె (ఇదివరకు మాదిరిగానే) ఈయన ఒంటిపై పెక్కు ఆభరణములను ధరించియున్నాడు. అనేక సంపదలకు ఈయనే పుట్టినిల్లా అన్నట్లున్నాడు.

ఈ స్వామి దేవి అలమేలు మంగను, మెడగట్టుకొన్న (వివాహమాడిన) శ్రీపతి. ఈయన మంచి బంగారు కమలం వలెనున్నాడు. ఈ శ్రీ వేంకటేశ్వరుడు ఇదే కొలువై వున్నాడు. నిండిన (ఎక్కువవున్న) నీ దాసులకు ఈయన నిధానమువలె (బంగారు పాతరవలె) వున్నాడు.

6-93

## మున్నుడి

బాలకృష్ణునిపై ఇంతవరకు యెన్ని పాటలు, పద్యాలు, కీర్తనలు వచ్చినా ఇటువంటి కీర్తన నేను ఇంత వరకు యెవరి ద్వారా కూడా వినలేదు. అన్నమాచార్యుల వారు ఏమంటున్నారో వినండి. ఆనాటి కాలము వారు యెందుకు మోసపోయిరో తెలియకుండా వున్నది. కనీసం బ్రహ్మ ఆయనను కీర్తించాక గాని, గోవర్ధన గిరిని యెత్తినప్పుడుగాని, విశ్వరూపం చూపిన తరువాత గాని, చక్రాయుధంతో బాణుని నరికినాక గాని, సురేంద్రుడు అర్చించాడంటే గాని నమ్మవద్దా? ఆ కృష్ణయ్యే తానైన ఈ శ్రీవేంకటేశ్వరుని కాక, పరులను గొలువ వచ్చునా, అంటున్నారు.

**తే॥ ఏల మోసపోయిరొ కాని యెంచి నాటి**
**వారు, బాలకృష్ణుని నమ్మి బ్రతుకరైరి**
**అతని మహిమల దెలిపెరా అన్నమయ్య**
**తిరుమలేశుని కాదన్న పరులు గలరె?**

**రాగం : లలిత**

ఏల మోసపోయిరొకో యెంచియా కొలపు వారు
బాలకృష్ణుని బంట్లే బ్రతుకవద్దా ॥ఏల॥

పసులగాచేవాని బ్రహ్మ నుతించే నంటేను
దెసల దేవుడేయని తెలియవద్దా
సిసువు గోవర్ధనాద్రి చేతబట్టి యెత్తెనంటే
కొసరీతని పాదాలే కొలువవద్దా ॥ఏల॥

నరునికి విశ్వరూపున్నతి జూపెనంటే
నరహరి యితడని నమ్మవద్దా
పరగ జక్రము చేత బాణుని నఱకెనంటే
సొరి దీతని శరణు చొఱవద్దా ॥ఏల॥





అందరు సురులలోన నగ్రపూజ గొన్నప్పుడే
చెంది యీతని కృపకు జేరవద్దా
అంది శ్రీవేంకటేశుడట్టె ద్రిష్ట దైవమంటే
విందుల బరుల సేవ విడువవద్దా ॥ఏల॥

**భావామృతం :**

ఆ కాలము వారు (ద్వాపరయుగం నాటివారు) ఏల మోసపోయిరో తెలియుటలేదు. ఆ బాలకృష్ణుని గాథలు విన్నాకనైనా ఆయన బంట్లై (సేవకులై) బ్రతుక వద్దా! (ఓ మానవులారా! ఆలోచించండి).

ఒక పశువుల కాపరిని స్వయంగా బ్రహ్మదేవుడు ప్రార్థించాడంటే, ఆయన దెసల దేవుడు (మన పక్కనే వున్న దేవుడు) అని గుర్తించవద్దా? ఒక సిసువు (శిశువు) గోవర్ధనగిరిని చేతితో పట్టుకొని యెత్తాడంటే, కొసరీతని (కొసరు + యీతని = విజృంభించుచున్న ఇతని) పాదములను కొలువవద్దా?

భారతయుద్ధంలో నరునికి (అర్జునునికి) విశ్వరూపమును చూపించాడు అని చెప్పాకనైనా నరహరి (శ్రీమన్నారాయణుడు) ఇతడే అని నమ్మవద్దా? విష్ణుమూర్తి స్వంతమైన సుదర్శన చక్రంతో బాణాసురుని చంపాడని విన్నప్పుడైనా, సొరిది (ఆ క్రమమున) ఇతనిని శరణము నర్థించవలదా? ఇంకా ఏమి నిరూపణ కావాలి?

అంతమంది దేవతలంటే ఇంద్రుడు, ధర్మజుడు శంకరుడు వంటి వారిచేత అగ్రపూజ స్వీకరించాడు అంటే, పూని ఈతని కృపకోసం ఈయన నాశ్రయించవద్దా? ఈ శ్రీవేంకటేశ్వరుడే "ద్రిష్టదైవము" (కనబడు దైవము) అని మేము చెబుతుంటే వినకుండా, విందుల (స్వల్ప లాభం కోసం) పరులను (ఇతర దేవతలను) ఆశ్రయించవచ్చునా?

**6-94**

## మున్నుడి

అహోబల నృసింహునిపై అద్భుతమైన కీర్తన చెబుతున్నారు, అన్నమాచార్యులవారు. ఇది దృశ్యానుభూతిని కలిగించు కీర్తన. అన్నమయ్య పాడుతుంటే ఆ నృసింహుని సభ కళ్లకు గట్టినట్లు కనిపిస్తుంది. ఆ సభలో వైతాళికుడై ఆచార్యులవారు తాను సభికులందరినీ "సముఖ ఎచ్చరిక"... స్వామి వస్తున్నారని హెచ్చరిస్తున్నారు "ఓ సర్వేశ్వరా! నీ కొలువు ఇదిగో ఈ విధంగా అమరింది" అని ఆ ప్రహ్లాద వరదుని సభను వర్ణిస్తున్నారు. అహోబలంలోనే కాక వేంకటాద్రిపైన కూడ ఈయనే వున్నాడట.

**తే॥ సముఖ సర్వేశ్వరుడవు యెచ్చరిక ఇదియె**
**అమరె నీ కొలువిదియె ప్రహ్లాద వరద!**
**నారసింహుని కొలువును నయము మీర**
**అలతి పాడి కీర్తించెరా అన్నమయ్య.**

**రాగం : కాంభోజి**

సముఖ ఎచ్చరిక వో సర్వేశ్వరా
అమరె నీ కొలువు ప్రహ్లాద వరద ॥సముఖ॥

తొడమీద కూచున్నది తొయ్యలి ఇందిరాదేవి
బడి చెలులు సోబాన పాడేరు
నడుమ వీణ వాయించీ నారదు దల్లవాడె
అలరి చిత్తగించు ప్రహ్లాద వరద ॥సముఖ॥

గరుడోరగాదు లూడిగములు నీకు చేసేరు
ఇరుమేలా కొలిచేరు ఇంద్రాదులు
పరమేష్ఠి ఒకవంక పనులు విన్నవించీ
అరసి చిత్తగించు ప్రహ్లాద వరదా ॥సముఖ॥





పొదిగొని మిమ్ము నిట్టే పూజించేరు మునులెల్ల
కదిసి పాడేరు నిన్ను గంధర్వులు
ముదమున అహోబలమునను శ్రీవేంకటాద్రిని
అదె చిత్తగించుము ప్రహ్లాద వరద ॥సముఖ॥

**భావామృతం :**

ఓ ప్రజలారా! నరసింహస్వామి వేంచేస్తున్నారు. సముఖమిస్తున్నారు (దర్శనం ఇస్తున్నారు). ఎచ్చరిక (జాగ్రత్తగా వుండండి). ఓ సర్వేశ్వరా! ప్రహ్లాద వరదా! నీ కొలువ (సభ) అమరె (సిద్ధంగా వున్నది).

తొయ్యలి (నారీ లలామ అయిన) లక్ష్మీదేవి నీ ఎడమ తొడపై కూర్చున్నది. చెలులందరు పూనుకొని సోబనాలు (మంగళ గీతములు) పాడుచున్నారు. అదిగో ఆ కనబడుతున్న మధ్యలోని వాడే నారదుడు. ఆయన బహుసొంపుగా వీణ వాయిస్తున్నాడు. ఓ ప్రహ్లాద వరదా! సంతోషంతో వీరందరినీ చిత్తగింపుము. (ఆలకింపుము) ప్రభూ! మేము నీ శరణు కోరి వచ్చాము.

గరుడోరగాదులు (గరుడ + ఉరగాదులు = గరుత్మంతుడు మరియు ఆదిశేషుడు) నీకు ఊడిగములు (చాకిరీ) చేస్తున్నారు. ఇంద్రాది దేవతలు నీకు రెండు వైపులా నిలిచి కొలుచుచున్నారు. పరమేష్ఠి (బ్రహ్మదేవుడు) ఒకవంక (నీకు ఒక పక్క నిలబడి) పనులు విన్నవించీ (నీవు చేయవలసిన పనులను విశదపరుస్తున్నాడు). ఓ ప్రహ్లాద వరదా! వారిని ఆలకించి ఆదుకోవయ్యా!

మునులు, పొదిగొని (గుంపుగూడి) ఇట్టే మిమ్ము పూజించేరు. గంధర్వులందరు కదిసి (దగ్గరై) నిన్ను స్తోత్రములు పాడి ముదమున (సంతోషంతో) వున్నారు. ఇక్కడ అహోబలంలోను, అక్కడ శ్రీవేంకటాద్రి మీద కూడా నీకిదే కార్యక్రమము. అందుచేత, ఓ ప్రహ్లాద వరదా! మా విన్నపములను చిత్తగింపుము తండ్రీ!

**6-95**

## మున్నుడి

జగద్గురువు శ్రీమన్నారాయణుడే అని వేదము చాటి చెప్పింది. తానె ఇందరి గురుడు అంటున్నారు అన్నమాచార్యులవారు. పైగా ఈ గురుడు సానబట్టిన భోగి. పదియారువేల మందికి దాంపత్య సుఖమిచ్చినా ఈ వజ్రంలాంటి భోగి, అస్ఖలిత పురుషుడనే పురాణం చెప్పింది. ఈయన జ్ఞానయోగి, కర్మఫలాసక్తిలేని కర్మయోగి అందరికీ మోక్షమొసగే బ్రహ్మయోగి. కపిల మహర్షి, దత్తాత్రేయుడూ ఈయనే. సంసార యోగంలో వున్న సామాన్యులకు అభ్యాస యోగమిచ్చే శ్రీవేంకటేశ్వరుడు ఈయనే అంటున్నారు.

**ఆ.వె॥హితుడు తానె, తానె ఇందరి గురుడును**
**సానబట్టినట్టి సహజ భోగి**
**తనరు జ్ఞానయోగి దత్తగురుండనె**
**అన్నమయ్యపాడి అతని పొగిడె.**

**రాగం : శుద్ధ ధన్యాసి**

తానె తానె ఇందరి గురుడు
సానబట్టిన భోగి జ్ఞానయోగి ॥తానె॥

అపరిమితములైన యజ్ఞాలు వడిజేయ
ప్రపన్నులకు బుద్ధి పచరించి
తపముగా ఫలపరిత్యాగము సేయించు
కపురులగరిమల కర్మయోగి ॥తానె॥

అన్ని చేతలును బ్రహ్మార్పణ విధి జేయ
మన్నించు బుద్ధులను మరుగ జెప్పి
ఉన్నత పదమున కొనరంగ కరుణించు
పన్నగ శయనుడె బ్రహ్మయోగి ॥తానె॥





తనరగ కపిలుడై దత్తాత్రేయుడై
ఘనమైన మహిమ శ్రీవేంకట రాయడై
ఒనరగ సంసార యోగము కృపసేయు
అనిమిష గతులను అభ్యాసయోగి ॥తానె॥

**భావామృతం :**

శ్రీమన్నారాయణుడు జగద్గురువు. తానె తానె (ఆయనే) అందరి గురుడు. ఈయన, సానబట్టిన (రాటుదేలిన) భోగి. అనగా బాగా అనుభవజ్ఞుడైన భోగపురుషుడు అంతేకాదు భగవద్గీతా వాక్యము వినిపించిన జ్ఞానయోగి. ఈయనకు సాటి యెవ్వరూ లేరు.

ప్రపన్నులకు (కర్మిష్ఠులైన వారికి) అసంఖ్యాకంగా యజ్ఞయాగాదులు చేయు బుద్ధిని ప్రసరింపచేసి అదే తపస్సుగా ఆ కర్మలవల్ల లభించే ఫలమును త్యజించునట్లు చేయించు కపురుల (రక్షకుడైన) గరిమల (మహిమాన్వితుడైన) కర్మయోగి (ఫలాసక్తి లేక కర్మలు నిర్వహించు యోగి).

ఇక బ్రహ్మయోగి ఎటువంటి వాడో తెలుసుకొనెదము. ఏపనిచేసినా బ్రహ్మార్పణకే అనునట్లు చేసి, పరులను మన్నించు బుద్ధులను మరుగ జెప్పి (చాటించి) వారికి ఉన్నతమైన పదములభించునట్లు కరుణించు వాడునూ, ఆదిశేషునిపై పవళించువాడును యైన నారాయణుడే బ్రహ్మయోగి.

ఆ నారాయణుడే దివ్యాంశతో జన్మించి కపిల మహర్షియైనాడు. ఆయనే దత్తాత్రేయుడై గొప్ప జ్ఞానమును ప్రసాదించాడు. నేడు ఘనమైన మహిమలు గల శ్రీవేంకటేశ్వరుడైనాడు. జీవులకు సంసారయోగమును కరుణించి దాని ద్వారానే స్వర్గ ప్రాప్తి కలుగ జేయు అభ్యాసయోగి కూడా ఆ మహానుభావుడే.

## 6-96

## మున్నుడి

శ్రీవేంకటేశ్వరుడు జగన్మాత అలమేల్మంగను పెండ్లాడుతున్నాడు. దేవతలు, మునులు, దేశాధినేతలు, ప్రముఖులు ఆ జంటను చూచి, "ఆహా! ఏమి మన అదృష్టం జగదేకపతి జగన్మాతను పెండ్లాడుతున్నాడు. తను భూకాంతుడ నని ఆ స్వామి మరువలేదు. అందుకే ఇద్దరు ముద్దు గుమ్మలూ ఆయనకు పెండ్లి కూతుళ్లయ్యారు. ఓహో! ఈమెకు ఈ పెండ్లికొడుకు, ఈయనకు ఈ పెండ్లి కూతురు తగిన జంట. ఈ శోభనము (శుభకార్యము) చూడటానికి కన్నుల పండుగవలె వున్నది... అంటున్నారు అన్నమాచార్యులవారు.

**కం॥ ఈపెకు నీతడు తగు నిక**
**ఈపెయు తగుజంట జుమ్మి!! యీతని కనియెన్**
**చూపులకు పండుగాయెను**
**ఆపై అన్నయ్య పాడె హరి శోభనమున్**

**రాగం : సాళంగనాట**

ఈపెకు నితడు దగు నితని కీపె దగు
చూపులకు పండుగాయ శోభానము నేడు ॥ఈపెకు॥

పిలువరె పెండ్లికూతు బెండ్లి పీటమీదికి
చెలగి తానెదురు చూచీ దేవుడు
బలువుగా నిద్దరికి బాసికములు గట్టరె
కలిమెల్ల మెరసి సింగారించరే ॥ఈపెకు॥

ఆతల దెచ్చి పెట్టరె ఆ పెండ్లికూతురును
యీతడే జంట శోభన మిద్దరికిని
కాతరాన బువ్వానకు గక్కన బెట్టరె మీరు
రేతిట నుండియు వేగిరించేరు వీరు ॥ఈపెకు॥





సానుపు వరచరె బలు నాగవల్లి నేడు
పూని తెర వేయరె పొలతులాల
ఆనుక శ్రీవేంకటేశుడలమేలుమంగయును
లోననె భూకాంతయును లోలులైరి తాము ॥ఈపెకు॥

**భావామృతం :**

ఆహా! యెంత చక్కని జంట ఇది!!! ఈపెకు (ఈమెకు) నితడు తగిన వరుడు. ఈమె కూడా ఇతనికి తగిన వధువు. నేడు ఈ శోభనము (శుభకార్యము) చూపులకు (కన్నులకు) పండుగ వలెనున్నది. దీనిని చూచిన మన జన్మధన్యమైనది.

అమ్మా! పెండ్లి కుమార్తెను పిలువరే (తీసికొనిరండి), పెండ్లిపీటలమీద ఆ స్వామి సిద్ధంగా వున్నాడు. ఆయన దేవదేవుడై కూడా ఎంత చెలగి (ఉత్సాహంతో) ఎదురు చూస్తున్నాడో చూడండి. ఇద్దరికీ బాసికాలు కట్టండి. కంగారులో ఊడిపోతాయి, కాస్త బలువుగా (గట్టిగా బిగించి) కట్టండి. కలిమి యెల్ల మెరసి సింగారించరే (వారి ఐశ్వర్యం అందరికీ కళ్లు మిరిమిట్లు గొలిపేట్లు అలంకరించండి.

ఆతల (ఆ తరువాత) ఆ పెండ్లి కూతురును తీసికొని వచ్చి పెండ్లి పీటల మీద కూర్చోపెట్టండి. ఈ స్వామి ఈమెకు తగిన చక్కని జంట. ఇద్దరికి కాతరాన (గబగబా) బువ్వానకు (భోజనాలు) గక్కున (వెంటనే) పెట్టండి. ఆ తరువాత వారు చేయవలసిన తంతు చాలా వున్నది. రేతిట నుండియు (చీకటి పడుతోంది) వేగిరించేరు (చూడండి వాళ్లెలా తొందరపడుతున్నారో).

నేడు నాగవల్లి మనస్సు పులకరించే వేడుకలు ఈ తంతులోనే వుంటాయి. చక్కటి పాన్పు పరవండి. ఆలస్యం చేయకండి. అమ్మాయిల్లారా! వీరిమధ్య తెరకట్టండి. ఆపైన శ్రీవేంకటేశ్వరుడు అలమేలు మంగ, ఇది వరకే ఆయనను కట్టుకొన్న భూదేవి, ఆయన వద్ద చేరేటప్పటికి ఆయనకు లోలులైరి (లొంగిపోయారు). అంతే కదా! ఆ జగన్మోహనుని గ్రహించుట కెవ్వరికీ సాధ్యం కాదు.

## 6-97

## మున్నుడి

గోవిందుని నామమును ఉచ్చరించుటకు ఇప్పుడు కొల్లలుగా (అధికముగా) మనకి దొరికింది. ఓ భక్తులారా! ఆవల ఈవల ఆడుదము. మన నోరు గుమ్మలుగ (నోరారా) ఈతనిని పాడుదము (కీర్తించెదము) అంటున్నారు అన్నమాచార్యులవారు. శ్రీహరి నామమహిమను వర్ణిస్తున్నారు. తిరుమలలోని స్వామిని మన కనుల యెదుట ప్రత్యక్షం చేస్తున్నారు. "కలదు కలండనెడివాడు కలడో లేడో" అని గజేంద్రుడు సందేహించాడు కాని, అన్నమయ్య "కలదు కలడితని కని మనరో" అంటున్నారు.

**ఆ.వె॥కొల్లలుగను దొరికె గోవిందు నామంబు**
**అవల నివల మీరు ఆడరమ్మ!**
**నోరుగుమ్మలుగను హరిని పాడుదమని**
**అన్నమయ్య పలికె నద్భుతముగ.**

**రాగం : ముఖారి**

గోవిందాది నామోచ్చారణ కొల్లలు దొరకెను మనకిపుడు
ఆవల నీవల నోరగుమ్మలుగ ఆడుద మీతని పాడుదము ॥గోవిందా॥

సత్యము సత్యము సకల సురులలో
నిత్యుడు శ్రీహరి నిర్మలుడు
ప్రత్యక్షమిదే ప్రాణుల లోపల
అత్యంతము శరణనరో ఇతని ॥గోవిందా॥

చాటెడి చాటెడి సకల వేదములు
పాటించిన హరి పరమమని
కూటస్థుడితడు గోపవధూపతి
కోటికి ఈతని కొలువరొ జనులు ॥గోవిందా॥





నిలుచున్నాడిదె నేడును నెదుటను
కలిగిన శ్రీవేంకట విభుడు
వలసిన వారికి వరదుండీతడు
కలదు కలడితని కని మనరో ॥గోవిందా॥

**భావామృతం :**

ఇప్పుడు మనకు గోవింద మొదలైన విష్ణునామాలు కొల్లలుగా (అపరిమితముగా) దొరికినవి (లభించినవి). ఆవల నీవల నాడుదము (అక్కడా ఇక్కడా నర్తించెదము. నోరు గుమ్మలుగా (నోరు పండు విధముగా) పాడెదము. (కీర్తించెదము). మనం తరించుటకు ఆనామోచ్చరణే సరైన తరుణోపాయం.

ఈ మాట సత్యము, సత్యము. శ్రీహరి దేవతలందరిలో నిత్యుడు (నిత్యమూ కలుగువాడు). ఆయన నిర్మలుడు (పవిత్రుడు). ప్రత్యక్షముగా ప్రాణము రూపంలో ఈయన సర్వజీవులలో వున్నాడు. అత్యంత భక్తితో ఈయనను శరణు వేడండి.

సకల వేదములు శ్రీహరి పరమము (సర్వశ్రేష్ఠుడు) పరమాత్మ అని మరీ మరీ చాటినవి. ఆయన కూటస్థుడు (అంతర్యామి), గోపికలు వరించిన మనోహరుడు. ఈతనిని జనులందరూ కోటికి (అతిశయముగా) కొలువరో (సేవించండయ్యా)

ఈ స్వామి నేడు మన యెదుటనే నిలిచియున్నాడు. ఈయనే శ్రీ వేంకటేశ్వరుడు. ఈతడు వలసిన వారికి (ఆర్తులకు) వరదుడు (వరములననుగ్రహించువాడు). ఇతడు కలదు కలడని (ఉన్నాడు ఉన్నాడని) కని మీ ఆత్మలో దర్శించి మనరో జీవించండి. అదే మీకు ముక్తినిస్తుంది.

**6-98**

## మున్నుడి

అన్నమాచార్యులవారి ఈ దశావతార వర్ణన కీర్తన గొప్పతనం అర్థం చేసికొనవలెనంటే ఎవరికైనా అంత తేలికకాదు. పురాణేతిహాసాలు పుక్కిట బట్టాలి, తెలుగు వ్యాకరణంలో మెలకువలు తెలిసి ఉండాలి. అన్నమయ్య పడికట్టు తెలిసి ఉండాలి. అన్నిటికీ మించి... అలమేలుమంగ హస్తకమలములు యెవరిని కౌగిలిస్తాయో ఆ తిరుమలగిరి రాయని అపార కరుణ వుండాలి. నాబోటి సామాన్యునికి అయితే అడుగడుగునా కడతేర్చే గడచిన జన్మ సుకృతం వుండాలి. నామాట... నిజం.

**ఆ.వె॥ పెక్కులంపటముల పేదవైతివి, మదిన్**
**యెక్కడైన లేరు యెవరు నీకు**
**హరిదశావతారమన్నయ్య వర్ణించె**
**యేమి సేతువనుచు యెదురు బుచ్చె.**

**రాగం : ఆహిరి**

పెక్కులంపటాల మనసు పేదవైతివి నీకు
నెక్కడా నెవ్వరు లేరు యేమిసేతువయ్యా ॥పెక్కు॥

కన్నుమూయ బొద్దులేదు, కాలు చాచనిమ్ము లేదు
మన్ను దవ్వికిందనైన మనికి లేదు
మున్నీటి వలెనే గోరు మోపనైన జోటులేదు
యిన్నిటా నిట్లానైతి వేమిసేతువయ్యా ॥పెక్కు॥

అడుగిడగ నవ్వల లేదు, అండనైనా నుండలేదు
పుడమి గూడు గుడువనైన బొద్దులేదు
వెడగుదనము విడువలేదు, వేదమైన జదువలేదు
యెడపడడప నిట్ల నీకు నేమి సేతువయ్యా ॥పెక్కు॥





వుప్పరములు మానియైన నుండలేదు, లోకమందు
నిప్పుడైన నీ విహారమిట్ల నాయను
చెప్పనరుదు నీ గుణాలు శ్రీవేంకటేశ యిట్ల
నెప్పుడును ఘనుడ వరయ నేమిసేతువయ్యా ॥పెక్కు॥

**భావామృతం :**

ఓ దేవదేవా! నీకు పెక్కులంపటాలు వున్నాయి. (బోలెడు బంధనాలు వున్నాయి). అందుకనే మనసు పేదవైతివి. (ఎప్పుడూ నీ మనస్సు పేదవాని మనస్సులా బాధపడుతూనే వుంటుంది, అందరూ నీ బిడ్డలే కదా!). అయితే, నీకు ఎక్కడ కూడ ఎవ్వరూ లేరు. ఏమేమి పనులు చేస్తావయ్యా!!

"కన్నుముయ్య పొద్దులేదు" కళ్లు తెరిచే వుంటాయి. ఎన్నడూ కన్ను మూయడు, (మత్స్యావతారము). "కాలుచాచన్ ఇమ్ములేదు" కాళ్లు లోపలికి ముడుచుకొని తాబేలై పర్వతం మోశాడు. (కూర్మావతారము). "మన్ను దవ్వికిందనైనా మనికి లేదు" నేలను తవ్వుకుంటూ పాతాళానికి పోయి స్థానం లేకుండా చేశాడు. (వరాహావతారము). "మున్నిటి వలెనే గోరు మోపనైన చోటు లేదు" ఇదివరకు వలెనే యెక్కడా గోరు కూడ నేలకానించలేదు (నరసింహావతారం). ఇన్నింటిలోనూ ఇట్లా అయ్యావు. మేమేమి చేయగలమయ్యా!

"అడుగిడన్ అవ్వలలేదు" కాలుమోపే సందు లేకుండా చేశావు. (త్రివిక్రముడైన వామనావతారము). "అండనైనా వుండలేదు" ఎవ్వరినీ రక్షించలేదు నరమేధం చేశావు (పరశురామావతారము). "పుడమిన్ కూడున్ కుడువనైనన్ పొద్దులేదు" స్థిమితంగా కూర్చుని భుజించే సమయం కూడా లేక అడవుల వెంట తిరిగాడు (శ్రీరామావతారము). "వెడగుద విడువలేదు" కామ, క్రోధ, మోహ పీడితమైన అవివేకం వదలలేదు (బలరాముడు). "వేదమైన జదువలేదు" వేదానికి దూరమై దూడలు కాచి తిరిగావు (శ్రీకృష్ణుడు). అడపాదడపా (అప్పుడప్పుడు) ఇట్లా కూడా అయ్యావు. మేమేమి చేయగలమయ్యా!

"ఉప్పరములు మానియైనన్ వుండలేదు" క్రిందా మీదా పడటం మానలేదు (బుద్ధుడై త్రిపురాసురుల స్త్రీలతో శృంగారం జరిపినావు). ఇప్పుడైన, "లోకమందు నీ విహారము, ఇట్లన్ ఆయెను" గుఱ్ఱమెక్కి లోకమంతా విహరించి ఇట్లా అయ్యావు (అనగా కల్కి అవతారము). చెప్పన్ అరుదు నీ గుణాలు శ్రీవేంకటేశ నీవు అందరి కంటే ఘనుడవు. ఇంకా చెప్పేదేమిటి, తండ్రీ!

6-99

## మున్నుడి

ఆధ్యాత్మిక తత్త్వం ప్రబోధిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఓ శ్రీహరీ! ఏ జన్మయితేనేం అన్నీ నీవిచ్చిన జన్మలే కదా! కుక్క బ్రతుకు కుక్కకు సుఖంగానే వుంటుంది. పురుగు జన్మ దానికి బాగానే వుంటుంది. అది వుండే గుంటే దానికి భువనేశ్వరం లాగా వుంటుంది. ఆదినారాయణుడే అఖిల రక్షకుడు కాబట్టి, తిరుమలలోని ఈ శ్రీవేంకటేశ్వరుడే జగద్రక్షకుడై తన దాసులను హెచ్చుతగ్గుల నెంచకుండా కాపాడుతున్నాడు. అందుకే సర్వప్రాణులు వాటి పరిధిలో సుఖంగానే వున్నాయి.

**కం॥ ఏదాయె నేమి శ్రీహరి!**
**ఆదిమనారాయణుండవనె అన్నమయున్**
**కాదనకు అఖిల రక్షక!**
**నీదే నా జన్మ, చాలు నీ విచ్చినదే.**

**రాగం : మిశ్ర హరి కాంభోజి**

ఏదాయ నేమి హరి యిచ్చిన జన్మమే చాలు
ఆదినారాయణుడీ అఖిల రక్షకుండు ॥ఏదాయ॥

శునకము బతుకును సుఖమయ్యే తోచుగాని
తనకది హీనమని తలచుకోదు
మనసొడబడితేను మంచిదేమి కానిదేమి
తనువులో నంతరాత్మ దైవమౌట తప్పదు ॥ఏదాయ॥

పురువుకుండే నెలవు భువనేశ్వరమై తోచు
పెరచోటి గుంతయై నప్రియమై యుండు
యిరవై వుండితే జాలు యెగువేమి దిగువేమి
వరుస లోకములు "సర్వం విష్ణుమయ" ము ॥ఏదాయ॥





అచ్చమైన జ్ఞానికి నంతా వైకుంఠమే
చెచ్చెర తన తిమ్మటే జీవన్ముక్తి
కచ్చుపెట్టి శ్రీవేంకటపతి దాసులైతే
హెచ్చుకుందేమిలేదు యేలినవాడితడే ॥ఏదాయ॥

**భావామృతం :**

ఏ జన్మ అయితే నేమి, అది శ్రీహరి ఇచ్చినదే కదా! ఈ ఆదినారాయణుడే సర్వులను రక్షించు బాధ్యత తీసికొనిన దేవదేవుడు.

ఒక కుక్కకు దాని జన్మగొప్పగానే వుంటుంది. అది ఎన్నడూ తనది హీనమైన జన్మ అని అనుకోదు. తన మనస్సు అంగీకరిస్తే మంచి జన్మేమిటి కానిదేమిటి? శరీరంలో అంతరాత్మ రూపంలో దేవుడు తప్పకుండా వుంటాడు. అందుచేతనే ఏ జీవికైనా జీవితేచ్ఛ కలుగుతుంటుంది.

ఒక పురుగునకు అది వుండే నెలవు (చోటు) దానికి భువనేశ్వరంలా తోస్తుంది. ప్రపంచంలో సర్వశ్రేష్ఠమైనదిగా అనిపిస్తుంది. పరాయిచోటనుండే గుంట యెంతో అయిష్టంగా వుంటుంది. సుస్థిరమై వుండాలి గాని ఊర్ధ్వలోకమైనా అధోలోకమైనా బేధమేమి వుంటుంది? వరుసలో వున్న లోకాలన్ని విష్ణుమయమే. కాబట్టి ఎవరు యెక్కడ వున్నా విష్ణు చింతనలో వుంటే విష్ణువుతో వున్నట్లే అవుతుంది.

నిజమైన జ్ఞానికి అంతా వైకుంఠమే. చెచ్చెర (శీఘ్రముగా) తనయొక్క తిమ్మటే (తగులమే) జీవన్ముక్తి. అనగా సంసార బంధాలలో వున్నప్పటికీ ఆ జ్ఞాని జీవన్ముక్తుడే. శ్రీ వేంకటేశుని కచ్చుపెట్టి (కోరికగల) దాసులకైతే, హెచ్చుకుందేమి లేదు (హెచ్చు తగ్గులు లేవు). వారందరికీ ఏలిక ఈ శ్రీవేంకటేశ్వరుడే.

## 6-100

### మున్నుడి

తాళ్లపాక పెదతిరుమలాచార్యులవారు, తనతండ్రి అన్నమాచార్యులవారికి తగ్గ సుపుత్రుడని అతని ఈ కీర్తనే చెప్పక చెబుతున్నది. వేదసారాన్ని గీతికలుగా పాడి శ్రీవేంకటేశుని ఆయన దేవేరిని మురిపించి మైమరపించిన తాళ్లపాక వంశస్థులు ధన్యులు. ఈ సందర్భంగా ఈ రచయిత సజల నయనాలతో ఈ కీర్తనకు మున్నుడి భావామృతాలను అందిస్తున్నాడు.

**సీ॥ శరణంటి మాతని సమ్మంధమున జేసి**
**మరిగించి మన్నించి మమ్మునేలు**
**సకల వేదంబులు సంకీర్తనలు జేసె**
**ప్రకటించి పావనై పాడె నిన్ను**
**నారద, సనక, సనందనాదులవలె**
**నిను పాడి పేరొందె నిన్నుజేరె**
**సప్తస్వరంబులే సామగానంబయ్యె**
**బాముతో సతితోడ పాడె నిన్ను**

**ఆ.వె॥ ఆముకొన్న అన్నమాచార్యవర్యులు**
**తాళ్లపాక వంశ తనరుబెంచె**
**పూర్వజన్మ కర్మ పుణ్య విశేషాన**
**దీనిజెప్పి నాను తిరుమలేశ!**

**రాగం : లలిత**

శరణంటి మాతని సమ్మంధమున జేసి
మరిగించి మమునేలి మన్నించవే ॥శరణంటి॥

సకల వేదములు సంకీర్తనలు జేసి
ప్రకటించి నినుపాడి పావనుడైన
అకలంకుడు తాళ్లపాకన్నమాచార్యుల
వెకలియై యేలిన శ్రీవేంకట నిలయ ॥శరణంటి॥





నారదాది సనక సనందనాదుల వలె
పేరుబడి నిన్నుపాడి పెద్దలైనట్టి
ఆరీతి తాళ్లపాక అన్నమాచార్యుల
చేరి యేలిన యట్టి శ్రీవేంకట నిలయ ॥శరణంటి॥

సామవేద సామగాన సప్తస్వరములను
బాముతో నీ సతి నిన్ను పాడినయట్టి
ఆముకొన్న తాళ్లపాక అన్నమాచార్యుల
వేమరు మెచ్చిన శ్రీవేంకట నిలయ ॥శరణంటి॥

**భావామృతం :**

ఓ తిరుమలేశా! ఆతని సంబంధమున జేసి (ఆయన మా తండ్రిగారగుట వలన నీవే సర్వేశ్వరుడవని బాగా మనసులో స్థిరపడిపోయి) నిన్ను శరణంటిమి. మాకు మరుగు (రక్షణ) నిచ్చి పరిపాలించి, మన్నించవే (మా తప్పులను క్షమింపుము ప్రభూ!)

వేదములన్నిటిలోని సారమును సంకీర్తనల వలె చెప్పి ప్రకటించి, నిన్ను పాడి (కీర్తించి) పావనులైన (పుణ్యాత్ములైన) అకలంకుడు (కళంకములేని) తాళ్లపాక అన్నమాచార్యులపై వెకలియై (ఆసక్తిగలవాడవై) సంరక్షించిన శ్రీవేంకటగిరి స్థానమైన శ్రీవేంకటేశ్వరా! నీకు శరణు జొచ్చెదను.

నారదుడు మొదలైన నాదబ్రహ్మలు, సనకసనందనాది ఋషుల వలె కీర్తిగాంచి నిన్ను సన్నుతుంచి, కీర్తిశేషులైన తాళ్లపాక అన్నమాచార్యులవారిని చేరి (నీవే ఆయనకు చేరువై) ఆయనను పరిపాలించితివి. అట్టి శ్రీవేంకటేశ్వరా! వేంకటాచల నివాసా! నీకు శరణు జొచ్చితిమి.

సామవేదమును సామగానము చేయుటకు సప్తస్వరములు ఆవశ్యకములు. 'సరిగమపదని' అను ఆ సప్తస్వరములను, బాముతో (పుట్టిన నాటినుంచి), నీ సతి అలమేలుమంగ కొరకు, నీకొరకు వినియోగించి, నిన్ను కీర్తించి ఆముకొన్న (అతిశయించిన) వాగ్గేయకారులు తాళ్లపాక అన్నమాచార్యులవారు. ఆయన నా తండ్రిగారు. "పదకవితా పితామహుడు" అని యెనలేని కీర్తిని సంపాదించి 32,000 పైగా సంకీర్తనలతో నిన్ను మెప్పించి నిన్ను చేరుకొన్నారు. ఆయనను వేమరు (అనేక పర్యాయములు) స్వయంగా మెచ్చుకొన్న వేంకటాచల నివాసా! ఓ శ్రీనివాసా! నిన్ను శరణుజొచ్చితిని.

"అన్యధాశరణం నాస్తి, త్వమేవ శరణం మమ"

## 6-101

## మున్నుడి

అతి శ్రావ్యమైన భజనతో అంభోదిశయనునకు మంగళము పాడుతున్నారు అన్నమాచార్యులవారు. స్వామి సుముఖుడు (అందమైన ముఖము కలవాడు). శమము(నిర్గుణత్వము), దమము (ఇంద్రియ నిగ్రహము) అను శ్రేష్ఠమైన గుణములు కల నీకు జయమంగళము అంటున్నారు. కనకాంబరుడంటే బంగారు వర్ణముగల వస్త్రములు ధరించినవాడని అర్థం. ఆశ్రిత పక్షపాతియైన ఆ శ్రీవేంకటపతిని నీవేగతి అని శరణువేడితే గొప్ప చాతుర్యంతో ఆ స్వామి ఆదుకొంటాడు. అట్టి నీకు వందనములు మంగళములు అంటున్నారు.

**ఆ.వె॥సుముఖ! మంగళంబు శుభమంగళంబని**
**శమదమ యుతునకును జయము బలికె**
**అన్నమయ్య హరికి అంభోది శయనుకున్**
**మంగళంబు బలికె మధుర మిదియె.**

**రాగం : కానడ**

సుముఖ మంగళంబు శుభమంగళము
శమదమయుతతే జయమంగళము ॥సుముఖ॥

గంభీరగుణ కమలారమణా
శంభురాణినుత సకలలోకయుత
మాంభజతే జయమంగళం
అంభోది శయన హరినయన ॥సుముఖ॥

కనకాంబర నిజ ఘన చరణాంబర
దనుజ శరణ హత దైత్యగణా
అనుపమ చరితా అనంత నిరత
సనక ప్రియతే జయమంగళము ॥సుముఖ॥





చతుర్భుజాంగా సదయాపాంగా
గతనక్రాంబుజ కరచక్రా
శ్రిత శరణాగత శ్రీవేంకటపతి
చతుర నమో తే జయమంగళము ॥సుముఖ॥

**భావామృతం :**

ఓ సుముఖా! చక్కని ముఖము కలిగిన తిరుమల నాయకా! శ్రీ వేంకటేశ్వరా! నీకు మంగళము పలికి చరితార్థుడనయ్యెదను. శమము (నిర్గుణత్వము) దమము (ఇంద్రియ నిగ్రహము) అను శ్రేష్ఠమైన గుణములు కల నీకు జయమంగళము పలికెదను.

ఓ ప్రభూ! నీవు గంభీరమైన గుణములు కలవాడవు. కమలాదేవికి (లక్ష్మీదేవికి) రమణుడవు (భర్తవు), శంభురాణియైన పార్వతీదేవిచే స్తుతింపబడు వాడవు. సకల లోకముల వారిచే భజింపబడు వాడవు. సకల లోకముల వారిచే భజింపబడువాడవు. అంబోధి శయనుడవు (క్షీరసాగరముపై పవళించువాడవు). హరినయనుడవు (సింగము కన్నులున్నవాడవు). ఇట్టి దివ్య లక్షణ లక్షితుడవైన నీకు జయమంగళము పలికెదను.

ఓ దేవదేవా! నీవు బంగారు పచ్చని పట్టు వస్త్రము ధరింతువు. నీకు ఘన అంబరమే (ఆకాశమే) నిజచరణము. (త్రివిక్రముడవైనప్పుడు ఆకాశమునంతయూ ఒక్క చరణముతో పూర్తిగా కప్పివేసితివి కదా!). మరణించబోవుచున్న దైత్యులు భయార్తులై శరణు వేడెడివాడవు. సాటిలేని దివ్యచరిత్రగలవాడవు. అనంతమైన శుభములునిచ్చువాడవు. సనక సనంద నాది ఋషులకు ప్రియమైనవాడవు.

ఓ శ్రీ వేంకటేశ్వరా! నీ దేహమున నీవు నాలుగు భుజములు (హస్తములు) కలవాడవు. హృదయమున కరుణ నిండిన వాడవు. మొసలిని ఖండించిన చక్రాయుధముచేత ధరించిన వాడవు. శరణన్న ఆశ్రితులను రక్షించు వాడవు. చతురుడైన నీకు నమస్కారములు. నీకు జయము మంగళము కలుగుగాక!